# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## బాడీగార్డ్!

రచన: 'సికిందర్'

## మృత్యు రహస్యం?

34

రచన: వసుంధర

## ఇత్తడి బంగళా!

రచన: అజీజ్

## శత్రువులు ముగ్గురు!

రచన: సుజనశ్రీ

## అడుగు ముందుకు వేస్తే చస్తావ్!

నాల్గవ భాగము—రచన: వసుంధర

అపరాధ పరిశోధన సప్లిమెంట్—64
ఏప్రిల్, 1979
వెల : రు. 3-50
ఏడాది చందా 45 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

గడా రంగారావు

# బాడీగార్డ్?

'సికిందర్'

స్వామి ది గ్రేట్ విలాసంగా సిగరెట్ తాగుతూ బెంజికారు డ్రైవ్ చేస్తున్నాడు. విశాలమైన బషీర్ బాగ్ రోడ్డుమీద మెత్తగా జారిపోతోంది కారు. అతని నల్లటి చురుకైన కళ్ళు ట్రాఫిక్ ని జాగ్రత్తగా కనిపెడుతున్నాయి...

స్వామి వయసు 24. చిన్నకళ్ళు, పెద్దముక్కు, దృఢమైన నల్లటిశరీరం-పొట్టిగా వుండి చూసేవాళ్ళకు నీగ్రోలా కన్పిస్తాడు.

రెండేళ్ళనుంచీ అతను శ్రీమతి గిరిజా రామకృష్ణ దగ్గర పనిచేస్తున్నాడు డ్రైవర్ గా.

శ్రీమతి గిరిజారామకృష్ణ ధనవంతురాలు. ఆమె ఆస్తి సుమారు తొంభైలక్షలుంటుందని అంచనా. ఇప్పుడామె వయసు 61. అయిదేళ్ళ క్రితం ఆమె భర్త మరణించాడు.

ఆమెకిప్పుడు బంధువులంటూ ఎవరూ లేరు, లేక లేక కలిగిన ఏకైక సంతానం సరోజ తప్ప.

సరోజ వయసు 22. ఇంకా అవివాహిత. మగజాతి మీద ఆమెకు విపరీతమైన ద్వేషంవుంది. ఆ ద్వేషానికి కారణం ఫలానా అని చెప్పదు. మగవాళ్ళంతా స్వార్థపరులనీ, మోసబుద్ధిగలవారనీ, స్త్రీని నీచాతి నీచంగా చూసే దుష్టజీవులనీ ఆరోపిస్తూంటుంది. తన మనసుమీద గాని, దేహం మీద గానీ, ఏ మగాడికీ అధికారం ఇవ్వనని శపథం చేసింది.

మరొక ముఖ్యవిషయమేమిటంటే, ఆమె స్త్రీ విమోచన సంఘానికి అధ్యక్షురాలు. ఆ సంఘాన్ని ఆమే స్థాపించింది. ఆడవాళ్ళపట్ల జరిగే అత్యాచారాలను వ్యతిరేకిస్తూ ప్రదర్శనలివ్వడంలో ఆమె ఆరితేరిన దిట్ట.

వంచించబడ్డ స్త్రీలంతా ఆమె పంచన చేరుతారు. వాళ్ళంతా ఆమెదగ్గర ధనసహాయమేకాదు, ముక్కలైపోయిన తమ జీవితాల్లో కరువైన ప్రేమాభిమానాల్ని కూడా పొందుతారు.

ప్రతివారం సరోజ 'బేడ్'లో వ్రాస్తోన్న వ్యాసాలు మహిళాలోకాన్ని విపరీతంగా ఆకర్షిస్తున్నాయి.

అయితే సరోజ ప్రవర్తన, ఆమె మనస్తత్వం ఆమె తల్లి గిరిజని ఎంతో ఆందోళనకి గురిచేస్తున్నాయి. సరోజ పెళ్ళి చేసుకోడమన్నది కలలో కూడా వూహించకూడని విషయం. గిరిజ తర్వాత ఆస్తికి ఏకైక వారసురాలు సరోజ. అంతేగాక, ఆమె పెళ్ళిచేసుకోకపోతే ఆ వంశం అంతటితో అంతమైపోతుంది.

కూతురి మనస్తత్వాన్ని మార్చాలనీ, ఆమె పెళ్ళి చేయాలనీ ఎంతగానో ప్రయత్నిస్తూ అడుగడుగునా విఫలమవుతోంది గిరిజ.

ఆ స్త్రీవ్యవహారాలన్నీ చూసేందుకు మేనేజర్ ఎ.బి.రావ్ వున్నాడు-పూర్తి పేరు ఎ. బ్రహ్మానందరావు. నమ్మకంగల వ్యక్తి. ఇరవైఏళ్లుగా ఉద్యోగంలో వుంటున్నాడు. బ్రహ్మచారి. దుర్వ్యసనాలు లేవు. పాగతాగడం తప్ప.

గిరిజ భర్త రామకృష్ణ చనిపోతూ వదిలిన ఆస్తివిలువ 80 లక్షలయితే, ఈ అయిదేళ్ళలో అది తొంభైలక్షలవడానికి కారకుడు ఎ.బి.రావ్. అందుకే అతనంటే గిరిజకు అంత అభిమానం. ఆ అభిమానం ఎలాటిదంటే తన వ్యక్తిగత విషయాలు కూడా అతనితో చర్చించకుండా వుండలేదు.

ఇప్పుడు గిరిజకు సిటీలో ఒక సినిమా థియేటర్, ఒక హోటల్, ఒక ఫైనాన్సింగ్ కంపెనీ మొదలైనవి వున్నాయి. ఇంకా యితర చిన్న వ్యాపారాలు కొన్ని వున్నాయి.

ఇంట్లో ఆమె దినచర్యల్లో సహాయపడేందుకు ఆయాగా అనిత వుంది. ఆమెవయసు ఇరవై. అనాథ. ఉదయం కాలకృత్యాలనుంచి, రాత్రి నిద్రపోయేవరకు ప్రతిపని లోనూ ఆమె గిరిజకు సహాయపడుతుంది...

స్వామి ది గ్రేట్ కారు హోటల్ కంపాలా చేరు కుంది. అతను కారుదిగి జేబులోంచి ఖరీదైన సిల్కు రుమాలు తీసి చెమట తుడుచుకున్నాడు. గిరిజలాటి ధనిక రాలి దగ్గర పనిచెయ్యడం ఏ జన్మలోనో చేసుకున్న పుణ్య మని అతని అభిప్రాయం.

ఇప్పుడతను పదిహేనువందల జీతంలో వంటరిగా విలాసజీవితం వెలగబెడుతున్నాడు.

చకచక హోటల్లోకి నడిచి కౌంటర్ దగ్గర ఆగాడు. క్లర్కు అతన్ని విష్ చేసి పలకరింపుగా నవ్వాడు.

"డిటెక్టివ్ కామేష్ ప్లీజ్!" స్వామి అన్నాడు సీరియస్‌గా.

"యస్," అని క్లర్క్ కీబోర్డు వేపు తిరిగి, "రూం వన్-వన్-ఫోర్" అన్నాడు.

స్వామి థాంక్స్ చెప్పి వెనుదిరిగాడు.

కొన్ని నిమిషాలయ్యాక అతను రామేష్ గదిముందు వున్నాడు.

కాలింగ్ బజర్ శబ్దం విని డిటెక్టివ్ రామేష్ లేరు కున్నాడు. చదువుతోన్న మహోజ్వల సాంఘిక నవల మూసి టీపాయ్‌మీద పెట్టాడు. ఆ తర్వాత టైం చూసు కున్నాడు. 11:15.

"యస్, కమింగ్!" అవరిచి లేచి వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగావున్న మనిషిని చూసి ముఖం చిట్లించి, "కమిన్ ప్లీజ్!" అన్నాడు.

స్వామి లోనికడుగువేసి రామేష్‌ని చూశాడు.

అతనికి ఆశ్చర్యం కలిగింది.

రామేష్‌కి 26 ఏళ్ళుంటాయి. తెల్లటిరంగు. నల్లటి ఉంగ్రాలు జుట్టు.

మూవీస్టార్ రిషీకపూర్‌లా వున్నాడు. ముఖంలో డిటెక్టివ్‌కి కావలసిన లక్షణాలు లేవు.

ఈ మనిషి బాస్‌కి ఏం పనికి వస్తాడు! స్వామి అను కున్నాడు.

రామేష్‌లో డిటెక్టివ్‌కి కావలసిన లక్షణాలు వున్నాయో లేవో చెప్పటం కష్టం కానీ, అతను మాత్రం మద్రాసులో కొమ్ములు తిరిగిన డిటెక్టివ్‌ల ధాటికి తట్టుకో లేక హైద్రాబాదు వచ్చిపడ్డాడు.

లైసెన్సు తీసుకుని కేవలం సంవత్సరం గడిచింది. అతనికి డబ్బుదాహం విపరీతం. డిటెక్టివ్‌వృత్తి చేపడితే సులభంగా డబ్బు సంపాదించే మార్గాలు చాలావున్నా

యని తోచింది. కానీ ఈ సంవత్సర కాలంలో ఏమీ సంపాదించలేదు_కనీసం డిటెక్టివ్‌కి అత్యంత అవసరమైన కారు కూడా!

మద్రాసులో పేరుబడ్డ డిటెక్టివ్‌లు అతన్ని బ్రతకనివ్వ లేదు.

అందువల్ల హైద్రాబాదుమీద కన్ను పడింది. ఇక్కడైతే డిటెక్టివ్‌లు మచ్చుకి కూడా కానరారు. విపరీతంగా డబ్బు చేసుకోవచ్చు! కారు...బంగళా...బ్రహ్మాండమైన ఆఫీసు...వినయంగల అసిస్టెంట్స్...సంఘంలో పలుకుబడి, హోదా...ఆ తర్వాత ఒక ధనవంతుడి కూతురు... ఇలా రాత్రీ పగలూ కలలుకంటూ అతను నెలరోజుల నుంచి సిటీలో కాలక్షేపం చేస్తున్నాడు—ఒక్క కేసూ రాలేదు!

పత్రికలలో ప్రకటనలిచ్చాడు, పోలీసు అధికారుల్ని పరిచయం చేసుకున్నాడు, ధనవంతుల దర్శనం చేసుకున్నాడు...ఇంకా చేయవలసిన ప్రయత్నాలన్నీ చేసి, చివరికి విసిగిపోయి ఒక నిర్ణయానికి వచ్చాడు: ఈ సిటీలో ప్రజలు వట్టి అమాయకుల్లావున్నారు. ఏదేనా అపాయంలో చిక్కుకుంటే వీళ్ళకి లాకీదుసులు తప్ప మరేమీ కన్పించవు! డిటెక్టివ్ అనబడే మానవుడు కష్టాల్లోవున్న వారిని ప్రత్యేక శ్రద్ధతో, ప్రతిభతో ఆదుకుంటాడని వీళ్ళకి తెలియదు!

ఇక్కడ లాభంలేదు! మకాం మరోచోట మార్చాలి! ఎక్కడ? బొంబాయి! అవును. అక్కడ రోజురోజుకీ నేరాలు పెరిగిపోతున్నాయని వినికిడి.

ఈ ఆలోచనరాగానే కామేష్‌లో నూతనోత్సాహం వచ్చింది.

మరో రెండురోజుల్లో అతను బొంబాయి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నాడు. అక్కడకూడా అదృష్టం వరించకపోతే సముద్రంలో దూకెయ్యాలని కూడ నిశ్చయించుకున్నాడు.

అయితే ఇప్పుడు అనుకోని విధంగా లోనికి ప్రవేశించిన వ్యక్తినిచూసి అతనికి ఆశ్చర్యం వేసింది.

ఇంతవరకూ ఈ గదిలో బట్లర్‌తప్ప మరో మానవుడు ప్రవేశించలేదు.

తేరుకుని "యస్‌ప్లీజ్, మీరెవరూ?" అనడిగాడు, వినయం నటిస్తూ.

"నాపేరు స్వామిద్రేట్! మీరు నాతో రావాలి."

రామేష్ ముఖం చిట్లించాడు. స్వామి మాటలు అర్థం కాలేదు.

"ఎక్కడికి?"

"నేను తీసుకెళ్ళేచోటుకి. మిమ్మల్ని తీసుకురమ్మని మాడమ్ చెప్పారు"

"మీ మాడమ్ ఎవరు?"

"మిసెస్ గిరిజారామకృష్ణ. ఆమె మీకు తెలియదు"

వెంటనే రామేష్ జాగ్రత్త పడ్డాడు, "నాతో ఏం పని మిస్టర్ గ్రేట్?"

"ఇప్పుడేమీ చెప్పలేను. నాతో వస్తే తెలుస్తుంది. మాడమ్ మీతో చాలా ముఖ్యమయిన విషయం మాట్లాడాలిట. నిజంగా మీకు డబ్బు సంపాదించాలని వుంటే—"

"ఆల్ రైట్! ఆల్ రైట్! పదండి" చటుక్కున అన్నాడు రామేష్.

బయటికివచ్చి కారెక్కాక ఇది కలా, నిజమా అని ఆశ్చర్యపోయాడు.

డామిట్! ఇన్ని రోజులకి అదృష్టం వెతుక్కుంటూ వచ్చింది. జార విడుచుకోకూడదు. కేసు యెలాటిదై వుంటుంది? ఈ క్లయింట్ దగ్గర డబ్బుచాలా వున్నట్టు వుంది. ఫీజు ఎంత అడిగితే బావుంటుంది?

## 2

కారు బంజారా హిల్స్‌లో శ్రీమతి గిరిజారామకృష్ణ బంగళా చేరుకున్నాక ఇద్దరూ దిగారు.

బంగళా ఆవరణలోని వాతావరణం చూసి ముచ్చట పడ్డాడు రమేష్.

ఇద్దరూ వరండాలో కొచ్చారు. అనిత ఎదురయింది. ఆమె అందానికి ఒకక్షణం బిత్తరపోయి, తేరుకొని, రెండుచేతులూ జోడించి నమస్కరించాడు రమేష్. అతను ముందుకి సాగిపోయాక అనిత ఫక్కున నవ్వుకుంది.

స్వామి, రమేష్‌ని హాలుకు కుడివేపునవున్న గదిలోకి తీసుకెళ్ళి వదిలిపెట్టి వెళ్ళిపోయాడు.

గదిలో సోఫాలో గిరిజ, మేనేజర్ ఎ. బి. రావ్ కూచొనివున్నారు. గిరిజ రమేష్‌ని పరీక్షగా చూసి, తృప్తిగా తలాడించి, కళ్ళతో రావ్‌కి సైగ చేసింది.

రమేష్ తేలుకొని, "గుడ్మార్నింగ్ మాడమ్—గుడ్ మార్నింగ్ సర్!" అన్నాడు.

రావ్ నిట్టూర్చి, "మిస్టర్ రమేష్, అలా కూచో. నీతో చాలా విషయాలు మాట్లాడాలి. కేసు అప్పగించ గించడానికి కాదు—మాదగ్గర నువ్వొక కాంట్రాక్టు స్వీక రించాలి" అన్నాడు.

రమేష్ తికమకపడుతూ కూచున్నాడు. 'కాంట్రాక్టు' అనే పదం ఉపయోగించడంలో రావ్ ఉద్దేశ్యమేమిటో అతనికి అంతుబట్టలేదు.

"సర్. ఏం కాంట్రాక్టు?"

"ఏ కాంట్రాక్టయినా నువ్వు అంగీకరిస్తావని నాకు తెలుసు రామేష్. నువ్వప్పుడేమీ చేయడంలేదు— హోటల్ గదిలో కాలక్షేపం తప్ప. మిస్టర్ రామేష్, సోమరిపోతులంటే నా కసహ్యం!"

రామేష్ ముఖం ఎర్రబడింది.

"ఎక్స్‌క్యూజ్ మీ! నేను సోమరిపోతును కాదు! నా తెలివి తేటల్ని వినియోగించుకోలేని మీరంతా దద్దమ్మలు" అన్నాడతను సీరియస్‌గా.

రావ్ అవాక్కయిపోయాడు. ఈసారి అతని ముఖం ఎర్రబడింది.

గిరిజ రామేష్‌ని మెచ్చుకోలుగా చూసి రావ్‌తో అంది "బ్రహ్మ! నువ్వు ఒళ్ళుదగ్గర పెట్టుకుని మాట్లాడు. ఇతనెంతో చలాకీగా కన్పిస్తున్నాడు. సోమరిపోతు అంటావేమిటి?"

"ఓకే! చూడు రామేష్, నువ్వు నాకు నచ్చావు. ఆ మాత్రం పౌరుషమున్న మనిషి చాలు" రావ్ అన్నాడు. "నేను నీగురించి దర్యాప్తు చేశాను. నిజాయితీ పరుడివి. నమ్మకంగా వుంటావు. అయితే ఒక విషయం మాత్రం నమ్మకంగా చెప్పగలను. నువ్వు ఏ ఆశయంతో నయితే ఈ వూరికి వచ్చావో, ఆ ఆశయం నెరవేరదు. ఇక్కడి ప్రజలకి డిటెక్టివ్‌ల అవసరం ఇప్పట్లో లేదు! అర్థమైందా!"

"అర్థమయింది" రామేష్ విసుగ్గా అన్నాడు, "ఐతే మీరు చెప్పేదేమిటి? ఈ సిటీ వదలి వెళ్ళిపోవాలా?"

గిరిజ మరింత మెచ్చుకోలుగా చూసింది.

రావ్ ఒకక్షణం విస్తుపోయి అన్నాడు, "ఆ అవసరం నీకురాదు. ఈ సిటీకాదు— ఈ బంగళా వదలి వెళ్ళే అవసరం నీకురాదు!"

రమేష్ అసహనంగా చూశాడు. "చూడండి సర్, మీరు చెప్పేదేమిటో సూటిగా చెప్పండి. భూమి గుండ్రంగావుందని మీకు తెలుసు—అనవసరంగా డొంక అన్నీ తిప్పకండి!"

రావ్, గిరిజని చూశాడు. ఆమె తలూపింది.

వెంటనే రావ్ అన్నాడు, "రమేష్, బాడీగార్డ్‌గా వుండటం నీ కిష్టమేనా?"

రమేష్ సూటిగా చూశాడు. కళ్ళు చిట్లించాడు. ఆ తర్వాత అన్నాడు:

"ఎవరికి? బాడీగార్డ్ అవసరం ఎవరికి?"

గిరిజ నిట్టూర్చి తల వంచుకుంది.

"సరోజకి, సరోజ ఈమెగారి కూతురు," రావ్ అన్నాడు.

"మీ రెవరు?"

"మేనేజర్ని—ఈమె బిజినెస్ అంతా నేనే చూస్తాను. మై నేమ్ ఈజ్ ఎ. బి. రావ్. నో మిస్టేక్—ఐయామ్ బి. ఎ."

రమేష్ కాస్సేపు గిరిజనీ, రావ్‌నీ చూస్తూ ఆలోచిస్తూండిపోయాడు.

"మిస్టర్ రమేష్," రావ్ మళ్ళీ అన్నాడు, "పాతికేళ్ళ వయసులో నువ్వు కొమ్ములుతిరిగిన డిటెక్టివ్‌వి కాలేవు. ఈ ఉద్యోగంలో నువ్వు చేరితే రెండు వేల రూపాయల జీతం వుంటుంది. తిండి వుచితం. నివాసం అవుట్ హౌజ్‌లో. ఇక నువ్వు చెయ్యవలసిందల్లా సరోజ ఎక్కడికి వెళితే అక్కడికి వెంటవుండాలి. ఆమెని జాగ్రత్తగా కనిపెడుతుండాలి—దుర్మార్గుల బారినుంచి."

రమేష్ మళ్ళీ ఆలోచించాడు.

బాడీగార్డ్!

అదీ ఒక ఆడమనిషికి! మైగాడ్, అదృష్టమంటే యిదేనా?

అయితే జారవిడుచుకోవద్దు! మరి బొంబాయి విషయమేమిటి? తను కన్న కలలు గురించి ఏమిటి? ఇరవై నాలుగు గంటలూ తన ఆలోచనలన్నీ డబ్బుగురించే గదా! ఆ డబ్బు బాడీగార్డ్ గా సంపాదించగలడా? కాదు. వీలు కాదు! తను ఆరితేరిన డిటెక్టివ్ కావాలి! ఇండియాలో పేరుప్రఖ్యాతులు సంపాదించాలి! బంగళా...కారు...అసిస్టెంట్స్...ఇంకా, ఇంకా...ఎన్నో సంపాదించవలసివుంది! ఇక్కడ బాడీగార్డ్ గా కాలక్షేపం చేస్తూ కాదు.

మరుక్షణం కామేష్ చెవుల్లో రావ్ మాటలు మార్మోగాయి.

రెండువేలరూపాయల జీతం — తిండి వుచితం — అవుట్ హౌజ్ లో నివాసం — చేయవలసింపల్లా ఒక అమ్మాయివెంట తిరగడం!

కామేష్ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

శాశ్వతంగా కాకపోయినా తాత్కాలికంగా ఈ సౌఖ్యాన్ని అనుభవిస్తే? నష్టమేమిటి? అవును. పాతికేళ్ళ వయసులో తను కొమ్ములు తిరిగిన డిటెక్టివ్ కాలేదు!

ప్రస్తుతానికి 'బొంబాయి ఆలోచన' వాయిదా వేయాలి.

ఇక్కడ అదృష్టదేవత బిగియారా కౌగలించుకుంది. కసిరికొట్టేందుకు మనసు అంగీకరించడంలేదు!

"ఓ. కే. సర్. ఈ వుద్యోగం నాకు నచ్చింది" అన్నాడు చివరికి.

"వెరీగుడ్! అయితే పద, సరోజను చూపిస్తాను—"

రావ్ మాటలకు అడ్డుతగిలింది గిరిజ:

"రామేష్, ఈ మూడురోజుల నుంచి అది ఇల్లుకదల లేదు. ఇప్పుడు దాన్ని నీ చేతిలో పెడుతున్నాను. దాన్ని రక్షించే బాధ్యత నీది. అది వట్టి మూర్ఖురాలు! దానికి మగవాళ్ళంటే అసహ్యం. దాన్ని భవిష్యత్తు ఇప్పుడు చాలా ప్రమాదకరంగా వుందనిపిస్తోంది—"

గిరిజ మాటలకి రావ్ అడ్డుతగిలాడు:

"మాడమ్! మీరేమీ దిగులుపడికండి. నేనున్నంత కాలం మీ కుటుందానికలాటి ప్రమాదమూ వాటిల్లదు! నిశ్చింతగా వుండండి."

అనిత గదిలో ప్రవేశించింది.

రావ్ లేచి రామేష్‌కి సైగచేశాడు. ఇద్దరూ బయటికి నడిచాడు.

ఇద్దరూ హాల్లో సోఫాల్లో కూచున్నాక రావ్ అన్నాడు, "నీకంతా అయోమయంగా వుందికదూ? క్రమంగా బోధపడుతుంది. ఈ న్యూసెన్స్ అంతా సరోజ వల్లనే ఏర్పడింది! సాంప్రదాయాన్ని, కట్టుబాట్లనీ తెంచుకున్న ఆడదాని భవిష్యత్తు ఏమిటి?"

రామేష్ మెదడు పనిచేయడం మానేసింది.

ఈ ఉద్యోగ విషయంలో కుటుంబ వ్యవహారాల ప్రసక్తి ఎందుకో అతనికి అర్థంగావడంలేదు.

రావ్ సిగరెట్ వెలిగించి మళ్ళీ అన్నాడు:

"సరోజ చిత్రమైన మనిషి. ఆమెకా మన స్తత్వం అలవడటానికి బాల్యంలో ఏదో సంఘటన కారణం కావచ్చు-అది ఆమెకే తెలియను. అయితే తలిదండ్రుల పెంపకం మాత్రం కారణంకాదు. ఆమె లేకలేక కలిగిన బిడ్డ-చాలా గారాబంగా పెంచారు.

"రామేష్, సరోజ మగవాళ్ళని అసహ్యించు
కుంటుంది. ప్రతి మగవాడు మోసబుద్ధి గలవాడనీ, స్త్రీని
బానిసగా చూసే స్వార్థపరుడనీ ఆమె అభిప్రాయం. ఆ
అభిప్రాయాల్ని ప్రచారం చేస్తోంది కూడాను.

"ఈ ప్రచారం ఎంతోమంది స్త్రీలని ఆకర్షించింది.
వంచించబడ్డ స్త్రీలంతా సరోజని ఆరాధిస్తారు. ఈ స్త్రీ
లంతా కలిసి ఒక సంఘంగా ఏర్పడ్డారు-స్త్రీ విమోచన
సంఘం. దానికి ప్రెసిడెంట్ సరోజ.

"అయితే సరోజ అలా మగవాళ్ళని బాహాటంగా
విమర్శించడం, బహిరంగ ప్రదర్శనలివ్వడం కొందరికి
కన్నెర్ర జేసింది. సరోజ పొగరు అణచాలని నిశ్చయించు
కున్నారు. సరోజ జీవితంలో పెళ్ళిచేసుకోననీ, తన
దేహంమీదగానీ, మనసుమీదగానీ ఏ పురుషుడికీ అధి
కారం ఇవ్వనని ఎన్నోసార్లు ప్రతిజ్ఞ చేసింది.

"ఈ ప్రతిజ్ఞ ఆమె శత్రువులకి ఛాలెంజిగా పరిణమిం
చింది. ఈ విధంగా సరోజ బయట శత్రువుల్ని సంపా
దించుకుంది. ఇంట్లో సరేసరి! తల్లికీ ఆమెకూ సఖ్యత
కుదరదు! కూతురిపెళ్ళి చేయాలనీ, మనవళ్ళతో కాల
క్షేపం చేయాలనీ మాడమ్ తపించిపోతోంది. రోజురోజుకీ
ఆమె మానసిక స్థితి దిగజారిపోతోంది. రామేష్, సరోజ
ఆత్మహత్య చేసుకుంటానని కూడా బెదిరిస్తోంది...

"నేను ఎన్నో సార్లు ఆమెకి మంచిచెడ్డలు వివరించి
చెప్పాను. నేను పెళ్ళి చేసుకోలేదు. బ్రహ్మచారిగా
నేను ఎన్ని కష్టాలు ఎదుర్కొంటున్నానో నాకు తెలుసు.
మగవాడిని నేను యిన్ని సమస్యలు ఎదుర్కొంటూంటే,
ఆడదిగా సరోజ పెళ్ళిచేసుకోకుండా ఈ లోకంలో ఎలా
ఇముడగలుగుతుంది? సమాజంలో పెళ్ళికాని స్త్రీ విలు
వేమిటి?"

రామేష్ తల బరువెక్కింది. "ఎక్స్‌క్యూజ్ మీ సర్! నాకేమీ అర్థంగావటంలేదు. ఈ విషయాలన్నీ నాకెందుకు చెప్తున్నారు?"

"ఎందుకంటే- నేటినుంచి నువ్వు పరాయివాడివి కావు గనుక!" రావ్ అన్నాడు వెంటనే, "రామేష్ నీ సహాయం నాకు చాలా అవసరం. సరోజని నేను స్వంత కూతురికంటె ఎక్కువగా చూసుకుంటాను. ఆమెకేదేనా సంభవిస్తే మాడమ్ సంగతి దేవుడెరుగు — నేను పిచ్చివాడ్నయిపోతాను. జీవితాంతం కుమిలిపోతాను. ఆ అమ్మాయి పుట్టినప్పటినుంచి నా కళ్ళముందు తిరుగుతోంది. నేను కళ్ళుమూసేవరకూ తిరగాలి!"

ఆవేశంగా వున్న రావ్ మాటలు రామేష్‌కి కంగారు పుట్టించాయి.

"రామేష్, ఆమె అభిప్రాయాలే ఆమె శత్రువులౌతాయని మూడురోజుల క్రితం వరకు నేను వూహించలేదు!" రావ్ మళ్ళీ అన్నాడు.

"మూడురోజుల క్రితం ఏం జరిగింది?" రామేష్ అడిగాడు వెంటనే.

రావ్ ముఖం కందిపోయింది.

"ఆమెమీద దౌర్జన్యం జరిగింది" అన్నాడతను తగ్గు స్వరంతో.

"ఆమె అభిప్రాయాలు, ఆమె నిర్ణయాలు, ఆమె విమర్శలు కొందరు యువకుల్ని రెచ్చగొట్టాయి. ఏ విధంగానైనా ఆమెకి గుణపాఠం నేర్పాలనీ, బుద్ధిచెప్పాలనీ నిశ్చయించుకున్నారు."

"అయితే వాళ్ళేంచేశారు?"

"మూడురోజుల క్రితం సాయంత్రం చీకటిపడ్డాక ఆమె కారుమీద వాళ్ళు దాడిచేశారు. ఆమెని అపహ

రించాలని వాళ్ళ వుద్దేశ్యం. కానీ స్వామి సమయస్ఫూర్తి వలన ఆ ప్రమాదం తప్పిపోయింది.

"ఎలా?"

"రాత్రి ఎనిమిదిగంటలకి ఆమె కార్లో ఇంటికి తిరిగి వస్తోంది. స్వామి డ్రైవ్ చేస్తున్నాడు. ఇది బంజారా హిల్స్ ప్రాంతం. పగలే నిర్మానుష్యంగా వుంటుంది. రాత్రి వూహించుకోవచ్చు. కారు బంజారా హిల్స్ చేరు కుంటుందనగా దారిలో ఆ యువకులు అటకాయించారు. వాళ్ళకీ కారువుంది.

"వాళ్ళంతా సరోజ కారు చుట్టుముట్టి చాలా నీచ మయిన భాషలో కామెంట్సు చేశారట! ఆ నల్గురూ సరోజని కారుదిగి తమ కారు ఎక్కమన్నారట. అసలే ఆమెది రెచ్చగొట్టే అందం. అందులో ఆమె విమర్శలు ఇంకా రెచ్చగొడుతున్నాయి—ఆ రాత్రి ఆమెమీద కసి నంతా తీర్చుకోవాలని, మళ్ళీ తలెత్తుకోకుండా నవ్వుల పాలు చేయాలనీ చెప్పారట.

"సరోజ కారు దిగలేదు. వాళ్ళలో ఒకడు పిస్టల్ తీసి బెదిరించాడు. స్వామీ ఏమీ చేయలేక పోయాడు. వాడికి చాలా ధైర్యంవుంది. కానీ శత్రువులదగ్గర పిస్తోలు వుంది. సరోజ కంగారు పడింది. ఆ దుండగుల కోరిక తీరిస్తే ఎలాంటి అవమానం పాలవుతుందో ఆమెకి తెల్సు.

"కారు దిగకపోతే ఆమెని బలవంతంగా బయటకు లాగారు. ఆమె అరిచింది. వినేవారులేరు, శత్రువులు తప్ప. స్వామి కదలకుండా కారు కిటికీలోంచి పిస్తోలు గురిపెట్టి నిల్చున్నాడొకడు. స్వామికి భయం రెుక్కువ అయింది.

"మిగిలిన దుర్మార్గులు సరోజని తమ కారుదగ్గర కీడ్చు కెళుతున్నారు. ఆమె గింజుకొంటోంది. అరుస్తోంది

కారుడోర్ తెరచి ఆమెను లోనికి నెట్టబోతుండగా, ఇక్కడ స్వామి తెలివయినపని చేశాడు—రాస్కెల్ కి అంత ధైర్యం ఎలావచ్చిందో?"

"ఏం చేశాడు?"

"సరోజని కార్లోకి నెట్టబోతుండగా స్వామిదగ్గర కాపలావున్న మనిషి అటుతిరిగి చూశాడు ఓ క్షణం— అంతే! స్వామి ఛటుక్కున పిస్తోలు లాక్కున్నాడు. వెంటనే మూడుసార్లు గాలిలోకి పేల్చాడు. కాపలావున్న మనిషి దూరంగా వురికాడు. స్వామి మరో రెండురౌండ్లు కాల్చాడు. అవతల కారు స్టార్టయింది. ప్రాణాలు రక్షించుకోడానికి శత్రువులు కార్లో దూకుతుండగా సరోజ తప్పించుకుంది. స్వామి మరొకరౌండ్ పేల్చే లోపున శత్రువులు పలాయనం చిత్తగించారు..."

కామేష్ నిట్టూర్చాడు.

రావ్ మళ్ళీ అన్నాడు, "ఆ తర్వాత వాడు సరోజని క్షేమంగా ఇంటికి చేర్చాడు. చేసిన ఘనకార్యానికి వాడు ఏమీ గర్వపడలేదు. వాడిలో గర్వంలేదు. అదే నాకు నచ్చింది. వాడి సాహసానికి నేను గర్వపడి బిరుదు ఇచ్చాను—డిగ్రేట్. వాడిప్పుడు స్వామిదిగ్రేట్."

ఈ సంఘటన గురించి పోలీసులకి రిపోర్టుచేశారా?"

"పోలీసుల అవసరం నాకులేదు. నేను స్వయంగా శిక్షలు విధిస్తాను. స్వామి చెప్పిన కారు నెంబరు సహాయంతో నా మనుషులు దుర్మార్గులని పట్టుకొని మొహాన ఆసిడ్ పోశారు" అన్నాడు రావ్.

కామేష్ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. "ఇది చాలా ఘోరం!"

"నా శిక్షలు అలాగే వుంటాయి" రావ్ అన్నాడు. "ఆల్ రైట్! ఇప్పుడు అసలు విషయం మాట్లాడుకుందాం. ఆ సంఘటన జరిగాక సరోజకి తగిన రక్షణ ఏర్పాటు చేయాలన్న ఆలోచన వచ్చింది. ఈ ఆలోచన నిన్నిక్కడకు పిలిపించింది. ఏమంటావ్?"

"సరోజ ఒప్పుకుంటా?"

"ఆమెను సంప్రదించాను. ఒప్పుకుంది."

"ఇప్పుడామె ఎక్కడవుంది?"

"మేడమీద. బహుశ వచ్చే సంచికకోసం వ్యాసం వ్రాస్తుండవచ్చు!"

"పదండి, ఆమెను చూడాలి."

ఇద్దరూ లేచి లోనికి నడిచారు.

# 3

రామేష్. సరోజకి బాడీగార్డ్‌గా కుదిరాడు. ఎ. బి. రావ్ మొదటి నెలజీతం అడ్వాన్సుగా ఇచ్చాడు. రామేష్ హోటల్ గది ఖాళీచేసి అవుట్ హౌస్‌కు మారాడు.

అవుట్ హౌస్‌లో రెండుగదులు, కిచిన్, బాత్ రూం మొదలయినవి వున్నాయి. రామేష్ అవుట్ హౌస్ నానుకొని స్వామి అవుట్ హౌస్ వుంది.

మధ్యాహ్నం రామేష్ బంగళాలో భోజనం చేశాడు. అనిత వడ్డించింది. బిడియపడుతూ సరిగా తినలేకపోయాడు రామేష్.

సాయంత్రం అయిదుగంటలకి సరోజ సిటీలోకి వెళ్ళాలని చెప్పింది. ఇంట్లో బెంజి కాక మరో ఫియట్ వుంది.

తనతో కారులో ప్రయాణించేందుకు సరోజ ఒప్పుకోలేదు. రామేష్ ఫియట్‌లో వెనక రావాలి. బెంజి స్వామి డ్రయివ్ చేస్తాడు. ఎదురుగా ఏదేని అపాయంలో ఇరు

ప్పుడే సూచన కనిపిస్తే స్వామి మూడుసార్లు హారన్ మోగించాలి. అప్పుడు వెనకవున్న రామేష్ తగినచర్య తీసుకుంటాడు.

అతని దగ్గర రెండు ఆటోమాటిక్ రివాల్వర్లుంటాయి. పరిస్థితి విషమిస్తే షూట్ చేయడానికి సందేహించకూడదనీ, పోలీసు గొడవులు ఏవయినావుంటే తను చూసుకుంటానని హామీ యిచ్చాడు రావ్.

రోజులు గడుస్తూంటే రామేష్‌కి యీ ఉద్యోగమే ఎంతో హాయి అనిపిస్తోంది. చేయవల్సిందేమీ వుండదు.

సరోజ ఎక్కడికి వెళితే అక్కడికి ఆమెవెంట వెళ్ళాలి. పరిసరాల్ని, మనుషుల్ని జాగ్రత్తగా గమనిస్తూండాలి. అనుమానాస్పద వ్యక్తులెవరయినా సరోజతో రావాలని కల్పించుకొని మాట్లాడుతుంటే తను జోక్యం చేసుకుని ఆవ్యక్తితో సంభాషణలోకి దిగాలి. ఆ సంభాషణ 'జాగ్రత్తసుమా, నేను బాడీగార్డ్‌ని!' అన్న ధోరణిలో వుండాలి...

సరోజ అతనితో యెక్కువ మాట్లాడక పోయినా రామేష్ నిరాశపడలేదు. ఆమె అందమయిన విగ్రహం కళ్ళముందు కదులుతోంటే చాలనుకున్నాడు.

రోజంతటికీ సరోజ 3, 4 గంటలు బయట గడుపుతుంది. మిగిలిన సమయమంతా రామేష్‌కి కాలక్షేపమే.

స్వామి ది గ్రేట్ రామేష్‌తో చాలా సన్నిహితంగా మెలగసాగాడు. కానీ అదీ చాలా తక్కువ. ఇద్దరూ తీరిగ్గా కబుర్లు చెప్పుకునే అవకాశం లేదు. స్వామి రకరకాల పనులతో బయట తిరుగుతుంటాడు. తీరిక సమయాల్లో రామేష్ గదిలో పడుకునో, పుస్తకాలు తిరగేస్తూనో కాలక్షేపం చేయసాగాడు.

ఎ.బి. రావ్ వారానికోసారి ఆదివారంనాడు బంగళాకి వస్తాడు. అతను బిజీమనిషి. కాఫీ తాగేందుకు తీరిక లేనన్ని పనుల్లో తల మునకలవుతుంటాడు.

రావ్ ఆదివారంకోజున బంగళాకి వచ్చాడంటే గిరిజ అతనితో గంటలతరబడి మాటల్లోపడుతుంది. బాధలన్నీ చెప్పుకుంటుంది. ఆ మాటలన్నీ కూతురి గురించే. రావ్ ఆమెని ఎన్నోవిధాలుగా ఓదార్చాలని ప్రయత్నిస్తుం టాడు. ఏవేవో సలహాలిస్తాడు.

బిజినెస్ గురించి గిరిజ పట్టించుకోడం మానేసింది. ఈ ప్రపంచంలో ఆమె భర్త తర్వాత నమ్మే వ్యక్తి ఎ. బి. రావ్.

ఒక్క పెళ్ళివిషయంలో తప్ప, మిగతా అన్ని విష యాల్లోనూ సరోజ తల్లితో ఏకీభవిస్తుంది.

చిత్రమయిన మనిషి! ఆమెని అర్థంచేసుకోడం ఎవరి తరమూ కాదు!

రాను రాను కామేష్‌కి ఈ ఉద్యోగంలో 'బోర్' పుందనిపించింది. బాడీ గార్డ్ అన్నమాటేగానీ ఈ ఉద్యో గంలో అసలు థ్రిల్ లేదు! ఎవడైనా అకతాయి వెధవ సరోజని చేరవస్తే ఎంత బావుండును! వాడికి దేహశుద్ధి చేసి సరోజ మెప్పుపొందితే, తనకెంత గర్వంగా వుంటుంది!

కామేష్‌కి విసుగుపుడుతోంది.

మూడుపూటలా తిని, సరోజవెంట మీటింగ్‌లకి, ఇతర కార్యక్రమాలకి తోట్టిగా తిరగడం అతనికి నచ్చలేదు.

ఉద్యోగం విషయం అలావుంచి కనీసం మాట్లాడేం దుకు మనుషులు కూడ లేరు. ఆడుకోడానికి బొమ్మకుక్కలు

లేవు_ఈ లోకంలో సంబంధంలేకుండా మరేదో లోకంలో బ్రతుకుతున్నట్టువుంది!

చివరికి_ఉద్యోగంలో చేరిన ఇరవై ఆరవ రోజున___ మధ్యాహ్నం రామేష్ గదిలో పడుకుని గోళ్ళు కత్తిరించుకుంటోండగా టెలిఫోన్ మోగింది...

ఫోన్ మోగిందంటే అది కచ్చితంగా అనిత అయి తీరుతుంది. అనితతప్ప అతనికి ఫోన్ చేసేవారెవరూ లేరు. అదీ ఆమె నిర్ణీతసమయాల్లో కాఫీ, టిఫిన్, భోజనం మొదలైన వాటికోసం పిలుస్తుంది.

ఇప్పుడు రామేష్‌కి ఆశ్చర్యంవేసింది. అది అనిత ఫోన్ చేసేసమయం కాదు. కాఫీసమయం 4 30. ఇప్పుడు 3.30 అయింది. అయితే ఫోన్ చేస్తోందెవరు?

లేచివెళ్ళి రిసీవర్ ఎత్తాడు. చెవిదగ్గర పెట్టుకుని 'హల్లో...' అనబోయేంతలో అవతలి గొంతు పలికింది.

"హల్లో మిస్టర్ రామేష్."

ఆ కంఠం కఠినంగా వుంది__ బుల్‌డోజర్ శబ్దంలా. రామేష్ శరీరంమీద తేళ్ళూ జెర్రులూ పాకినట్టయి నేలలో పాతేసినట్టు నిలబడిపోయాడు.

ఆ షాక్ నుంచి తేరుకోడానికి అతనివల్ల కాలేదు. మళ్ళీ అవతలిగొంతు విన్పించాక మామూలు మనిషి అయ్యాడు.

"హల్లో మిస్టర్ రామేష్!"

"యస్...ఎవరు?"

"మిస్టర్ రామేష్, సరిగ్గా సాయంత్రం ఆరు గంటలకి హోటల్ గాలాక్సీ కొస్తావా?"

రామేష్ కలవరపడ్డాడు. అవతల వ్యక్తి ఏకవచనంతో సంబోధిస్తున్నాడు!

"మిస్టర్...ఏ కామేష్‌తో మీరు మాట్లాడేది?"

"నీతోనే! నువ్వు బాడీగార్డ్‌వి!"

కామేష్‌కి వొళ్ళు మండింది.

"హోటల్‌కి నేనెందుకు రావాలి?"

"కాలక్షేపానికి."

"నువ్వెవరసలు?"

"ఇక్కడికి వస్తే తెలుస్తుంది. సాయంత్రం ఆరు గంటలకి. తప్పకుండా రావాలి. లేదా నీచేతికి అందబోతున్న అదృష్టం జారిపోతుంది."

లైను కట్ అయింది.

కామేష్ కొయ్యబొమ్మలా వుండిపోయాడు కొన్ని క్షణాలు.

ఆ తర్వాత తేరుకుని తల విదిలించాడు. ఎవరీ మనిషి? తనతో ఏం పని? తను అతనికెలా తెలుసు?

కామేష్ వొళ్ళు జలదరించింది.

చేతికి అందబోతున్న అదృష్టమేమిటి?

కామేష్కి ఏమీ అర్థంగావడంలేదు. చివరికి ఈ వ్యవహారం ఏమిటో తేల్చుకోవాలని నిశ్చయించుకున్నాడు. ఇదేదో ఆకాశరామన్న ఫోన్ కాల్ కాదు కదా? అయితే ఇన్నాళ్ళకి ఈ ఉద్యోగంలో థ్రిల్ దొరికిందన్నమాట.

ఉత్సాహంగా రిసీవర్ ఎత్తి సరోజకి ఫోన్ చేశాడు. సాయంత్రం ఎక్కడికీ వెళ్ళవలసిందిలేదనీ, కామేష్ సిటీలోకి వెళ్ళవచ్చనీ, కారు కూడా తీసుకువెళ్ళవచ్చనీ సమాధానం ఇచ్చిందామె.

## 4

హోటల్ గాలాక్సీ సెక్రటరియేట్ రోడ్‌లో వుంది.

కామేషక్కడికి చేరుకుని పార్కింగ్ లాట్‌లో

కారాపి దిగాడు. విశాలమైన ఆవరణ. సాయంకాలం కాబట్టి, విపరీత జనసంచారం వుంది.

ఆ జనంలో కామేష్కి ఏమీ తోచలేదు. దిక్కులు చూస్తూ ముందుకి కదిలి హోటల్ వేపుకి నడక సాగించాడు.

తనని రమ్మన్న మనిషి ఎవరు? ఆతన్ని తనెలా గుర్తుపడతాడు? కామేష్ జేబులో రివాల్వర్ తడుముకున్నాడు. తనని రమ్మన్న మనిషి తనదగ్గరికే నస్తాడనుకుంటున్న అతని భుజంమీద వెనకనుంచి బరువైన హస్తం పడింది.

ఉలిక్కిపడి తిరిగి చూశాడు.

అలాటిమనిషిని జీవితంలో చూసివుండలేదు కామేష్.

ఫోన్లో ఆతనికంఠం విన్నప్పుడు కలిగిన భయం ఇప్పుడతన్ని చూస్తోంటే లేదు. చిన్నపిల్లలకి తాతలా, పెద్దవాళ్ళకి తండ్రిలా కన్పిస్తాడతను.

తెల్లటిశరీరం. విశాలమైన నుదురు. బట్టతల. అయితే పెదవులు నల్లగావున్నాయి. పిల్లికళ్ళు. పెద్దచెవులు. అతని ముఖం శాంతంగా వుంది. చూసేవాళ్ళకి అతనిమీద గౌరవభావం కలుగుతుంది. వయసు యాభైపైన వుంటుంది.

కాకీపాంట్ మీద-పసుపురంగు షర్టు ధరించాడు. షర్టుజేబులోంచి మూడునాలుగు చుట్టలు తొంగి చూస్తున్నాయి.

"నువ్వేనా ఫోన్ చేసింది?" కామేష్ అడిగాడు.

"అవును" అన్నాడతను—బుల్డోజర్ కంఠంతో. అతని గారపట్టిన పళ్ళు బయటపడ్డాయి.

"దేనికి?" అన్నాడతను.

"లోనికెళదాం—నా మనుషులున్నారు" అన్నాడా మనిషి.

ఆ మనిషిముఖంలో నవ్వు పొరపాటున కూడా కన్పించడంలేదు!

ఇద్దరూ లోనికి నడిచారు. "నా పేరు గౌండర్-రామ చంద్ర గౌండర్" అన్నాడతను. "సంవత్సరం క్రితం వరకు బెంగుళూరులో వుండేవాడిని. ఇక్కడ కొచ్చేశాను."

"ఎందుకు?"

"అక్కడి పోలీసులు చురుకైన వాళ్ళు. నేరాలు సాగవు."

ఎలక్ట్రిక్ షాక్ తిన్నట్లు ఉలికిపడ్డాడు రామేష్.

గౌండర్, రామేష్ని పట్టించుకోకుండా ముందుకి సాగిపోయాడు. టిఫిన్ సెక్షన్లో ఓ మూల టేబిల్ ముందు కూచున్న ఇద్దరు మనుషులు చేతులెత్తి సైగ చేశారు. గౌండర్, అతని వెనుక రామేష్ అటువేపు నడిచారు.

లోపలంతా కోలాహలంగా వుంది.

గౌండర్ తన మనుషుల దగ్గరకెళ్ళి కూచున్నాడు. రామేష్ బెదురుతూ గౌండర్ పక్కన కూచుని ఆ మను షుల కేసి చూశాడు.

వాళ్ళలో ఒకడు పంజాబీ. పొడవాటి వెంట్రుకల్ని చుట్టి పాగా పెట్టుకున్నాడు. మరొకడు పాతికేళ్ళ హిప్పీ లాటి యువకుడు.

"మీట్ దిలావర్ సింగ్, జానీ, మిస్టర్ రామేష్" పరిచయం చేశాడు గౌండర్. దిలావర్ చెయ్యి ముందుకు చాపాడు. రామేష్ భయంగా షేకాండ్ ఇచ్చాడు.

గవుండర్ మెనూకార్డ్ అందుకుని చూస్తూండి పోయాడు. ఇంతలో బేరర్ రాగా పదార్థాలు ఆర్డ రిచ్చాడు.

"ఓ.కే. మిస్టర్ రామేష్! ఉద్యోగం ఎలా వుంది?"

రామేష్కి అక్కడ ముళ్ళమీద కూచున్నట్టువుంది. ఇదంతా ఏమిటో అతనికి అర్థంగావడంలేదు. అర్థంకాని విషయాల్ని తక్షణం అడిగేస్తాడు రామేష్.

"గవుండర్! నన్నెందుకు పిల్చావు? చేజారిపోతున్న అదృష్టమేమిటి?"

గవుండర్ ఓసారి తన అనుచరుల్ని చూశాడు. ఆ తర్వాత రామేష్ని చూశాడు. నల్లటి పెదవుల్ని చప్పరించి, "చెప్తాను" అన్నాడు.

పదార్థాలు వచ్చాయి—నాలుగు ప్లేట్ల పూరీలు.

జానీ ప్లేటు ముందుకు లాక్కొని అవురావురుమంటూ పశువులా తినడం ప్రారంభించాడు. ఆ దృశ్యం చూసి రామేష్ వెన్నులోంచి చలిపుట్టుక వచ్చింది. జుగుప్స కలిగింది.

"రామేష్," గౌండర్ పలికాడు "తిను."

రామేష్ వెంటనే ప్లేటు వెనక్కితోసి లేచి నిలబడ్డాడు. అతనికళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. "గౌండర్ నేనక్కడికి తినడానికి రాలేదు! ఎందుకు పిలిచావో చెప్పు! లేదా వెళ్ళిపోతాను."

"కూచో," గౌండర్ అన్నాడు ప్రశాంతంగా తింటూ, "నా దగ్గర ఒక స్కీముంది. నువ్వు చేరతావా?"

రామేష్ కళ్ళు చిట్లించి చూశాడు. "స్కీమ్? ఏమిటాస్కీము?"

"యాభైవేలు సంపాదించి పెట్టేస్కీము" నింపాదిగా చెప్పాడు గౌండర్, "ఒక రాత్రికి నీకు యాభయివేలు సంపాదించి..."

"గౌండర్!" రామేష్ అన్నాడు కూచుంటూ, "నన్ను నీలాటి నేరస్తుడనుకుంటున్నావా? బాస్టర్డ్! నేను డిటెక్టివ్ని!"

"నానీ పుట్టుకతో మనిషిని" సమాధానం వచ్చింది, "మనిషి డబ్బుకి బానిస. డబ్బంటే ఇష్టంలేని మనిషి మనిషి కాదు, జంతువు! ఇప్పుడు చెప్పు: నువ్వు ఏ జాబితాలో చేరతావ్?"

రామేష్ గౌండర్ పిల్లికళ్ళలోకి తీక్షణంగా చూశాడు. గౌండర్ చూపులు తప్పించి, "చూడు రామేష్, నా స్కీములో నీ కిష్టం వుంటేనే చేరు. బలవంతం ఏమీ లేదు" అన్నాడు.

"ఆ స్కీము ఏమిటో తెలుసుకోవచ్చా?"

"తెలుసుకోవచ్చు, ఇష్టంవుంటే చేరవచ్చు, లేకపోతే లేదు."

రామేష్ ఆలోచించాడు.

వాళ్ళంతా తినడం పూర్తిచేశాక, కాఫీలు ఆర్డరు యిచ్చారు.

కాఫీలువచ్చాక గౌండర్ అన్నాడు, "నువ్వు చేరతావని నమ్మకముంది. ఒకసారి ఆలోచించు: యాభైవేల రూపాయలంటే మాటలుకాదు. ఆ డబ్బుతో యెన్నో కోరికలు తీర్చుకోవచ్చు! ఇందులో నీశ్రమ ఏమీవుండదు. డబ్బు నీ చేతికి వచ్చాక నువ్వు ఆశ్చర్యపోతావు. అంత తేలిగ్గా సంపాదించగలమా అని!"

"నీ స్కీము వివరించు. అయితే ఒకమాట: నన్ను ఎన్నుకోడంలో నీ ఉద్దేశ్యం ఏమిటి?"

"ఆపని నీవల్లనే సాధ్యమవుతుంది గనక!" గౌండర్ అన్నాడు మూతి తుడుచుకుని, "మా క్లయింటుకి నువ్వు ఒకపని చేసి పెట్టాలి."

"మీ క్లయింట్ ఎవరు?"

"అరబ్ షేక్. దుబాయ్ నుంచి వచ్చాడు. డబ్బు చాలావుంది."

రమేష్ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. అరబ్ షేక్. దుబాయ్‌నుంచి వచ్చాడు! ఒకరాత్రికి...యాభై వేలు!

రమేష్ రాయిలా కూచుండిపోయాడు.

ఒకరాత్రికి యాభైవేలు! ఎందుకు? ఎందుకో తట్టడానికి అతనికెంతో సమయం పట్టలేదు! గుండెలో బాంబులు పేలాయి!

"గాండర్! నీస్కీమ్ ఏమిటి? నీ క్లయింట్ కోరిక ఏమిటి?" భయాన్ని బలవంతంగా అదుపులో వుంచుకుని అడిగాడు రమేష్.

"ఇండియాకొచ్చే అరబ్బుల కోరికేమిటో నీకు తెల్సు" గాండర్ అన్నాడు చుట్ట వెలిగించి.

"ఇక్కడి స్త్రీలంకరించి విదేశాలకు వెళ్ళి గొప్పగా చెప్పుకుంటారు__రసికులు! ఇండియాకొచ్చే ప్రతిఅరబ్బు శృంగారం కోసమే వస్తాడని వినికిడి! కొందరయితే పెళ్ళి అనే ముసుగులో వస్తారు! షేక్ ఈ క్షణానవున్న పళంగా ఈ హోటల్ కొనేయగలడు. పెట్రోలుడబ్బు పెట్టెలనిండా మోసుకొనివచ్చి నీళ్ళలా ఖర్చుపెడుతూ వున్నాడు...

సిటీకివచ్చి వారం రోజులు గడిచాయి. నాతో యీ రోజు పరిచయమయింది. పారడైజ్ హోటల్‌లో వుంటున్నాడు. మూడురోజుల క్రితం ఆ హోటల్ కాన్ఫరెన్స్ హాలులో ఓ మీటింగు జరుగుతుండగా చూడ్డం జరిగిందట. మీటింగులో ప్రసంగించిన ఓ అమ్మాయి అతన్నెంతో ఆకర్షించిందట. ఈ విషయం బేరర్‌తో చెప్పి ఏవిధంగా ప్రొసీడ్ అయితే బావుంటుందని అడిగాడట.

"ఆ హోటల్ బేరర్స్ అందరితో నాకు సంబంధా లున్నాయి. పెద్దమనుషుల అవసరాలు తీర్చేందుకు నన్ను సంప్రదిస్తారు. అలాగే షేక్ విషయం నాతో సంప్రదిం చాడు బేరర్. ఆ అమ్మాయి ఎవరా అని ఆరాతీశాను— ఇంకేముంది! నావొళ్ళు చల్లబడి నీరసం వచ్చేసింది!" ఆగిపోయాడు గౌండర్.

"ఎందుకు? ఆమె...ఆమె ఎవరు?"

"సరోజ—మిసెస్ గిరిజారామకృష్ణ కూతురు! ఆమె జోలికెళ్ళడమంటే పాముతో పరాచికాలాడ్డమే! మొన్న ఆమెమీద దాడిచేసిన మనుషుల ముఖాలు మాంసపు ముద్దలా మారాయి. నీకు తెలిసే వుంటుంది.

"సరోజ గురించి షేక్‌కి చెప్పాను. ఆమెతో వ్యవ హారం చాలా డేంజరని వివరించాను. ఎంత చెప్పినా విన లేదు. ఎలాగయినాసరే, ఎంత డబ్బయినాసరే, సరోజ కావాలని మొండిపట్టు పట్టాడు."

కామేష్ నోరు పెగల్లేదు. రాయిలా కూచుండి పోయాడు.

గౌండర్ ఇంకా అన్నాడు, "నాకేమీ తోచలేదు. అతను లక్షరూపాయలు ఆశపెట్టాడు. అంత మొత్తము ఎవరూ ఆఫర్ చెయ్యలేదు. ఒకరాత్రికి లక్షరూపాయలు. నా రక్తం మరిగింది. కానీ ఆపని ఎలా చెయ్యాలో నాకు తోచలేదు. సరోజ గురించి నాకు తెలుసు.

"ఒకవేళ ఆమెని అపహరించి తీసుకువస్తే ఆత్మాభి మానంతో ఆమె ఏ అఘాయిత్యమయినా చేసుకోవచ్చు! రావ్ మమ్మల్ని వదలిపెట్టడు! చావు తప్పదు! అయితే, మరోమార్గం తట్టింది. అందుకు నీ సహాయం కావాలి. అందుకే నిన్ను పిల్చాను. ఏమంటావు?"

రామేష్ పూర్తిగా చెమటతో తడిసిపోయాడు. శరీరం నిలువునా వణికిపోతోంది. హఠాత్తుగా గాండర్ మీదికి లంఘించి కాలరు పుచ్చుకుని, "బాస్టర్డ్! నిన్ను పోలీసులకి అప్పగిస్తాను!" అనరిచాడు.

గాండర్ అతన్ని విదిలించి వెనక్కి తోశాడు. అతను కుర్చీలో పడ్డాడు.

"రామేష్" గాండర్ అన్నాడు ప్రశాంతంగా. "ఈ సహాయం నీ ఇష్టముంటేనే చెయ్యమని ముందే చెప్పాను. అలా చెయ్యకపోతే నిన్ను బలవంత పెట్టను. యాభైవేలు కావాలనుకుంటే నాతో చేతులు కలుపు. నా క్లయింట్ యిచ్చే ఫీజులో సగం నీకెందుకిస్తున్నాను? ఆలోచించు!"

రామేష్ తటపటంగా మూలుండిపోయాడు. యాభైవేల కోసం ఇంత నీచపు పని చెయ్యాలా! సరోజ అహంకారం అణచాలని తనూ అనుకున్నాడు గానీ ఈ విధంగానా? నో! ఈపని చెయ్యను! మాడమ్ గిరిజకు ద్రోహం చెయ్యను!

కాని, యాభైవేలు! తను జీవితంలో ఎప్పుడు సంపాదిస్తాడు?

"నాకా డబ్బు కావాలి. అయితే నీ స్కీము నచ్చితేనే మీతో కలుస్తాను."

"వెరీగుడ్!" గాండర్ తన అనుచరుల్ని చూసి కన్ను గీటాడు.

"రామేష్, షేక్ విరహబాధతో తపించిపోతున్నాడు. కన్నిస్తే కరచేలా వున్నాడు. ఈరాత్రి మనం ఆమెని అతనికి అప్పగించి చేతులు దులుపుకోవాలి!"

"నీ స్కీము వివరించు."

"రెండు ముక్కల్లో వివరిస్తాను: సరోజని స్పృహ లేని స్థితిలో షేక్ కి అప్పగించాలి. ఆ తర్వాత ఆదే స్థితిలో ఇంటికి చేర్చాలి. దట్సాల్!"

"అంటే, స్పృహ లేని స్థితిలో ఆమెని ... వాడు మనిషా? రాక్షసా?"

"ఎవడయితే మనకెందుకు! డబ్బిస్తున్నాడు."

కామేష్ ఆలోచనల్లో పడ్డాడు.

గౌండర్ మళ్ళీ అన్నాడు, "ఆ విధంగా చేస్తే ఎవరికీ ఏ ప్రమాదమూ వుండదు. జరిగిందేమిటో ఆమెకి తెలియదు. కాబట్టి ఏ అఘాయిత్యమూ చేసుకోదు. ఈ బిజినెస్ రావ్ అసలు తెలుసుకోలేడు. కాబట్టి మనకి ప్రమాదముండదు. ఇక మోడమ్గురించి భయపడే అవసరమసలు లేదు! సరోజకి అన్యాయం చేస్తోన్నామనే బెంగ నువ్వసలు పెట్టుకోకు! ఆమెకి పెళ్ళి అవసరం లేదు. ఇక శీలం గురించి బెంగ ఎందుకు!"

ఈ మాటలు కామేష్కి సబబుగా తోచాయి.

యాభై వేల రూపాయలు కళ్ళముందు మెదిలి రక్తం పరుగులు తీసింది. ఈ డబ్బుతో ఈ వెధవ ఉద్యోగం వదిలేసి బొంబాయి వెళ్ళి బ్రహ్మాండంగా బ్రతకవచ్చు!

"ఆల్ రైట్ మిస్టర్. నీ స్కీము నచ్చింది. అయితే ఇంకా వివరంగా మాట్లాడుకోవాలి. సరోజని స్పృహ తప్పించి తెచ్చే బాధ్యత నాది. అయితే షేక్ ఆ వెధవ పని హోటల్లో చెయ్యడం ప్రమాదకరం!"

"అవును, ఈ విషయం నేను ఆలోచించాను. ఏర్పాట్లన్నీ నా ఇంట్లో చేశాను."

"ఎక్కడ?"

"సరూర్ నగర్లో. షేక్ అక్కడికే వస్తాడు. గంట చాలని చెప్పాడు."

"సరోజని ఎన్ని గంటలకి తీసుకురావాలి?"

"ఆమె ఎప్పుడు నిద్రపోతుంది?"

"పన్నెండు గంటలవరకు వ్యాసాలు వ్రాసి నిద్ర పోతుంది?"

"అయితే ఒంటిగంటకు తీసుకురావాలి. రానూపోనూ ఒకగంట. షేక్‌తో ఒకగంట. మొత్తం కలిపి రెండు గంటలు. అంటే మూడుగంటలకల్లా ఆమె యింటిలో వుండాలి. తెల్లారి ఆమె మామూలుగా నిద్రలేస్తుంది. అయితే ఏం జరిగిందో ఆమెకి తెలియదు."

"ఆమెను స్పృహ ఎలా తప్పించాలి?"

"నువ్వు క్లోరోఫాం వాసన చూపించాలి. నా ఇంటికి చేరాక నేను మార్ఫియా ఇంజెక్షన్ ఇస్తాను."

"ఇంతకీ ఆమెను తెలివి తప్పించడానికి షేక్ ఒప్పుకున్నాడా?"

"ఒప్పుకున్నాడు. ఆమె ఎలాంటి స్థితిలోవున్నా తనకు కావాలని పట్టుబట్టాడు."

"ఆల్ రైట్, ఇంకా వివరంగా ఈ ప్లాను గురించి చర్చించుకుందాం."

అరగంటసేపు వాళ్ళంతా ప్లాను గురించి చర్చించుకున్నారు.

చర్చముగిశాక కామేష్, షేక్‌ని చూడాలని చెప్పేడు.

"ఎందుకు?" గాండర్ అడిగాడు అనుమానంగా చూస్తూ.

కామేష్ లేచినిలబడి అన్నాడు, "మాట్లాడకుండా నాతోరండి! నేనీ వ్యవహారాన్ని యింకా లోతుగా చూడాలి. లేకపోతే నీకూ నాకూ..."

"సరే, సరే, నడువ్!" గాండరన్నాడు చటుక్కున.

అందరూ బయటకువచ్చి కారెక్కారు. పారడైజ్ హోటల్ చేరుకున్నాక మూడవ అంతస్తులోని అరబ్ షేక్ గదిలో ప్రవేశించారు.

అరబ్ షేక్ కి యాభై ఏళ్ళుంటాయి. ఎర్రటి రంగు. పెద్దకళ్ళు. పిల్లగడ్డం .!. పైనుంచీ కిందవరకూ తెల్లటి జుబ్బాలో వున్నాడతను.

గాండర్ కామేష్ని షేక్ కి పరిచయంచేశాడు. షేక్ ఆనందం పట్టలేక కామేష్ చేతినివూపి వేస్తూ, "హిందూస్తాన్ అచ్ఛా హై! లడకీ బహుత్ అచ్ఛా హై!" అన్నాడు.

ఆ తర్వాత జానీని చూసి గట్టిగా కళ్ళు మూసుకొని అరిచాడు.

"గాండర్! ఆ చింపాంజీని వెళ్ళమను యిక్కడ నుంచి!"

గాండర్ జానీవేపు తిరిగి, "జానీ, నిన్ను చూస్తే షేక్ కి ఎలర్జి! బయటికెళ్ళి నిలబడు!" అన్నాడు.

జానీ వెళ్ళిపోయాక షేక్ నవ్వుతూ చూశాడు.

"ఈ రాత్రికి ఏర్పాటు చేశాం" అన్నాడు గాండర్.

షేక్ జేబులోంచి వెండి సిగరెట్ కేసుతీసి స్టేట్ ఎక్స్ ప్రెస్ ని బంగారపు సిగార్ లైటర్ తో వెలిగించాడు.

గాండర్ సిగార్ లైటర్ ని చూసి, "అది చాలా బాగుంది" అన్నాడు.

వెంటనే షేక్ దాన్ని గాండర్ కి అందించాడు, "వుంచుకో!"

గాండర్ నవ్వుతూ అందుకుని థాంక్స్ చెప్పాడు.

"ఎన్నిగంటలకి ఏర్పాటుచేశారు?"

"ఒంటిగంటన్నరకి. మీరక్కడ వుండాలి."

"మంచిది, డబ్బు అక్కడే ఇస్తాను" అని ఎలక్ట్రానిక్ రిస్ట్ వాచీ చూసుకున్నాడు షేక్, "ఇప్పుడు యెనిమిదిన్నరయింది."

గౌండర్ కన్ను వాచిమీద పడింది, "అది అద్భుతంగావుంది!" అన్నాడు.

షేక్ కోపంతో రెచ్చిపోయి, "షటప్! గెటవుట్" అనర్చాడు.

గౌండర్ చిక్కముఖం వేసుకుని బయటకి నడిచాడు. అతని వెనకనే కామేష్, దిలావర్‌లు నడిచారు.

"నమ్మకం కుదిరిందా?" గౌండరడిగాడు కారెక్కాక.

కామేష్ తలూపి స్టార్ట్ చేశాడు.

గౌండర్ జేబులోంచి కాయితంముక్క తీసి యేవో అంకెలు వేశాడు. దాన్ని కామేష్‌కిచ్చి, "మాతో అత్యవసరంగా మాట్లాడాలనుకుంటే యీ నెంబరుకి ఫోన్ చెయ్యి" అన్నాడు.

## 5

ఆమె గదిలో గడియారం పన్నెండుగంటలు కొట్టడం సరోజ లైటార్పేసి నిద్రకుపక్రమించడం ఒకేసారి జరిగాయి.

ఇప్పుడామె మనసు తేలికగా వుంది. మదిలో మెదిలే భావాల్ని కాయితంమీద పెట్టేశాక ఆమెకు ఆశాంతిగా వుంటుంది.

దాదాపు నెలరోజుల క్రితం జరిగిన సంఘటన ఆమె పూర్తిగా మరిచిపోయింది. దాని అవశేషాలు మనసులో ఏ మాత్రం మిగులకుండా బ్రెయిన్ వాష్ చేసుకుంది.

కాబట్టి పావుగంటలో ఆమె గాఢనిద్రలో జారుకుంది.

అవుట్ హౌజ్‌లో కామేష్ ముంచుకువస్తోన్న నిద్రని

బలవంతంగా ఆపుకుంటూ, సమయంకోసం అసహనగా ఎదురుచూ స్తున్నాడు.

బంగళాలో గిరిజ 10 గంటలకే నిద్రలోకి జారుకుంది. ఈ మధ్య ఆమెకి మనశ్శాంతి కొరవడి నిద్రపట్టేదికాదు. డాక్టర్‌ని సంప్రదించాక అతను నిద్రమాత్రలు ఒక మోతాదులో వేసుకోవాలని సలహా ఇచ్చాడు. ప్రతి రాత్రి సరిగా 10కి అనిత గిరిజకి నిద్రమాత్రలు యిచ్చి నిద్రపుచ్చుతుంది. ఆ తర్వాత తన గదిలోకి వెళ్ళిపోయి పుస్తకం చదువుతూ నిద్రలో జారుకుంటుంది.

రామేష్ ఉలిక్కిపడ్డాడు. సమయం ఒంటిగంట అయింది.

బంగళా, దాని పరిసరాలు నిర్మానుష్యంగా వున్నాయి.

రామేష్ అదురుతున్న గుండెలతో లేచి సొరుగులోంచి క్లోరోఫాం సీసా, రుమాలు, స్క్రూడ్రైవర్ తీసి జేబులో వేసుకున్నాడు. ఆ తర్వాత లైటార్పేసి గది లోంచి బయటికొచ్చి తలుపుయి జారగిలవేశాడు. తాళం వేయలేదు.

ఒక్క క్షణం సందేహించి ఆ తర్వాత బంగళావేపు గబగబ నడిచాడు. బంగళా వెనక భాగం చేరుకుని డ్రైనేజి పైపుద్వారా పైకి ప్రాకడం ప్రారంభించాడు. పైఅంత స్తు చేరుకున్నాక జాగ్రత్తగా కిటికీషేడ్ ఎక్కాడు. అక్కడ గాఢంగా ఊపిరిపీల్చి, జేబులోంచి స్క్రూ డ్రైవర్ తీశాడు. స్క్రూడ్రైవర్‌తో వెంటిలేటర్ రెక్క విప్పేశాడు.

ఆ రెక్కను కిటికీషేడ్ మీద పెట్టి, కాళ్ళు వేలాడ దీసి డ్రైనేజి పైపుమీద వుంచాడు. షేడ్ మీంచి శరీ రాన్ని నెమ్మదిగా కదిలిస్తూ, చివరికి రెండుచేతులతో

షేడ్ అంచును పట్టుకుని వేలాడసాగాడు. ఆ తర్వాత రెండుకాళ్ళు ఎత్తి వెంటిలేటర్‌లో పెట్టి నెమ్మదిగా లోనికి జరగడం ప్రారంభించాడు. అలా జరిగాక అతని నడుము వెంటిలేటర్‌లో, కాళ్ళు బాత్‌రూంలో, తల బయట వేళాడసాగాయి. అలాగే ఇంకా లోనికి జరిగి ఒకచేత్తో షవర్ పైపు పట్టుకుని పూర్తిగా లోనికి వచ్చేశాడు.

ఒక్క క్షణం గాఢంగా వూపిరి పీల్చి, చప్పుడు కాకుండా బాత్‌రూంలో దిగాడు. చీకటిగా వుంది.

శబ్దం కాకుండా తలుపు దగ్గరకెళ్ళి హాండిల్ తిప్పాడు. తలుపు తెరుచుకుంది.

పిల్లిలా అడుగులో అడుగు వేసుకుంటూ బెడ్‌రూంలోకి కదిలాడు. మసగ్గావున్న లైటు వెలుతురులో ఒకమూల బెడ్‌మీద సరోజ ఆకారం కన్పిస్తోంది.

అక్కడికి చేరుకుని పరీక్షగా ఆమె ముఖంలోకి చూశాడు. గాఢనిద్రలో వుంది.

భారంగా నిట్టూర్చి జేబులోంచి సీసా, రుమాలు తీసి, ద్రవాన్ని రుమాలుమీద ఒలికించి, సీసా జేబులో వేసుకున్నాడు. వణుకుతున్న చెయ్యి ముందుకు చాచి రుమాలు సరోజ ముక్కు దగ్గర పెట్టాడు. కొన్నిక్షణాల్లో ఆమె స్పృహతప్పి తల వాల్చేసింది.

మరుక్షణం ఆమెని ఎత్తుకొని భుజంమీద వేసుకుని తలుపువేపు కదిలాడు. తలుపు తెరిచి బయటికి వచ్చి, ఆ తర్వాత గబగబ నడుస్తూ మెట్లవేపు సాగిపోయాడు. మెట్లు దిగేముందు హాలులో ఒకసారి చూశాడు గదులన్నీ మూసివున్నాయి. అప్పటికే గిరిజ, అనిత గాఢ నిద్రలో వున్నారు.

కామేష్ సరోజ శరీరాన్ని మోసుకుంటూ జాగ్రత్తగా

మెట్లుదిగి హాల్లోకొచ్చాడు. సింహద్వారంగుండా కాక వెనకద్వారం నుంచి కిచెన్‌లోకి వచ్చి ఆ తర్వాత పెరట్లోకి ప్రవేశించాడు. పెరటి గోడమీద రెండు మానవాకారాలు అతనికోసం ఎదురుచూస్తున్నాయి.

కామేష్ గోడదగ్గరకి రాగానే గోడమీదవున్న దిలావర్, జానీలు సరోజని అందుకుని, గోడవతలవున్న గవుండర్‌కి అందించారు.

గౌండర్ సరోజని కారు వెనకసీట్లో పడుకోబెట్టాడు. ఈలోపు అతని అనుచరులు గోడదిగారు. కొన్ని నిముషములయ్యాక కామేష్ గోడదూకాడు.

అందరూ కారువద్దకు వెళ్ళారు. కార్లో గౌండర్ డ్రయివింగ్ సీట్లో, అతని పక్కన దిలావర్, జానీలు కూచున్నారు. కామేష్ వెనకసీట్లో కూచోని సరోజ తల ఒళ్ళో పెట్టుకున్నాడు. కారు బయలదేరింది.

చాలాదూరం అందరూ నిశ్శబ్దంగా ప్రయాణించారు. గౌండర్ చాలా వేగంతో డ్రయివ్ చేస్తున్నాడు.

కామేష్ ఆలోచనలు ఇంకా వేగంగా పరిగెడుతూ వున్నాయి. తానేం చేస్తున్నాడు! బాడీగార్డ్‌గావుంటూ బ్రోకర్‌గా మారాడు! అయితేనేం సరోజకు బుద్ధి చెపుతున్నాడు! అయితే అది సరోజకి తెలిసేదెలా? అవకాశం లేదు!

కారు సరూర్‌నగర్ చేరుకుంది. పరిసరాలన్నీ నిశ్శబ్దంగా వున్నాయి. చుట్టుపక్కలన్నీ పొలాలుగావడం వలన దోమలు విపరీతంగావున్నాయి.

గౌండర్ దూరంగా ఒంటరిగావున్న ఒక పెంకుటింటి ముందు కారాపాడు. సమయం సరిగ్గా 1-30. అరబ్ షేక్ కారక్కడలేదు...అతను గౌండర్ ఏర్పాటుచేసిన టాక్సీలో రావలసివుంది.

అందరూ కారు దిగారు. జానీ యింటితాళం తీసి తలుపు తెరిచాడు. చీకటిగావున్న ఇంట్లో లైటు వెలిగించాడు.

గౌండర్, దిలావర్‌లు కలిసి సరోజని ఒక గదిలోకి చేర్చారు. ఆమెను నవారు మంచంమీద పడుకోబెట్టారు.

కామేష్ ఇంటినిజాగ్రత్తగా గమనిస్తోన్నాడు. కాసేపయ్యాక గౌండర్ అలమైరానుంచి ఒకసీసా, సిరంజి తీసి ద్రవాన్ని అందులో ఎక్కించాడు. ఆ తర్వాత సరోజ కుడిచేతికి ఇంజెక్షన్ ఇచ్చాడు.

"ఇక భయంలేదు!" అన్నాడు తృప్తిగా తలాడించి.

అప్పటికి పావుగంట గడిచింది.

షేక్ జాడలేదు.

కామేష్ రక్తం పరుగులు పెడుతోంది. టైం అనవసరంగా వృధా అవుతోంది.

"ఆల్ రైట్, ఇకపదండి!" గౌండరన్నాడు గది నుంచి బయటికి నడుస్తూ.

కామేష్‌కి ఏమీ అర్థంకాలేదు.

ఇంతలో గదిలో లైటారిపోయింది.

"గవుండర్! ఏమిటిది?" అడిగాడతను తికమకగా.

"ఏమీలేదు, నువ్వు బయటికి రా!"

కామేష్ కంగారుగా బయటికి వచ్చాడు. దిలావర్ తలుపుమూసి తాళంవేశాడు.

షేక్ ఇచ్చిన లైటర్‌తో సిగరెట్ వెలిగించి అన్నాడు గవుండర్, "ఇక సరోజ మనబందీ! రేపురాత్రి వరకు మన దగ్గర వుంటుంది. ఈ లోపు పదిలక్షలు రాబట్టుకోవాలి! కమాన్ బాయ్స్! లెటజ్ హావ్ ఎ డ్రింక్!"

కామేష్ నెత్తిమీద పిడుగులుపడ్డాయి.

భయంకరంగా అర్చాడు: "గవుండర్! ఏమిటి నువ్వన్నది?"

"ఆమెని కిడ్నాప్ చేశాం." క్లుప్తంగా చెప్పాడు గవుండర్.

"అంటే...ఆ షేక్...అరబ్ షేక్ గురించేమిటి?"

"అరబ్ షేక్ లేడు, ఆఫ్రికా గోరిల్లా లేదు. అదంతా హంబగ్. నేనే అతన్ని పురించి నాటకమాడాను. ఈ రాత్రి అతను దుబాయ్ వెళ్ళిపోయాడు..."

గవుండర్ మాటలు కామేష్ గుండెల్లో డైనమైట్స్‌లా పేలాయి.

"మోసం! గవుండర్, నువ్వు మోసం చేశావు! నన్ను ట్రాప్‌లో ఇరికించావు."

"కామేష్" ప్రశాంతంగా అన్నాడు గవుండర్. "ఎవ్వరూ ఎవర్నీ మోసం చెయ్యడం లేదు. పరిస్థితి మారింది. ప్రతిఫలం పెరిగింది. మూడులక్షలు-నీకు మూడు లక్షలిస్తాను—"

"నీకు పిచ్చిపట్టింది! రావ్ నుంచి నయాపైసా రాబట్టుకోలేవు! గవుండర్, మీ క్షేమం, నా క్షేమం కోరి చెబుతున్నాను, సరోజని వదిలేయ్! లేదా మనకి చావు తప్పదు! అసలు—అసలు ఈ విషయం నువ్వు ముందు ఎందుకు చెప్పలేదు?"

"నువ్వు ఒప్పుకోవని. ముందు అనుకున్న దానికంటే యిదేమీ నీచమైన పనికాదు. ఇందులోనే ప్రతిఫలం ఎక్కువ! పాపం, ఆ అమ్మాయికి యేటువంటి అన్యాయమూ జరగదు!"

కామేష్ తలపట్టుకుని కూచుండిపోయాడు. "గవుండర్! ఘోరంగా మోసం చేశావు! నేను పోలీసులకి చెప్పేస్తాను—"

"పిచ్చిగా మాట్లాడకు! ఆమె చచ్చిపోతుంది. నిన్ను మోసంచేశాను సరే, కానీ ఈ బిజినెస్‌లో మోసంలేదు. నీకు మూడులక్షలు ముడతాయి. రావ్ గురించి భయం అనవసరం. అతనేమీ చెయ్యడు. చెప్పినట్టు చేస్తాడు—సరోజ ఏకైక వారసురాలు. అంతేకాదు, ఈ బిజినెస్ యే మాత్రం పాక్కినా ప్రజల్లో ఆమెపైన వున్న అభిమానం నశిస్తుంది. కాబట్టి రావ్ గుట్టుచప్పుడు కాకుండా చెప్పినట్టు చేస్తాడు—మాడమ్‌కి కూడ చెప్పడు!"

దిలావర్ కామేష్కి విస్కీ అందించాడు.

"మరి సరోజ గురించి యేమిటి?"

"మనకి డబ్బు అందేవరకు, ఆమెని తిరిగి ఇంటికి చేర్చేవరకు, అదే స్థితిలో వుంటుంది—సుమారు పద్దెనిమిది గంటలు."

"డబ్బు ఎవరు తెస్తారు?"

"రావ్‌కి ఫోన్ చేస్తాను, నీతో పంపమని. కమాన్, ఇక వెళదాం! దిలావర్, మా యిద్దర్నీ కాల్లో డ్రైవ్ చెయ్యి. నేను దారిలో దిగిపోయి రావ్‌కి ఫోన్ చేస్తాను. కామేష్‌ని బంగళా దగ్గర డ్రాప్ చెయ్."

కామేష్ వులిక్కిపడ్డాడు, "ఇక్కడెవరు వుంటారు?"

"జానీ.భయపడకు!అతను సరోజను ఏమీ చెయ్యడు!" గవుండర్ అన్నాడు, "నేను రావ్‌కి ఫోన్ చేస్తే అతను తక్షణం బంగళాకి వెళతాడు. ఆలోపు నువ్వు బంగళాలో వుండాలి!"

# 6

సరోజని తెలివితప్పించి కామేష్ తీసుకెళ్ళిపోయాక, అరగంట తర్వాత అవుట్‌హౌజ్‌లో నిద్రపోతున్న స్వామికి మెలుకువ వచ్చింది.

ఈ మధ్య వారానికి రెండుమూడు రాత్రులు అతనికి సరిగా నిద్రపట్టడంలేదు. అతని వయసును దృష్టిలో వుంచుకుని కారణం ఎవరైనా వూహించుకోవచ్చు. తన స్వంత వూరు అనకాపల్లి వెళ్ళి త్వరగా పెళ్ళి చేసుకుని వచ్చేయాలని అతనికి చాలా కసిగావుంది.

కానీ రావ్‌ని అడిగితే, "పెళ్ళా! నీకెందుకు? నీకంటే పెద్దవాడ్ని నేనే చేసుకోలేదు" అని కొట్టి పారేస్తాడు. ఈ సమస్య కొరకరాని కొయ్యలా తయారైంది స్వామికి.

బెడ్‌మీంచి లేచి కూజాలో నీళ్లు వొంచుకుని తాగాడు. ఆ తర్వాత తలుపు తెరుచుకుని బయటికి వచ్చాడు. చీకటిగా ఉంది. అతనిలో కోరిక రగిలింది.

తనకిప్పుడు 'అది' కావాలి—'అది' లేకపోతే నిద్ర పట్టదు!

అడుగులో అడుగు వేసుకుంటూ అవుట్ హౌజ్ వేపుకి నడిచాడు. తలుపు దగ్గర ఆగి తట్టాడు. సమాధానం లేదు. కిర్రుమని తలుపు తెరుచుకుంది. అతనికేమీ అర్థం కాలేదు. లోనికి ఒక అడుగు వేసి, చీకట్లో నిలబడ్డాడు. "కామేష్! కామేష్, కొంచెం విస్కీ ఇప్పించు! నిద్ర పట్టడం లేదు!"

సమాధానంలేదు. తడుముకుంటూ లైట్ స్విచ్ నొక్కాడు. గదిలో ఎవరూలేరు—తనొక్కడు తప్ప. బెడ్ ఖాళీగావుంది. వెనక గదిలోకి నడిచాడు, కిచెన్‌లోకి వెళ్ళాడు, బాత్‌రూంలో చూశాడు ..కామేష్ ఎక్కడా లేడు.

ఎక్కడికెళ్ళాడు? ఆలోచించుకుంటూ తిరిగి ముందు గదిలోకి వచ్చాడు. రాక్‌లో భూటాన్ విస్కీ బాటిల్ కన్పించింది. ఆవేశంగా దాన్నందుకుని కుర్చీలో కూర్చున్నాడు.

ఆక్షణంలో రామేష్ ప్రహరీగోడ దూకి లోనికి వచ్చాడు. అవుట్ హౌజ్ దగ్గరగా హఠాత్తుగా అదిరిపడి ఆగిపోయాడు.

ముందు గదిలో లైటు వెలుగుతోంది!

ఎవరొచ్చారు? రావ్ వచ్చేశాడా! అతని నరాలు బిగదీసుకుపోయాయి: గవుండర్ అడుగడుగునా మోస గిస్తున్నాడు! సరిగ్గా అరగంట తర్వాత రావ్‌కి ఫోన్ చేస్తానన్నాడు—ఇంకా అయిదు నిముషాలున్నాయి... అప్పుడే చేసేశాడా!

ఏం చెయ్యాలో పాలుపోలేదు రామేష్‌కి. తిరిగి వెళ్ళి గవుండర్‌ని చంపాలన్నంత కసిపుట్టింది. కానీ, ఆ ఆలో చనకి వ్యతిరేకంగా అవుట్ హౌజ్ వేపుకు నడిచాడు. కాళ్ళు విపరీతంగా వణుకుతున్నాయి. అతికష్టం మీద తలుపు చేరుకుని జాగ్రత్తగా లోనికి తొంగిచూశాడు...

స్వామి విస్కీ సేవిస్తూ పెదవులు చప్పరిస్తోన్నాడు.

రామేష్ నెమ్మదిపడ్డాడు. అయినా భయం తొలగ లేదు.

స్వామికి యింకా నిషా ఎక్కలేదు. సోడా లేకుండా విస్కీ తాగడం అతనికి కష్టంగా వుంది. కనీసం నీళ్ళయినా కలుపుకుందామని లేవబోతుండగా గుమ్మంలో రామేష్‌ని చూశాడు. అదిరిపడి కుర్చీలో కూలబడ్డాడు. "క్షమించు రామేష్...నీ అనుమతి లేకుండా..." అంటూ గొణిగాడు.

"ఫరవాలేదు తాగు" అన్నాడు రామేష్.

స్వామి వెంటనే నవ్వి, "నువ్వూరా!" అన్నాడు. రామేష్ వెళ్ళి అతని కెదురుగా కూర్చున్నాడు. అతని శరీరం యింకా వణుకుతోనే వుంది.

స్వామికళ్లు రామేష్‌మీద పడ్డాయి. అతనికేదో

తట్టింది. "రామేష్ యెక్కడికెళ్లావు? ఎందుకలా పడుతున్నావ్?"

రామేష్ జాగ్రత్తపడ్డాడు. "ఏమీ లేదు... ఏమీ లేదు. పరిగెత్తాను... అంతే!"

"పరిగెత్తావా? ఎందుకు?" తికమక పడ్డాడు స్వామి.

రామేష్ ఉరిమి చూశాడు, "రాత్రిపూట పరిగెత్తడం నాకలవాటు. నేను బాడీ గార్డ్ ని కదా! ఎక్సర్ సైజ్..."

"ఓహో! ఆల్ రైట్, ఇక తాగుదాం!" అన్నాడు స్వామి.

ఆ తర్వాత ఇద్దరూ తాగటంలో నిమగ్నమయ్యారు. స్వామిమాటలు వింటూ రామేష్ ఊ కొడుతున్నాడే గానీ, అతని ఆలోచనలు ఎక్కడో వున్నాయి. పావు గంట తర్వాత స్వామి వెళ్ళిపోయి తన గదిలో పడుకున్నాడు.

రామేష్ కి నిషా పూర్తిగా ఎక్కింది. బెడ్ మీద పడుకుని కళ్లు మూసుకున్నాడు.

# 7

టెలిఫోన్ శబ్దం ఎ. బి. రావ్ నిద్ర చెడగొట్టింది. బధకంగా కళ్ళు తెరిచి, కొన్ని క్షణాల్లో తేరుకొని, అలాగే పడుకొని టీపాయ్ మీది ఫోన్ అందుకొని అస్పష్టంగా గొణిగాడు, "ఎ. బి. రావ్ హియర్."

"హల్లో మిస్టర్ రావ్. సరోజ క్షేమంగా చేరుకోవాలంటే మాకు పదిలక్షలు కావాలి."

అవతలి మాటలు రావ్ ని అదరగొట్టాయి. ఆ కంఠం అతని వెన్నులోంచి చలి పుట్టించింది. హఠాత్తుగా లేచి నిలబడి అరిచాడు, "హల్లో, వాట్ నాన్సెన్స్ యూ ఆర్ స్పీకింగ్!"

"సరోజ క్షేమంగా చేరుకోవాలంటే మీకు పదిలక్షలు కావాలి. దిసీజ్ కిడ్నాపింగ్ బిజినెస్. ఈ బిజినెస్‌లో తీసుకోవలసిన జాగ్రత్తల గురించి మీకు చెప్పనవసరం లేదనుకుంటాను? నో పోలీస్! నో ట్రిక్స్! నో డబుల్ క్రాస్! చెప్పినట్టు చెయ్యండి. రేపురాత్రి 8 గంటలకి బాడీగార్డ్ కామేష్‌కి డబ్బిచ్చి లంగర్‌హౌస్ దగ్గర పంపండి. సరోజని అతనికి అప్పగించేస్తాం. అతనికి వార్నింగ్ ఇవ్వండి. ట్రిక్కులు చెల్లవు!"

లైన్ కట్ అయింది. రావ్ వొళ్ళు చల్లబడింది. రిసీవర్ బలంకొద్దీ విసిరికొట్టి అలాగే నైట్‌గవున్‌తో బయటకి వురికేడు.

కారెక్కి వేగంగా డ్రైవ్ చేస్తూ బంగళాకి ప్రయాణమయ్యాడు. పావుగంటలో అక్కడికి చేరుకున్నాక, గేటు ముందు కారాపి దిగాడు. అతన్ని చూసి గూర్ఖా గాభరా చెందాడు. రావ్ గేటు తెరచుకొని లోనికి శక్తికొద్దీ పరిగెత్తాడు.

బంగళా మెట్లెక్కి వరండా చేరుకొని, అనిత గది కిటికీవద్ద ఆగాడు. కిటికీమీద నెమ్మదిగా తడుతూ ఆమెని పిల్చాడు. కాస్సేపయ్యాక కిటికీ తెరుచుకుంది. అనిత గాభరాగా తొంగి చూసింది.

"సర్, మీరా!"

"ష్! గట్టిగా మాట్లాడకు! తలుపు తెరువ్!"

రెండు నిమిషాలయ్యాక సింహద్వారం తెరుచుకుంది. రావ్ లోనికి జొరబడి అనిత చెయ్యిపుచ్చుకొని వేగంగా మేడమెట్లవేపు కదిలాడు. అనిత నిద్రమత్తు వదిలింది. ఆమెకేమీ అర్థంగావడంలేదు.

రావ్ మేడమీద సరోజ గదిలోకి ప్రవేశించి అనితను సోఫాలో తోశాడు. ఆ విసురుకు ఆమె గట్టిగా మూల్గి

గింది. రావ్ లైటు వెలిగించి గదిలో ఆత్రంగా చూసేడు. సరోజ లేదు.

"డామిట్! అనితా, సరోజని కిడ్నాప్ చేశారు!" అరిచాడతను.

"స...ర్?" అనిత కంగారుగా లేదు.

"సరోజని కిడ్నాప్ చేశారు. హావ్ ఇటీజ్ పాసిబుల్! ఎలా జరిగింది? మైగాడ్! ఇప్పుడేమి చెయ్యడం! మేడమ్‌కి తెలిస్తే—"

అనిత విపరీతంగా వణకసాగింది. "సర్! సరోజ... సరోజకేమయింది? ఆమెని ఎవరు తీసుకెళ్ళారు? ఎలా తీసుకెళ్ళారు?"

ఆమె మాటలకి సమాధానం ఇవ్వలేదు రావ్, "పది లక్షలు! అంతడబ్బు ఎక్కడ్నుంచి లేవాలి? ఓహ్, గాడ్! ఇప్పుడు...ఇప్పుడు...అనితా! రామేష్‌ని పిలు!"

అనిత టెలిఫోన్ వేపు వురికింది.

ఫోన్ రింగయి రామేష్ నిద్ర చెడగొట్టింది. అతను చటుక్కున రిసీవర్ అందుకున్నాడు. ఫోన్ యెవరు చేస్తున్నారు?

అవతలినుంచి వినిపిస్తోన్న మాటలతని ఒంటిని చల్లబర్చాయి. కాళ్లలో వణుకు ప్రారంభమయింది. అవతలి మాటలు పూర్తిగావిని, "అలాగే, ఇప్పుడే వస్తున్నాను" అని రిసీవర్ పెట్టేసి బంగళావేపుకి వురికేడు.

గదిలో రావ్ అసహనంగా పచార్లు చేస్తున్నాడు. ఇది వూహించని సంఘటన. అనిత చేతులు నలుపుకుంటూ నిలబడింది.

రామేష్‌నిచూసి రావ్ ఉగ్రుడయ్యాడు, "రాస్కెల్ ఇదెలా జరిగింది? దీనికి నీ సంజాయిషీ ఏమిటి?"

"ఏం జరిగింది సర్?" అర్చాడు రామేష్.

రావ్ చూపులు అతనిపైన నిలిచాయి, "సరోజని కిడ్నాప్ చేశారు. పదిలక్షలు కోరుతున్నారు. ఇవ్వక పోతే ప్రాణాలు తీస్తారట. ఆ దుర్మార్గులెవరు? ఇక్కడి కెలా వచ్చారు?"

రామేష్ గాభరా పడ్డాడు. "సర్! ఏమిటి మీ రనేది? సరోజని కిడ్నాప్ చేశారా? ఎలా? ఎవరికి సాధ్యం! సర్, మీరు చెప్పేది నిజమేనా?"

"నిజమే!" అర్చాడు రావ్. "ఇది నీవల్లనే జరిగింది! నీ సంజాయిషీ ఏమిటి?"

"క్షమించండి సర్! ఆమెను యింట్లో గార్డ్ చేసే బాధ్యత నాకులేదు. కాబట్టి సంజాయిషీ చెప్పే అవ సరంలేదు. మీరు నిశ్చింతగా వుండండి. సరోజని నేను రక్షిస్తాను!"

"ఎలా?"

"మీరు డబ్బిస్తే ఆమె క్షేమంగా దక్కుతుందన్నది వేరే విషయం. కానీ డబ్బెందుకివ్వాలి? కిడ్నాపర్స్‌ని నేను పట్టుకొంటాను. ఆమెను క్షేమంగా తీసుకవస్తాను. నామీద నమ్మకం లేకపోతే డబ్బిచ్చేయండి. లేదా, పోలీసు రిపోర్టివ్వండి!"

"డామిట్! డబ్బివ్వకుండా నువ్వామెను రక్షించ లేవు. పోలీసు రిపోర్టిస్తే పరిస్థితి విషమిస్తుంది. అనిత, రామేష్! నా మాటలు జాగ్రత్తగా వినండి. ఈ వ్యవ హారం మన ముగ్గురిమధ్య వుండిపోవాలి. బయట పొక్క కూడదు. ముఖ్యంగా మాడమ్‌కి తెలియకూడదు! ఆమె యొలా రియాక్టు అవుతుందో యెవరూ వూహించలేరు! దటీజ్ డేంజరస్. పోలీసు రిపోర్టిస్తే ఈ వ్యవహారం ప్రచారమవుతుంది. సరోజ ప్రతిష్ట దెబ్బతింటుంది. ఆమె ప్రాణాలకే ఆపద కలగవచ్చు. అర్థమయిందా?"

కామేష్ తలూపాడు, "మరి స్వామి విషయం ఏమిటి?"

"వాడికొక్కడికా తెలియకూడదు. రేపురాత్రి ఎనిమిది గంటలవరకు గడువు పెట్టారు కిడ్నాపర్స్. ఈ వ్యవహారంలో డబ్బు చెల్లించడం తప్ప మరో గత్యంతరం లేదు"

"మరి మాడమ్కి, స్వామికీ, సరోజ గురించి యేం చెప్పాలి?"

రావ్ ఒక్క క్షణం కలవరపడ్డాడు. ఏదో తీవ్రంగా ఆలోచించి తలవూపి అన్నాడు, "ఆమె ఉదయం ఐదు గంటల ట్రయిన్ కి గుల్మార్గ్ వెళ్ళిందని చెప్పండి, స్నేహితులతో."

"గుల్మార్గ్ ఎందుకు?" అనిత అడిగింది తికమకగా.

"మౌంటనీరింగ్, స్కీయింగ్ నేర్చుకోడానికి. వారంరోజులలో తిరిగి వస్తుంది."

"కానీ ఆమె రేపురాత్రి తిరిగి వస్తుంది కదా?" కామేషన్నాడు.

రావ్ అసహనంగా కసిరాడు, "డామిట్! సరోజ చిత్రమయిన మనిషి! ఆమె ప్రోగ్రాం కాన్సిల్ చేసుకొని వచ్చేసిందని చెప్పండి!"

ఆ తర్వాత ఎవరికీ సందేహాలు రాలేదు.

# 8

మర్నాడు వుదయం మాడమ్ గిరిజ కాలకృత్యాలు తీర్చుకుని, టిఫిన్ దగ్గర కూర్చుని అడిగింది, "సరోజ యింకా లేవలేదా?"

అనితలో సన్నగా వణుకు ప్రారంభమైంది. గుండె ఝల్లుమంది. "ఆమె...ఆమె...ఉదయం వూరికెళ్ళింది."

గిరిజ స్పూను కింద పెట్టేసింది, "వూరుకెళ్ళిందా? యే వూరు?"

"గుల్మార్గ్" ధైర్యం కూడదీసుకుని అంది అనిత.
"కాశ్మీర్ దగ్గర. వారం రోజుల్లో వస్తుంది."

"ఎందుకెళ్ళింది? ఎవరితో వెళ్ళింది?"

"ఫ్రెండ్స్‌తో వెళ్ళింది. మౌంటనీరింగ్ — అంటే కొండలెక్కడం — వగైరా నేర్చుకోడానికి—"

"నాతో చెప్పలేదే?"

"వెళ్ళేక్షణం వరకూ ఎవరికీ చెప్పలేదు. ఉదయం నా దగ్గరికి వచ్చి చెప్పి వెళ్ళిపోయింది."

"వెంట ఎవరున్నారు?"

"ఫ్రెండ్స్."

"ఇంకా?"

అనిత కలవరపడింది, "అంటే?"

"రామేష్ వెళ్ళలేదా?"

అనిత రక్తనాళాలు చిట్లిపోయాయ్. ముఖంలో రక్తం ప్రవహించింది. ఎర్రబడ్డ ఆమె ముఖంచూసి మళ్ళీ అడిదింది గిరిజ.

అనితగాని, రావ్‌గానీ, రామేష్‌గాని, ఆమె యీ ప్రశ్న వేస్తుందని ఊహించలేదు!

"లేదు—రామేష్ వెళ్ళలేదు!"

"ఎందుకు వెళ్ళలేదు?" కోపంగా అర్చింది గిరిజ, "అతని ఉద్యోగమేమిటి?"

అనిత అడుతగిలింది, "మీరనవసరంగా—"

"నోర్మూయ్!" గర్జించింది గిరిజ, "రామేష్ ఎక్కడ వున్నాడు? ఆ సోమరిపోతునిలా పిలువ్!"

అనిత ఫోన్ దగ్గరికి వురికింది.

గడ్డం గీసుకుంటున్న రామేష్ టెలిఫోన్ శబ్దం విని రిసీవర్ ఎత్తాడు. అవతల మాటలు విని మళ్ళీ తాపీగా గడ్డం గీసుకోసాగాడు. అది పూర్తయ్యాక ముఖం కడు

క్కని నిదానంగా బయలుదేరాడు బంగళాకి.

మాడమ్ ఎందుకు పిలుస్తోందో అతనికి తెలుసు, అయితే ఆమె అడిగే ప్రశ్న ఎలాంటిదో అతనికి తెలీదు.

"కామేష్!" గిరిజ అంది ఉద్రేకంగా, "నువ్వు సోమరి పోతువే కాదు, నీ సోమరితనం నా వంశానికి ప్రమాదం తెచ్చిపెడుతుందని యిప్పుడే తెలిసింది. సరోజవెంట నువ్వెందుకు వెళ్ళలేదు?"

కామేష్ అదిరిపోయాడు. బోనులోపడ్డ ఎలుకలా అటూ యిటూ చూశాడు గాభరాగా. ఇప్పుడు తను ఎలాంటి చిక్కులో పడ్డాడో వెంటనే అర్థమైంది. డామిట్! రావ్ ట్రాప్‌లో ఇరికించేశాడు!

"మాట్లాడవేం?" అర్చింది గిరిజ.

కామేష్ తేరుకున్నాడు, "మాడమ్...సరోజ-సరోజ ఊరికెళుతున్నట్టు అనిత నాకు ఫోన్ చేసింది. వెంటనే వచ్చాను. ఆమె హఠాత్తుగా ఎందుకు వెళుతుందో—అర్థంకాలేదు! గుల్మార్గ్ వెళుతున్నట్టు చెప్పింది. నేనూ వస్తానన్నాను—కానీ వద్దంది. అంతమంది ఫ్రెండ్స్‌లో బాడీగార్డ్ అనవసరం అంది. ఎంత చెప్పినా విన్పించుకో లేదు! వెళ్ళిపోయింది—"

"వెంటనే నాకెందుకు చెప్పలేదు?"

అతను గుటకమింగి వెంటనే అన్నాడు, "మీరు స్లీపింగ్ పిల్ తీసుకున్నారు ..అనిత ఎంత లేపినా మెలు కువ రాలేదు!"

కామేష్‌నీ, అనితనీ తదేకంగా చూసింది గిరిజ. అనిత కామేష్‌ని ఆందోళనగా చూస్తోంది. అతను అన్ని అబద్ధాలు ప్రవాహంలా ఎలా వదిలాడో అర్థంకావడం లేదామెకి.

"సరే, వెళ్ళండి!" గిరిజ అంది చివరికి, "ఒక విషయం

గుర్తుంచుకోండి — సరోజ క్షేమంగా తిరిగి రాకపోతే... తిరిగి రాకపోతే నాతోపాటు మీరూ ఛస్తారు! జాగ్రత్త!!"

రామేష్ తలూపి బయటికి నడిచాడు. శరీరం నిలువునా కంపించిపోతోంది. తానేం చేస్తున్నాడో తనకే తెలియదు!

అవుట్ హౌస్ తలుపు తెరుస్తోండగా ఫోన్ శబ్దం వినిపించింది.

మళ్ళీ ఎవరు?

రామేష్ మతి చెడిపోయింది. గబగబ వెళ్ళి రిసీవర్ ఎత్తాడు.

"రామేష్, డబ్బివ్వడానికి రావ్ ఒప్పుకున్నాడు" బుల్ డోజర్ గొంతు ఖంగుమంది అవతలినించి.

రామేష్ గాభరా తగ్గింది, "గుడ్ లక్. నేను తీసుకుని వస్తాను. సరోజ ఎలావుంది?" గొంతు స్థాయి తగ్గించి రహస్యంగా పలికాడు.

"భయపడకు! ఇంకా మత్తులోనే వుంది" అన్నాడు గవుండర్.

"డోస్ జాగ్రత్త! నేను ఎన్నిగంటలకి రావాలి?"

"రాత్రి ఎనిమిది గంటలకి. జాగ్రత్త సుమా! గుడ్ బై!"

మరుక్షణం లైను కట్ అయింది. చాలాసేపు ఏదో ఆలోచిస్తూండిపోయాడు రామేష్.

మూడులక్షలు! ఆ డబ్బు నిజంగా నాది కాబోతుందా? నమ్మవచ్చా? ఓహ్ గాడ్! ఏంచేసుకోను అంతడబ్బు!

వెంటనే అతని కళ్ళముందు బొంబాయి మహానగరం

మెరిలింగ్. కన్న కలలు ఫలించే రోజు యింత దగ్గర్లో వుందా!

రామేష్ వాస్తవలోకాన్ని వదిలేసి ఊహాలోకంలో పడిపోయాడు. భవిష్యత్ కార్యక్రమాల గురించి పథకాలు తయారుచేయసాగాడు. అరగంట ... గంట ...గడిచి పోయాయి.

సరోజ యింటికి రాగానే తను ఈ ఉద్యోగం వదిలేసి ఆ డబ్బుతో బొంబాయి వెళ్ళిపోవాలి. ఈ ఉద్యోగంలో సోమరితనం, నిర్లక్ష్యం ఎక్కువవుతున్నాయని మేడమ్‌కి కారణం చెప్పాలి.

స్వామి గదిలో ప్రవేశించాడు.

రామేష్ ఉలిపడి చూసి, "ఏమిటి?" అనడిగాడు.

"బాస్ పిలుస్తున్నాడు" అన్నాడు స్వామి ముక్తసరిగా. అతని కళ్ళు రామేష్ని అదోలా, తీక్షణంగా చూస్తున్నాయి.

ఇంతవరకు స్వామి అలా యెన్నడూ రామేష్ని చూడలేదు.

# 9

ఎ. బి. రావ్ రామేష్‌ని చూసి, "యిలారా, కూచో. నీతో చాలా విషయాలు మాట్లాడాలి" అన్నాడు.

రామేష్, రావ్‌ని చూసి లోనికివచ్చి కూచున్నాడు అతని కెదురుగా. రాత్రంతా నిద్రలేకపోవడం వలన రావ్ కళ్ళు ఎర్రబడ్డాయి. ముఖంలో అలసటవుంది.

"సర్, యెందుకు పిల్చారు?" రామేష్ అడిగాడు ధైర్యంగా.

రావ్ అన్నాడు, "నేను పెద్దచిక్కులో పడ్డా నిప్పుడు. నీ సహాయం కావాలి."

"చెప్పండి సర్. ఏ సహాయమైనా చేస్తాను."

"డబ్బు చెల్లించడానికి నేను సిద్ధంగా వున్నాను. కానీ..."

ఆగిపోయాడు రావ్. రామేష్ ఆత్రంగా చూశాడు.

రావ్ మళ్ళీ అన్నాడు రామేష్ని పరీక్షగా చూస్తూ, "డబ్బు బ్యాంకులో వుంది. చెక్కు వ్రాసి నీచేత తెప్పించు కోగలను, కానీ..."

మళ్ళీ ఆగిపోయాడతను.

"కానీ?...సర్?" రామేష్ అన్నాడు.

"నా అధికారానికి కొన్ని పరిమితులున్నాయి" రావ్ చెప్పాడు.

"ఏమిటవి?"

"చెక్కు వ్రాసి బ్యాంకునుంచి డబ్బు తీయగలను. అయితే, తొంభైతొమ్మిది వేల, తొమ్మిదివందల తొంభై తొమ్మిది రూపాయల, తొంభైతొమ్మిది పైసలవరకు మాత్రం చెక్కు వ్రాసే అధికారం నాకుంది. ఆపైన నయాపైసా మించినా నాకు అధికారంలేదు."

రామేష్ కలవరపడి, "నాకర్థంకాలేదు సర్!" అన్నాడు.

రావ్ చెప్పినమాటల్ని తిరిగి చెప్పి, "నేను వ్రాసే చెక్కు లక్షరూపాయలలోపు వుండాలి. ఇప్పుడు పది లక్షలు అవసరం వుంది. అంతడబ్బు డ్రాచేసే అధికారం నాకు లేదు!" అన్నాడు.

"ఎవరికి వుంది?"

"లక్షరూపాయల చెక్కుపైన మాడమ్ సంతకము కావాలి. నా సంతకం చెల్లదు."

"అయితే చిక్కేమిటి? ఆమె సంతకం తీసుకోండి."

రావ్ కోపంగా చూశాడు, "నువ్వు మర్చిపోతు న్నావు. ఈ వ్యవహారం మాడమ్కి తెలియకూడదన్నాను"

"క్షమించండి. ఈ వ్యవహారం మాడమ్‌కి తెలియదు. డబ్బు ఇంకేదో అవసరానికని చెప్పండి."

"ఆమెను మోసం చెయ్యను."

"ఇది మోసంకాదు. ఆమె కూతురి క్షేమంకోసం."

"అవును. ఆమె కూతురి క్షేమంకోసం. అయితే సరోజ అపాయంలో వుందని ఆమెకి చెబితే ఆమెచావుకి కారకుడ్ని నేనవుతాను. అలాగాక డబ్బు ఇంకేదో అవసరానికని అబద్ధం చెబితే ఆధారాలు కావాలి. ఏ అవసరానికి? ఉన్నపళంగా నేనెలాటి అవసరాన్ని సృష్టించే స్థితిలో లేను!"

కామేష్‌కి పిచ్చెక్కినట్టయింది.

"అయితే ఏం చేస్తారు? మనం ఎంత త్వరపడితే అంత మంచిది. లేదా సరోజ ప్రాణాలకే ముప్పు! ఏదో ఒకటి త్వరగా ఆలోచించండి."

"ఆలోచించాను," రావ్ అన్నాడు. "బాగా ఆలోచించాను. ఈ ఆలోచన నా మెదడులోకి రావడం..." నవ్వాడతను. "సరే, నా ఆలోచనని ఆచరణలో పెట్టేందుకు నీ సహాయం కావాలి. ఈ సహాయం నువ్వు చేస్తే జన్మకంతటికీ గుర్తుంచుకునే బహుమానమిస్తాను."

చివరిమాటలు విని ఉలికిపడి రావ్ కళ్ళలోకి చూసేడు కామేష్. క్రూరంగా మెరుస్తున్నాయి.

"సర్, ఏం సహాయం చెయ్యాలి?"

రావ్ సొరుగులాగి టేప్ రికార్డర్ బయటకు తీశాడు. ఒకసారి కామేష్‌ని చూసి దాన్ని టేబిల్ మీద వుంచాడు.

కామేష్ కళ్ళప్పగించి రికార్డర్‌ని చూస్తున్నాడు. అతనికేమీ అంతుబట్టడం లేదు.

"సర్, ఏమిటిది!"

"నీకు తెలుసు. స్విచ్ నొక్కు." రావ్ లేచి గదిలో పచార్లు చేయసాగాడు.

రామేష్ ఒళ్ళు జలదరించింది.

వణుకుతున్న చేతులతో రికార్డర్ స్విచ్ నొక్కాడు.

కొన్ని క్షణాలు నిశ్శబ్దం.

ఆ తర్వాత మాటలు విన్పించాయి :

"రామేష్, డబ్బివ్వడానికి రావ్ ఒప్పుకున్నాడు." గవుండర్ గొంతు.

"గుడ్ లక్. నేను తీసుకొని వస్తాను. సరోజ యెలా వుంది?" రామేష్ గొంతు.

"భయపడకు! ఇంకా మత్తులోనే వుంది" గవుండర్ గొంతు.

"డోన్ట్ జాగ్రత్త! నేను ఎన్నిగంటలకి రావాలి?" రామేష్ గొంతు.

"రాత్రి ఎనిమిది గంటలకి. జాగ్రత్త సుమా! గుడ్ బై!" మళ్ళీ గవుండర్ గొంతు.

"గవుండర్! సరోజని జాగ్రత్తగా చూడు! గుడ్ బై!" మళ్ళీ రామేష్ గొంతు.

ఆ తర్వాత మాటలు విన్పించలేదు.

అంతే... రామేష్ నెత్తిమీద పిడుగులవర్షం ప్రారంభమయింది. నోరు తడారిపోయి నాలిక పిడచకట్టుకుపోయింది. కళ్ళు చీకట్లుకమ్మి ముందుకుతూలి టేబిల్ మీద తల వాల్చేశాడు.

రావ్ చుట్ట విసిరేసి మరోచుట్ట వెలిగించాడు. తిరిగి రివాల్వింగ్ ఛేర్‌లోకి వచ్చి కూచొని, "నా ఆలోచన బావుందికదూ?" అన్నాడు గర్వంగా. రామేష్ తేరుకొని మాశాడు. మోసం జరిగిందని అతనికి తెలిసిపోయింది. అయితే ఎలా జరిగిందో అర్థంగా లేదు.

"చాలా బావుందిసర్. ఈ ఆలోచన మీకెలా వచ్చింది?" అనడిగాడు ధైర్యంగా. ఇప్పుడు తామిద్దరు శత్రువులు. రావ్ తన యజమానికాడు. అతన్ని ధయిర్యంగా ఎదుర్కోవాలి.

"నువ్వొక తప్పుటడుగు వేశావు రామేష్," రావ్ అన్నాడు. "రాత్రి నువ్వు బయటకు వెళ్ళి వచ్చినపుడు స్వామి చూశాడు. ఉదయం నాతో చెప్పాడు. నువ్వు బయటికెందుకెళ్తావ్? ఇందులో ఏదో మర్మం వుందనిపించింది. ఈ కిడ్నాపింగ్‌లో నీ హస్తంకూడ వుందని అనుమానం కలిగింది. వెంటనే నీ టెలిఫోన్‌ని టాప్ చేయించాను. ఉదయం నువ్వూ, గవుండర్ ఫోన్‌లో మాట్లాడుకున్న మాటలు టేప్ అయ్యాయి. నువ్వు దొరికి పోయావు.

"యూ కన్నింగ్ బాస్టర్డ్! విశ్వాసంగల కుక్కలా కన్పించేవాడివి, జిత్తులమారి నక్కలా తేలావు! నీ చావు బ్రతుకులు ఇప్పుడు నా చేతిలో వున్నాయి. సరోజని మర్యాదగా నా కప్పగించు!"

రావ్ అరుపువిని రామేష్ అదిరిపడ్డాడు.

స్వామి తనని చూశాడు! ఎంత చిన్న పొరపాటు! స్వామివల్ల ప్రమాదం వుంటుందని తానెందుకు వూహించలేదు? ఆ ఒక్క పొరపాటువల్ల ప్లానంతా తలకిందులయింది. పదిలక్షలు మంటగలిశాయి! అంతేగాక ప్రాణాలమీదికి వచ్చింది వ్యవహారం!

"రామేష్!" రావ్ హెచ్చరించాడు. "మంచిగా చెబుతున్నాను, సరోజని నాకప్పగించు. నిన్ను క్షమించి వదిలేస్తాను. నాకు ద్రోహంచేసి క్షేమంగావున్న మొదటి మనిషివవుతావు. మూడు గంటలలోగా సరోజ నాముందుండకపోతే నిన్ను చంపేస్తాను."

కామేష్ నిర్లక్ష్యంగా చూశాడు.

రావ్ మళ్ళీ అన్నాడు. "నిన్ను చంపుతాననే భయంతో నన్ను హత్యచేసే ప్రయత్నం చెయ్యకు! నా భద్రత గురించి అన్ని ఏర్పాట్లు చేసుకున్నాను. ఆ టేప్ తీసికెళ్ళి నీ పార్ట్నర్స్‌కి వినిపించు. ఆ తర్వాత సరోజని నా కప్పగించు. వొరిజినల్ టేప్ ఒకానొక చోట వుంది. నేను చనిపోయిన పక్షంలో అది పోలీసులకి చేరుతుంది. చాలా ప్రమాదకరం! మైసన్, ప్లీజ్ గెటవుటాఫ్ హియర్!"

రావ్ అరుపువిని, టేప్ రికార్డర్ అందుకొని తల వంచుకొని, బయటికి నడిచాడు కామేష్.

# 10

టేప్ రికార్డర్‌లోని మాటలు విని నిప్పుతొక్కిన కోతిలా గంతులు వేశాడు గవుండర్, "నాన్సెన్స్ ఇది యెలా జరిగింది? కామేష్! ఇందులో మోసంవుంది. నువ్వు చేశావు! ఈ టేప్ నువ్వే సృష్టించావు!"

"షటప్ బాస్టర్డ్!" అర్చాడు కామేష్ కోపంగా. "పిచ్చిగా మాటాడకు. రావ్‌కి ఫోన్ చేసి కనుక్కో. రాత్రి నేను బయటకెళ్ళినట్టు స్వామిచూసి రావ్‌తో చెప్పాడు. రావ్‌కి నామీద అనుమానంవచ్చి టెలిఫోన్ను ట్యాప్ చేయించాడు. గవుండర్! ముందే చెప్పాను, రావ్ నుంచి నయాపైసాకూడా రాబట్టుకోలేవని! ఇప్పుడు తెలిసిందా? సరోజని వదిలెయ్! క్షేమంగా వుంటాం. లేదా చచ్చిపోతాం."

"చచ్చేదెవరు?" అర్చాడు గవుండర్. "రావ్‌కి నేను హెచ్చరిక చేశాను—డబుల్ క్రాస్ చేయకూడదని. నా మాట విన్లేదు. ఇప్పుడు సరోజని చంపేస్తాను."

"గవుండర్! నీకు మతిపోయింది. ఆమెను చంపితే మనమూ చచ్చినట్టే. ఇక మన ఆటలు సాగవు. రావ్ చెప్పినట్టు మూడుగంటలలోగా సరోజని అతని చేతికి అప్పగించాలి. లేదా ఒరిజినల్ టేప్ పోలీసుల చేతిలోకి వెళుతుంది!"

"ఒరిజినల్ టేప్ ఎక్కడవుంది?"

"తెలియదు. అతను చెప్పలేదు. పొరపాటు చెయ్యకు. రావ్‌ని చంపితే చాలా ప్రమాదం—టేప్ పోలీసులకి చేరుతుంది."

గవుండర్ పిడికిలి బిగించి బల్లమీద గుద్దాడు.

దిలావర్, జానీలు చెవులప్పగించి వింటున్నారు.

"గవుండర్," కామేష్ మళ్ళీ అన్నాడు. "నామాట విను. ఆ పదిలక్షలు మనకిదక్కవు. ఈ పథకం పారదు. సరోజని వదిలేద్దాం...రావ్ మనమీద ఎలాంటి చర్య తీసుకోనన్నాడు. సరోజని వదిలేద్దాం!"

గవుండర్ కళ్ళు మెరిశాయి.

"కామేష్, సరోజ కిడ్నాప్ చేయబడినట్టు మాడమ్‌కి తెలిస్తే ఏమవుతుంది?" అడిగాడతను.

కామేష్ అదిరిపడ్డాడు, "గవుండర్! ఈ బిజినెస్ మాడమ్‌కి తెలియకూడదు!"

"నాకు తెలుసు. మాడమ్‌కి తెలిస్తే ఆమెకేదయినా సంభవించవచ్చు...ప్రాణాలు పోవచ్చు...కాబట్టి రావ్ ఆ జాగ్రత్త తీసుకొనే వుంటాడు. ఇప్పుడు మన పని తేలిక! రావ్‌ని బ్లాక్ మెయిల్ చేస్తే చాలు."

"గవుండర్!"

"డోంట్ బాదర్! రావ్‌ని ఎలా దారికి తేవాలో నాకు మార్గం తట్టింది. నన్ను డబుల్ క్రాస్ చేస్తాడా? నాశనమయిపోతాడు! కామేష్, నేనిప్పుడు అతని దగ్గర

కొడుతున్నాను. పదిలక్షల రూపాయలతోబాటు ఆ టేప్ కూడా పట్టుకవస్తాను.'' గవుండర్ గబగబ బయటకి నడిచాడు.

కామేష్ హతాశుడయి కళ్లప్పగించి చూస్తూవుండిపోయాడు.

పావుగంట తర్వాత గవుండర్ అబిడ్స్‌లో ఎ. బి. రావ్ ఆఫీసులో వున్నాడు. రావ్ గవుండర్‌ని చూసి ముఖం చిట్లించాడు.

''హల్లో మిస్టర్ రావ్!'' పలకరించాడు గవుండర్.

అతని గొంతువిని రావ్ గుండె ఝల్లుమంది.

''నువ్వు... నువ్వు...?'' గొణిగాడతను.

''నేనే!'' గవుండర్ అన్నాడు రావ్ కెదురుగా కూచోని. ''సరోజని కిడ్నాప్ చేసిందీ, రాత్రి ఫోన్ చేసిందీ నేనే. నా హెచ్చరికల్ని తూచా తప్పకుండా పాటించాలని చెప్పాను. మీరేం చేశారు?''

రావ్ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి, ''ఎంత ధైర్యం నీకు! నా ఆఫీసులోకి రావడానికి... నన్ను బెదిరించడానికి... నిన్ను పోలీసులకి పట్టిస్తాను!''

''పొరపాటు చెయ్యకండి! మేం చేసిన పొరపాటును మీరు చక్కగా ఉపయోగించుకొన్నారు. పోలీసుల్ని పిలిస్తే నేనిక్కడ పట్టుబడతాను, గానీ అక్కడ సరోజ- ఆమె గురించి ఆలోచించారా?''

''ఆమెకేం సంభవించినా మీరంతా చచ్చిపోతారు జాగ్రత్త!''అరిచాడు రావ్, ''నేనేం చెప్పానో కామేష్ నీకు చెప్పలేదా?''

''చెప్పాడు. మా మాటల్ని టేప్ చేసి మీరనవసర గందరగోళం సృష్టించారు. ఆ టేప్ ఇచ్చేయండి!''

''కామేష్ దగ్గరవుంది.''

"ఒరిజినల్ మీ దగ్గర వుంది,"

"అది నీకు యిచ్చేది కాదు!"

"మరింకెవరికి యిచ్చేది? మాడమ్ చచ్చాక యెవరి కిచ్చినా ఏం ప్రయోజనం?"

"ఏమిటి నువ్వనేది? '

"ఆ టేప్ నాకిస్తే యీ కిడ్నాప్ గురించి మాడమ్‌కి తెలియదు. లేదా, మేం డబ్బుకోసం ఆమెని సంప్రతించ వలసివుంటుంది. దాని పరిణామం ఏమిటో మీకు తెలుసు."

"రాస్కెల్! బ్లాక్ మెయిల్ చేస్తున్నావా?

"లేకపోతే తెలివి మీ ఒక్కరి సొత్తనుకున్నారా? కమాన్, బిజినెస్ త్వరగా సెటిల్ చేయండి! డబ్బూ టేపూ నా చేతిలో పెట్టండి, క్విక్!"

రావ్ ముఖం కందిపోయింది. బోనులో పడ్డ సింహంలా అటూయిటూ చూశాడు. పదిలక్షలు!

"చూడు మిస్టర్! నాతో చెలగాటం నీకు మంచిది గాదు!" అన్నాడతను ఉద్రేకంగా. అయినా అతను చేయగలిందేమీ లేదు – డబ్బూ, టేపూ శత్రువుల పరం చెయ్యడంతప్ప!

టేపు ఇవ్వకపోతే ఈ వ్యవహారం మాడమ్‌కి తెలిసి పోతుంది. అప్పుడేం జరుగుతుందో అతనికి తెలుసు. మాడమ్‌కి మతిభ్రమించవచ్చు, లేదా మరణం సంభవించ వచ్చు! చివరకి ఓడిపోయాడు రావ్.

అయితే దుర్మార్గుల్ని దెబ్బతీయడానికి మరో మార్గం ఏదయినా వుందా?

"మిస్టర్ రావ్ ఒ తుటపడే మార్గాలు లేవు. నేను కోరింది ఇచ్చేయండి. అందరూ క్షేమంగా వుంటారు. మీరిచ్చేది మీ స్వంతడబ్బుగాదు. మాడమ్‌డబ్బు. ఆమె ఈ తుర్ని రక్షించడానికి ఇస్తున్నారు. మాడమ్ డబ్బు

మీద అధికారం చెలాయించి ఆమె వంశాన్ని నాశనం చేసే హక్కు మీకులేదు. గంటలోపల డబ్బు కావాలి.'' గవుండర్ అన్నాడు.

''గంటలోపల వీలుపడదు! వారం రోజులు ఆగాలి'' రావ్ అన్నాడు.

''మళ్ళీ పథకాలు ఏమీ ఆలోచించకండి! ఈక్షణంలో డబ్బుతీయండి — విషగడియలు దగ్గరపడుతున్నాయి.''

రావ్ కర్కశంగా చూశాడు, ''యీ సమయంలో బ్యాంకులన్నీ మూసివుంటాయి.''

''నాన్సెన్స్! మరెక్కడయినా ఏర్పాటు చెయ్యండి! డబ్బు ఇచ్చేవరకు ఇక్కడనుంచి కదలను. అలాగే టేపు విషయం మరువకండి!''

రావ్ కసిగా లోలోన తిట్టుకున్నాడు. ఆ తర్వాత ఫోన్ యెత్తి సేఠ్ చమన్‌లాల్‌తో మాటాడాడు. ప్రస్తుతం అంత డబ్బులేదని చమన్‌లాల్ చెప్పాడు. రావ్ నిస్పృహగా మరొక నెంబర్ తిప్పాడు. అవతలి నుంచి పలికిన నంబియార్, గంటక్రితం పన్నెండు లక్షలు విలువజేసే బ్యాంక్ హుండీలు విడిపించానని చెప్పాడు.

రావ్ విసుక్కుంటూ, ఆందోళనగా ఇంకా కొందరికి ఫోన్ చేశాడు. చివరకి ముగ్గురి దగ్గరనుంచి తృప్తికరమైన సమాధానాలు వచ్చాయి. ఆ ముగ్గురూ రావ్ కోరిన డబ్బు ఇచ్చేందుకు అంగీకారం తెల్పారు. ముగ్గురిలో ఇద్దరు చెరో మూడులక్షలు, ఒకరు నాలుగులక్షలు.

వెంటనే పంపించమని చెప్పి, రిసీవర్ పెట్టేసి నిట్టూర్చాడు రావ్.

''టేపు'' జ్ఞాపకం చేశాడు గవుండర్.

రావ్ పిడికిలి బిగించి బల్లమీద బలంగా గుద్ది

రిసీవర్ ఎత్తాడు. తన లాయర్‌కి ఫోన్ చేసి, ఉదయం యిచ్చిన చెక్కు తిరిగి పంపించమని చెప్పాడు.

# 11

రాత్రి ఎనిమిది దాటినా ఎలాంటి సమాచారమూ అందలేదు ఎ. బి. రావ్‌కి.

ఆఫీసుగదిలో అసహనంగా పచార్లు చేస్తున్నాడు. భయంకరమయిన అనుమానాలు ముసురుకుంటున్నాయి. తను ఎంతో తెలివిగా రిహార్సుచేసిన చెక్కు దుర్మార్గుడు పట్టుకుపోయాడు. అందుకతని కవమానంగా లేదుగానీ ఇన్ని గంటలు గడిచినా సరోజ ఎందుకు రాలేదో అర్థం గావడంలేదు. ఆమెకేం సంభవించింది.

ఈ ప్రశ్నకు సమాధానం మరో పదినిమిషాల తర్వాత లభించింది రావ్‌కి.

హఠాత్తుగా మోగుతోన్న ఫోన్‌ని వణుకుతోన్న చేత్తో ఎత్తాడు. అవతలి మాటలు విన్నాక గుండె ఆగినంత పనయింది. రిసీవర్‌ని విసిరికొట్టి బయటికి పరుగు తీశాడు. అతని శరీరం నిలువునా కంపించిపోతోంది.

పావుగంటలో విపరీతమయిన వేగంతో కారులో ఉస్మానియా హాస్పిటల్ చేరుకున్నాడు. అతని కోసం ఆవరణలోనే ఎదురు చూస్తోన్న పోలీసు అధికారి పలకరించి లోనికి తీసుకెళ్ళాడు.

ఇన్‌స్పెక్టర్ దేవిడ్ రావ్‌ని రెండవ అంతస్తులోని ఒక గదిలోకి తీసుకెళ్ళాడు. గదిలో మరొక ఇన్‌స్పెక్టర్ శివశేశన్ వున్నాడు. బెడ్ పక్కన తెల్లటి దుస్తుల్లో నర్స్ నిలబడి వుంది. ఆమెపక్కన డాక్టర్ వున్నాడు గంభీర వదనంతో.

బెడ్ మీద వెల్లికిలా పడుకుని వుంది సరోజ.

ఆమె కంఠంవరకు తెల్లటి దుప్పటి కప్పివుంది.

ఉఛ్వాస నిశ్వాసలతో ఆమె గుండెలు పైకీ కిందకీ వూగుతున్నాయి.

"ఏం జరిగింది డాక్టర్!" అన్నాడు రావ్.

"ఆమె సుమారు ఇరవై నాలుగు గంటలు స్పృహలో లేదు," చెప్పాడు డాక్టర్. "మిస్టర్ రావ్, కండిషన్ సీరియస్ గా ఏమీ లేదు. మరో రెండుగంటలలో స్పృహ రావచ్చు. నేను అన్నిరకాల పరీక్షలూ చేశాను. భయం లేదు! ఆమె స్పృహలోకొచ్చాక ట్రీట్ మెంట్."

"డామిట్!" కసిరాడు రావ్. "ఇన్ స్పెక్టర్, ఆమె ఎక్కడ దొరికింది?"

శివనేశన్ అదోలా చూశాడు రావ్ ని, "మిస్టర్ రావ్, ఈ వ్యవహారం నా కర్థంగావడంలేదు. ఆమెను ఎవరయినా కిడ్నాప్ చేశారా? నిజం చెప్పండి!"

"అవును! ముందు ప్రశ్నకి—"

"రిలాక్స్! రిలాక్స్!" శివనేశన్ అన్నాడు ప్రశాంతంగా.

శివనేశన్ చెప్పిన మాటల సారాంశం ఇది:

గతరాత్రి సుమారు రెండు గంటలకి ట్రాఫిక్ కంట్రోల్ రూంకి ఒకరిపోర్టు అందింది, కారు దొంగతనం గురించి. ఫియట్, క్రీం కలర్, నెంబర్—ఆ కారు రెండు గంటలనుండి కన్పించలేదని ఒక నగలవ్యాపారి రిపోర్టు ఇచ్చాడు. అది ఒక బార్ ముందునుంచి మాయమయింది.

వెంటనే పోలీసులు గాలింపు ప్రారంభించారు. నేటి సాయంకాలం వరకు గాలింపు కొనసాగుతూనేవుంది. ఈ సాయంత్రం పోలీసులు అన్ని చెక్ పోస్టులవద్దా కాపలా కాశారు.

విజయవాడ రోడ్డుమీద సుమారు ఏడుగంటలకి చెక్ పోస్ట్ దగ్గర పోలీసులు ఒక కారాపారు. అది ఫియట్— కావలసిన నెంబర్, రంగు— అన్నీ వున్నాయి.

ఆ కారులో నలుగురు పురుషులు వున్నారు. ఒక స్త్రీ వుంది— ఆమె వెనక సీట్లో కూచున్న ఒక యువకుడి ఒళ్ళో పడుకుని వుంది. పోలీసులు ప్రశ్నించారు. అనుమానంమీద నలుగురినీ అరెస్టు చేశారు. కారును స్వాధీనం చేసుకున్నారు.

స్పృహలేని స్థితిలో సరోజవుంది.

తక్షణం హాస్పిటల్ లో చేర్పించారు.

అంతావిని రావ్ అన్నాడు, "థాంక్స్ వెరీమచ్, ఇన్ స్పెక్టర్స్! మీరు చాలా సహాయం చేశారు!"

"ఇప్పుడు మీరు సహాయం చెయ్యాలి" శివశేఖర్ అన్నాడు.

"తప్పకుండా!"

"ఈ వ్యవహారం ఏమిటో వివరించండి!"

రావ్ అంతా వివరించి చెప్పాడు.

ఇన్ స్పెక్టర్స్ శ్రద్ధగా విన్నారు. తాము పట్టుకున్నది కారు దొంగలనే కాదు, పెద్ద బ్లాక్ మెయిలర్సని తెలిసి మరింత ఆశ్చర్యపోయారు.

—: అయిపోయింది :—

# మృత్యు రహస్యం?

వసుంధర

"సాంబశివరావుగారింట్లో వున్నారాండీ?" అన్నాడతను.

"లేరండి" అందా అమ్మాయి.

"ఇప్పుడు వస్తారాండీ?"

"తెలియదండి."

"ఎప్పుడు వస్తారో తెలుసాండీ?"

"తెలియదండి..."

అతను చిరాకును వ్యక్తపరచకుండా "ఆయన వచ్చే వరకూ ఇంట్లో నేను ఎదురుచూడ్డానికి మీకేమైనా అభ్యంతరమా?" అన్నాడు.

"అన్నయ్య నడిగి చెబుతాను-"అంటూ తుర్రున లోపలకు పరుగెత్తిందా అమ్మాయి. అతడు ఆ వైపే చూస్తూ "ఈ యింట్లో ఈ సమయంలో ఇంట్లో ఉండే మగాడొకడున్నాడన్న మాట" అనుకున్నాడు.

రెండు నిముషాల్లో వీధి గుమ్మంలోకి ఇరవై ఏళ్ళ కుర్రా

డొకడొచ్చి "ఎవరండీ మీరు?" అనడిగాడు.

"సాంబశివరావుగారి కోసం వచ్చాను" అన్నాడతను.

"ఆయన మా నాన్నగారు. మీరెవరో చెప్పి ఆయనతో మీకేం పనో నాకు తెలియజేస్తే నాన్నగారు రాగానే మీ గురించి చెబుతాను" అన్నాడా కుర్రాడు.

"నీ పేరు?" అన్నాడతను.

"వీరభద్రం" అన్నాడా కుర్రాడు.

"మిస్టర్ వీరభద్రం – మీ నాన్నగారితో నేను స్వయంగా వీలైనంత అర్జంటుగానూ మాట్లాడాల్సివుంది. ఆయన వచ్చేవరకూ మీ యింట్లో ఎదురు చూడవచ్చా?" అన్నాడతను.

వీరభద్రం ఇబ్బందిగా ముఖంపెట్టి "ఆయన ఎప్పుడు వస్తారో తెలియదు. అసలీవేళ్టికి వస్తారో రారో తెలియదు" అన్నాడు.

"సాంబశివరావుగారూళ్లోనే వున్నారా?" అన్నాడతను.

"ఉన్నారు."

"ఉంటే ఇంటికి రాకుండా ఊళ్లో ఎక్కడో ఎందుకుండిపోతారు? ఏదో పైఖర్చులు చేరుకోక తప్పదుగదా" అన్నాడతను.

"అవన్నీ యిప్పుడెందుకులెండి? ఆయన అలవాట్లు వేరు. మీ పనేమిటో చెబితే ఆయనకు తెలియజేస్తాను. లేకపోతే మరోసారి రండి" అన్నాడు వీరభద్రం.

"ఎప్పుడింటికి వస్తాడో తెలియని పెద్దమనిషి కోసం మరోసారి మాత్రం ఎప్పుడని వచ్చేది? ఇప్పుడే ఇక్కడుండిపోయి వచ్చేదాకా యెదురుచూస్తే వదిలిపోతుంది..."

"చూడండి మీరెవరో నాకు తెలియదు."

"నాకు మాత్రం మీరెవరో తెలుసా?" అన్నాడతను చిరాగ్గా.

"అయితే నాన్నగారొచ్చేదాకా ఇంట్లో వుంటానంటారా" అన్నాడు వీరభద్రం.

"అనరేగు. అందుకు మీ అనుమతి కోరుతున్నాను."

"అయితే వుండండి. మా అమ్మనడిగి వస్తాను" అంటూ వీరభద్రం లోపలికి వెళ్ళబోయాడు. అతను వీరభద్రాన్ని వెనక్కి పిలిచి "చూడు. మీ ఇంట్లో మీ అమ్మకంటె పెద్దవాళ్ళెవ్వరైనా వున్నారా?" అనడిగాడు.

వీరభద్రం ఆశ్చర్యంగా "మా మామ్మ వుంది. ఏం?" అన్నాడు.

"ఏకంగా ఆవిణ్ణే పిల్చుకొనిరా. ఒకొక్కళ్ళే పదేసి నిమిషాలు నన్ను గుమ్మంలో నిలబెట్టి మాట్లాడి వాళ్ళకంటె పెద్దవాళ్ళని పిల్చుకువస్తామని వెళ్ళిపోతున్నారు."

వీరభద్రం నవ్వి "మా యింట్లో మా అమ్మమాటకు తిరుగులేదు" అని అక్కణ్ణించి లోపలకు వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిన రెండునిముషాల్లో ఓ నడివయస్కురాలు అక్కడికి వచ్చి "ఎవరు?" అని ఏదో ప్రశ్నించబోయి అతన్ని చూసి నోట మాటరాక ఆగిపోయింది. అతను కూడా ఆమెవంక ఆదోరకంగా చూస్తున్నాడు.

ఒక్క నిమిషం అలా నిలబడ్డాక "నువ్వా?" అన్నాదావిడ.

"నాకు మీరెవ్వరో తెలియదు. నేను సాంబశివరావుగారితో మాట్లాడడానికి వచ్చాను" అన్నాడతను.

ఆవిడ అతనివంకే తదేక ధ్యానంతో చూస్తూ "నువ్వేమీ మారలేదు" అంది.

"సాంబశివరావుగారు వచ్చేవరకూ మీ ఇంట్లో వుండొచ్చా?" అన్నాడతను అసహనంగా.

ఆవిడ ఈ లోకంలోకి వచ్చినట్లు కనబడింది.

"నీ పేరేమిటి బాబూ?" అన్నదావిడ.

"అడిగిన వాళ్ళందరికీ నా పేరు చెప్పవద్దని మా నాన్న నాకు మరీమరీ చెప్పాడు" అన్నాడతను గంభీరంగా.

"మీ నాన్నా?" అని ఆవిడ గతుక్కుమని "పోనీ మీ నాన్న పేరు?" అంది.

"నా పేరైనా చెప్పవచ్చుగానీ ఆయన పేరు చెప్ప కూడదు. అది నాన్న శాసనం."

"పోనీ సాంబశివరావుగారితో నీ పని?" అందామె.

"అది ఆయనకే చెప్పాలి."

"నేనాయనకు భార్యను. మా ఇద్దరిమధ్యా ఏ రహస్యాలూ లేవు. ఆయనకు చెప్పదల్చుకున్నదేదో నువ్వు నాకు చెప్పివెళ్ళవచ్చు" అందామె.

"భార్యకు చెప్పే రహస్యం రహస్యం కాదంటాడు నాన్న. నిజమైన రహస్యాన్ని ఏ భర్తా భార్యకు చెప్ప డుట" అన్నాడతను.

ఆవిడ గతుక్కుమని "మీ నాన్న ఎక్కడున్నాడు?" అంది.

"మా నాన్నగురించి నేనేమీ చెప్పను" అన్నాడతను.

"అయితే నువ్వు సాంబశివరావుగార్ని కలుసుకోడానికి వీల్లేదు" అందావిడ.

"ఆయన్ను కలుసుకోవడంవల్ల నాకేమీ లాభంలేదు. ఆయనకే లాభం" అన్నాడతను.

"ఏమిటా లాభం."

"చాలా పెద్ద ·భం."

"ఎంత పెద్దది?"

"అద్దె ఇంట్లో వుండి నెలకు రెండొందలు మాత్రం సంపాదించుకునే వాడు స్వంత బంగళా కొనుక్కొని లక్షాధికారి అయ్యాడనుకోండి. అది పెద్ద లాభమేనా?"

"ఏమో నాకేం తెలుస్తుంది?" అందావిడ యేమో ఆలోచిస్తూ.

"మీరు మరచిపోయి వుంటారు. కానీ సాంబశివరావు గారికి గుర్తుంటుంది."

"ఇంతకీ ఏమంటావు" అందావిడ.

"సాంబశివరావుగారిని అర్జంటుగా కలుసుకుని మాట్లాడాలి. ఆయన ఎక్కడున్నారో చెప్పండి లేదా ఆయన ఇంటికి వచ్చేవరకు ఎదురుచూసే అవకాశం నాకివ్వండి" అన్నాడతను.

ఆవిడ ముఖంలో రకరకాల భావాలు మారాయి. కొంచెంసేపు ఆగి "సరే లోపలకు రా" అంది.

## 2

"ఎవరమ్మా అతను?" అన్నాడు వీరభద్రం.

"ఏమో - ఎవరో?" అందావిడ. ఆవిడ ఏదో ఆలోచిస్తున్నదని ముఖం చూస్తేనే తెలుస్తుంది.

"ఎవరో ఏమిటి—నీకు తెలుసు. నువ్వతన్ని గుర్తుపట్టావు" అన్నాడు వీరభద్రం.

"ఓహో! సంభాషణంతా విన్నావన్నమాట - ఆ కుర్రవాడు నాకు తెలియదు. కానీ గతంలో నాకు తెలిసిన ఒకడు అచ్చం ఇతనిలానే వుండేవాడు" అందావిడ.

"అతనే ఇతను కాడని గ్యారంటీ ఏమిటి?" అన్నాడు వీరభద్రం.

"కాదు. అతన్ని నేను సుమారు పాతికేళ్ళ వయసప్పుడు చూశాను. చూసి ఇరవైయేళ్ళకు పైగా అయింది. ఇతనికి వయసు పాతికేళ్ళలోపేగదా" అందావిడ.

వీరభద్రం తనలో తనే ఏదో గొణుక్కుని, "ఎంత పుత్రుడిలా కనిపించాలనుకున్నా యాభయ్యేళ్ళవాడి ముఖానికీ పాతికేళ్ళవాడి ముఖానికీ తేడా వుంటుంది. బహుశా ఇతను అతడి కొడుకై వుంటాడు. అచ్చుదిద్దినట్లు తండ్రిపోలిక వచ్చివుంటుంది" అన్నాడు.

"అయుండొచ్చు అనిపించే తండ్రి గురించి అడిగాను. పుత్రుడు చెప్పలేదు —"

"అసలీ పుత్రుడితండ్రి నీకెలా తెలుసునమ్మా?"

"ఈ పుత్రుడి తండ్రి ఎవరో నాకు తెలియదనేకదరా చెప్పాను."

వీరభద్రం విసుగులో గారాన్ని మేళవించి "అతన్ని చూడగానే నువ్వా అని ఆశ్చర్యపడ్డావుగదా. అంటే నీకెవ్వరో గుర్తుకు వచ్చారు. ఆ గుర్తుకు వచ్చిన మనిషి గురించి నేనడుగుతున్నాను" అన్నాడు.

వీరభద్రం తల్లి కొడుకు ముఖంలోకి పరీక్షగా చూసి అతని మనసులోని భావాల్ని చదవడానికి ప్రయత్నించింది. ఆ తర్వాత "రోడ్డుమీద నిన్నెవరో చనువుగా పలకరించారనుకో. ఆ మనిషి ముఖం నీకు గుర్తు రావడం లేదనుకో_అప్పుడేం చేస్తావ్?" అనడిగింది.

"తెలివిగా సంభాషణ నడిపించి అతనెవరో తెలుసుకునేందుకు ప్రయత్నిస్తాను."

"అదే నేనూ చేశాను. ఆ పుత్రుణ్ణి చూడగానే ఎప్పుడో నేను బాగా ఎరిగిన ముఖం అనిపించింది. కానీ ఎవరో గుర్తుకు రాలేదు. ఆ విషయం అతని నోటమ్మటే చెప్పించాలని ప్రయత్నించి ఓడిపోయాను."

"మరొక్క సందేహం అమ్మా!" అన్నాడు వీరభద్రం.

ఆవిడ కంగారుగా కొడుకు ముఖంలోకి చూసి "అడుగు_ తీర్చగలిగితే తీరుస్తాను" అంది. వీరభద్రం

వెంటనే "నాన్నగారు పేదవాడుగా వుంటూ హఠాత్తుగా ఆస్తిపరుడయ్యారా?" అన్నాడు.

ఒక్క క్షణం తటపటాయించి "అవును" అందావిడ.

"హఠాత్తుగా ఐశ్వర్యం ఎలా వచ్చింది?"

"అవన్నీ నీ కనవసరం" అందావిడ కోపంగా.

"తండ్రి డబ్బెలా సంపాదించాడో కొడుకు తెలుసుకో గోరడం తప్పా?"

"తప్పని నేను అనలేదు. అనవసరం అన్నాను."

"ఎందుకని?"

"తరతరాలకు సరిబడ్డ డబ్బు మనకుంది. దాన్ని ఎలా కాపాడుకోవాలో నువ్వు తెలుసుకుంటే చాలు" అంది ఆవిడ. కొడుకు ఇంకేదో ప్రశ్న అడగబోతూంటే ఆవిడ గోడగడియారం వంక చూసి "నాన్నగారింకా రాలేదు. ఆయన వచ్చేదాకా ఆ మనిషి హాల్లోనే వుంటాడు" అంది.

తల్లికింక ఆ విషయం చర్చించడం ఇష్టం లేదని గ్రహించి, వీరభద్రం అక్కణ్నించి హాల్లోకి వెళ్ళాడు.

## 3

"ఎవరైనా కొత్తమనిషి మీ జీవితంలోకి ప్రవేశించి వెళ్ళిపోయాడనుకోండి. వాడి పేరు తెలుసుకోకపోవడమే మంచిది" అన్నాడతను.

"ఎందుకని?"

"మనిషి మనసు విచిత్రమైనది. కనపడ్డ ప్రతివాడికీ అది ఏదో ఒక పేరును ఆలోచించేస్తుంది. నన్ను చూడ గానే మీకు ఏదో పేరు స్ఫురించే వుంటుంది. సొట్టబుగ్గల వాడనో, పీక్కుమొహంగాడనో, సూదిముక్కువాడనో— ఇలా ఏదో ఓ పేరు మనసులోకి చేరుతుంది. అసలే పరి చయం లేదు కాబట్టి నన్ను గురించి ఆ పేరుతో వ్యవహా

రి సేనే మీకు తృప్తిగా వుంటుంది. ఒక వేళ నా పేరు తెలిసిందనుకోండి. ఇష్టం లేకపోయినా దాంతో నే వ్యవహరించాలి. అలా బాగుండదు'' అన్నాడతను.

అప్రయత్నంగా వీరభద్రానికి అతని గురించి ఉంగరాల జుట్టు అన్న పేరు స్ఫురించింది. అయినప్పటికీ ''నా మనస్తత్వం వేరు. మీ పేరు చెప్పండి'' అన్నాడు.

''మీ మనస్తత్వానికీ నేను పేరు చెప్పకపోవడానికీ ఏమీ సంబంధం లేదు.''

వీరభద్రం పేరువిషయం వదిలిపెట్టి అతనితో యితర విషయాలు చాలా మాట్లాడాడు.

ఉంగరాల జుట్టు చాలాసరదా అయినవాడు. వీరభద్రం అతని కంపెనీ బాగా ఎంజాయ్ చేశాడు. నిజం చెప్పాలంటే అతనితో మాట్లాడుతున్నంత సేపూ వీరభద్రానికి టయిం తెలియలేదు.

''ఒక చిన్న సందేహం—మొట్టమొదట నన్ను నువ్వని అన్నారు. తర్వాత మీరు మీరని సంబోధించడం మొదలు పెట్టారు. ఈ మన్ననకు కారణం?'' అడిగాడు వీరభద్రం.

''చాలా సింపుల్. మీ యింట్లో నన్ను ఎదురుచూడనివ్వమనగానే అందరిపైనా నాకు గౌరవం పెరిగింది'' అన్నాడు ఉంగరాలజుట్టు.

వీరభద్రం మరికాస్త ఆశ్చర్యపడి ''ఒక వేళ మా అమ్మగారు ఒప్పుకోకపోతే ఏంచేసి వుండేవారు'' అన్నాడు.

''ఈ వీధిలోనే నిఘా వేసేవాణ్ణి. అడిగినవాళ్ళందరికీ నేను సి ఐ డీ ఆఫీసర్ననీ- సాంబశివరావు గారిపై నిఘా వేస్తున్నాననీ చెప్పేవాణ్ని. అందువల్ల నాకేమీ నష్టం లేదు. ఉంటేగింటే'' అని అర్థోక్తిలో ఆగి వీరభద్రం వంక చూసి అదోలా నవ్వాడతను.

ఆ నవ్వు చూస్తూ "ఉంగరాలజుట్టు సామాన్యుడు కాడు" అనుకున్నాడు వీరభద్రం.

## 4

రాత్రి ఎనిమిది దాటినా సాంబశివరావు రాలేదు. వీరభద్రంతల్లి వుంగరాలజుట్టును బలవంత పెట్టి భోజనానికి లేపింది. మొహమాట పడుతూనే అతనక్కడ భోజనం చేశాడు. భోజనాలైపోయాక అతను మళ్ళీ వాళ్లోకి వెళ్ళి పోయాడు. వీరభద్రం అతనికి ఓ రెండు ఇంగ్లీషు నవల్సిచ్చాడు.

"తెలుగువి లేవా?" అన్నాడతను.

"తెలుగులో మంచి నవల్సు రావు. అందుకని అవి కొనను" అన్నాడు వీరభద్రం. ఆ మాటలన్నప్పుడు అతని ముఖంలో రవంత గర్వం కనపడింది.

"ఇంగ్లీషు మనకు సరిగ్గా రాదు. వాళ్ళ సంప్రదాయాలు మనకు సరిగ్గా తెలియవు. ఈ రెండు కారణాలవల్లా మనకు ప్రతి ఇంగ్లీషు నవలా బాగానే వుంటుంది. మనకు మన సంప్రదాయాలుకూడా తెలియవు. మన నవల చదివి అందులోని గొప్పతనాన్నర్థంచేసుకునేటంత ఓపికా, భాషాపరిజ్ఞానం మనకులేవు. అందుకే మన నవలలు మనకు నచ్చవు. నేను మాత్రం తెలుగు నవలలు మాత్రమే చదువుతాను. చాలావరకు నచ్చాయి—"

వీరభద్రం అదోలా నవ్వి—"ఇంగ్లీషునవల చదవనంతకాలమూ తెలుగు నవల బాగానే ఉంటుంది. ఆ విషయం నేనూ ఒప్పుకుంటాను—" అన్నాడు.

ఉంగరాలజుట్టు ఒకసారి కడుపుమీద చేత్తో రాసుకుని "మీరు మన నవలల్ని పరభాషకు చెందినవాటితో పోల్చి చిన్నబుచ్చుడంవల్లనో ఏమో నాకు కడుపులో తిప్పుతోంది" అన్నాడు. అతని ముఖం చూస్తే బాధను

అణుచుకునేందుకు ప్రయత్నిస్తున్నాడనిపించింది.

"మన భాష ఒక్కటే గొప్ప అనుకోవడం సంకుచిత మనస్తత్వం—" అన్నాడు వీరభద్రం.

"కావచ్చు. కానీ ప్రజారాజ్యానికి అదే అవసరం" అన్నాడు ఉంగరాలజుట్టు. ఈ పర్యాయం అతనిముఖంలో బాధ దాగలేదు. వీరభద్రం అతన్ని ఏదో ప్రశ్నించేలోగా "అబ్బా" అని మూలిగాడు ఉంగరాలజుట్టు.

"నేనేదో జోక్ అనుకున్నాను. మీకు కడుపులో నిజంగానే బాధగా ఉందా?" అన్నాడు వీరభద్రం అనుమానంగా.

"నేను కడుపులో విషాన్నైనా దాచుకోగలనుగానీ బాధను మాత్రం దాచుకోలేను. అబ్బా! నాకేమయింది?" అంటూ కాస్త గట్టిగానే అరిచాడతను.

వీరభద్రం భయపడి లోపలకు పరుగెత్తాడు. అతను తల్లితో తిరిగొచ్చేసరికి సోఫాలో పడుకుని మెలికలు తిరుగుతున్నాడు ఉంగరాలజుట్టు.

"ఏమైందబ్బా బాబూ?" అందావిడ.

"నొప్పి, బాధ భరించలేకపోతున్నాను..." అంటూ అరిచాడు ఉంగరాలజుట్టు.

"భద్రం! పరుగెత్తుకువెళ్ళి డాక్టర్ని పిల్చుకుని రా" అంది వీరభద్రం తల్లి.

వీరభద్రం ఆక్కణ్ణించి పరుగెత్తాడు. స్కూటరు మీద డాక్టరు యింటికి మూడు నిముషాల్లో చేరుకొన్నాడు. డాక్టర్ యింట్లోనే ఉన్నాడు భార్యతో సరసాలాడుతూ.

"మీరింట్లో ఉండడం నా అదృష్టం. అర్జంటుగా నాతో రావాలి. మా యింటికి అతిథిగా వచ్చిన ఒకతను

భోంచేసి మెలికలుతిరిగి పడిపోయాడు—" అన్నాడు వీరభద్రం.

డాక్టరు బయలుదేరుతూంటే "—పేషెంట్ల అదృష్టం—నాకు దురదృష్టం" అనుకుంది డాక్టరు భార్య. సాంబశివరావు యింట్లో కేసంటే డాక్టరుకి అదృష్టమే మరి! అందుకని ఆయన ఉత్సాహంగానే వెళ్ళాడు.

## 5

"ఇప్పుడు కాస్త తేలిగ్గా ఉంది" అన్నాడు ఉంగరాలజుట్టు. అప్పటికి డాక్టరు వెళ్ళి గంట దాటింది. టైము పదకొండు కావొస్తోంది. సాంబశివరావు యింకా రాలేదు.

వీరభద్రం అతనికి పక్క వేరే గదిలో ఏర్పాటుచేసి ఆ విషయం చెప్పాడు.

"నేను హాల్లోనే పడుకొంటాను—" అన్నాడు ఉంగరాలజుట్టు.

"ఎందుకని?"

"సాంబశివరావుగారు వస్తే హాల్లోంచేకదా ఇంట్లోకి వస్తారు. గదిలో ఉంటే వెంటనే ఆయన్ను కంటాక్టుచేసే అవకాశం పోతుంది—"

వీరభద్రం ఆశ్చర్యంగా "అంత అర్జంటైన పని ఏమిటో సాక్షాత్తూ సాంబశివరావుగారి కొడుకునైన నా కూడా చెప్పకూడదా?" అన్నాడు.

"చెప్పకూడదు" అన్నాడు ఉంగరాలజుట్టు.

"నాన్నగారు యింటికి రాగానే మిమ్మల్ని కలిసే ఏర్పాటు చేస్తాను కానీ మీరు మాత్రం హాల్లో పడుకోవద్దు. యిక్కడ చాలా చలిగా ఉంటుంది" అన్నాడు వీరభద్రం.

"పనిమీద ఉన్నప్పుడు హిమాలయా పర్వతాల్లో బట్ట ల్లేకుండా తిరగలను నేను."

"సరేలెండి. ఇవి హిమాలయా పర్వతాలని మాత్రం పొరబడకండి." అంటూ తన జోకుకు తనే నవ్వేశాడు వీరభద్రం.

ఆ సమయానికి ఎవరో తలుపు తట్టారు.

"అమ్మయ్య-ఇప్పటికైనా వచ్చారు"అని నిట్టూర్చాడు ఉంగరాలజుట్టు.

"ఆ వచ్చింది నాన్నగారు కాదు—" అన్నాడు వీరభద్రం.

"ఎలా చెప్పగలరు?" అన్నాడు ఉంగరాలజుట్టు చిరాగ్గా.

"నాన్నగారు తలుపుతట్టే పద్ధతి వేరు" అంటూ వీర భద్రం వెళ్ళి తలుపు తీశాడు. అక్కడ కనబడిన అపరిచి తుణ్ణి చూసి "ఎవరండీ మీరు?" అనడిగాడు.

"నా పేరు శంకర్రావు. ఇది రఘునాథరావుగా రిల్లేనా?" అంటూ గట్టిగా అరిచాడతను.

"అబ్బా-అంత గట్టిగా అరవడమెందుకు? నాకేం చెవుడులేదు. ఇది రఘునాథరావుగారిల్లుకాదు. సాంబశివ రావుగారిల్లు" అన్నాడు వీరభద్రం.

"ఏమైతేనేం? వచ్చినపని అయింది. విషయం తెలి సింది" మళ్ళీగట్టిగా చేఅనిఅక్కణ్ణించి వెళ్ళిపోయాడతను.

వీరభద్రం తలుపులు వేసివచ్చాక "వచ్చిందెవరు?" అనడిగాడు ఉంగరాలజుట్టు.

"అంత గట్టిగా అరిచాడు వినపడలేదా?" అన్నాడు వీరభద్రం విసుగ్గా.

"లేదు" అన్నాడతను.

వీరభద్రం చెప్పాడు.

ఉంగరాలజుట్టు టైము చూసుకున్నాడు. "మీ నాన్న గారి రాత్రికి యింటికి రారనుకుంటున్నాను...—" అన్నాడు.

"నేనేమీ అనుకోవడం లేదు —" అన్నాడు వీరభద్రం.

"మీ నాన్నగారి ప్రవర్తన అనుమానాస్పదంగా ఉంది. ఇష్టం వచ్చినప్పుడు యింటికి వచ్చిపోతూండడం సంసారుల లక్షణం కాదు. ఓ టైమూ, ఓ వేళపాళా ఉండాలి."

"సంసారుల లక్షణాలకు నిర్వచనాలు లేవు. ఎవరి పద్ధతి వారిది. మా యింట్లో మా నాన్నగారిని విమర్శించకండి—" అన్నాడు వీరభద్రం.

"విషయం చెబితే విమర్శ అనుకుంటున్నారు. సరే లెండి. నా అదృష్టం బాగాలేదు. నేను మీ నాన్నగారిని మరోసారి కలుసుకుంటాను. ఈ వేళ్టికి సెలవు తీసుకుంటాను" అన్నాడు ఉంగరాలజుట్టు.

"మీరు వెళ్ళిపోతారా?" అన్నాడు వీరభద్రం. అతనికి కలిగిన ఆశ్చర్యం యింతా అంతా కాదు. ఏ పరిస్థితుల్లోనూ ఉంగరాలజుట్టు తండ్రి వచ్చేవరకూ తన యిల్లు వదిలిపెట్టడని అతను అనుకున్నాడు.

"అవును—వెళ్ళిపోతాను—..." అంటూ అతను లేచి నిలబడ్డాడు.

"ఎందుకని?"

"నా ఓర్పుకు అంత ముండదనుకున్నాను. కానీ ఉందని ఇప్పుడే తెలిసింది—"

"చాలా అర్జంటుపని అన్నారు. కలుసుకు తీరాలన్నారు—"

"అన్నాను కానీ ఆయనకా అదృష్టంలేదు" అన్నాడు ఉంగరాలజుట్టు.

అతను వెళ్ళిపోయాక వీరభద్రం తల్లి— "అతన్ని మనం ఆపగలిగితే బాగుండేది! అసలెందుకు వచ్చినట్లు? ఎందుకు వెళ్ళిపోయినట్లు?" అంటూ నిట్టూర్చింది.

తల్లి నిట్టూర్పులో ఉంగరాలజుట్టుపై ఒక ప్రత్యేకమైన ఆసక్తిని వీరభద్రం గుర్తించాడు. ఆ విషయమై అడిగి ప్రయోజనం లేదనిపించి ఊరుకున్నాడు.

# 6

తలుపు తీయగానే ఎదురుగా నిలబడ్డ పోలీస్ కానిస్టేబుల్ని చూసి వీరభద్రం గతుక్కుమని—"ఇది సాంబశివరావుగారిల్లు—" అన్నాడు.

"తెలుసు—" అన్నాడు కానిస్టేబులు.

"ఆయన యింట్లో లేరు—" అన్నాడు వీరభద్రం.

"ఉండరని తెలుసండి—" అన్నాడు కానిస్టేబులు.

వీరభద్రం ఆశ్చర్యంగా "అయితే ఎందుకొచ్చినట్లు? ఎవరితో పని?" అన్నాడు.

"మీరెవరో తెలుసుకోవచ్చా?" అన్నాడు కానిస్టేబులు.

"నేను సాంబశివరావుగారి అబ్బాయిని—"

వెంటనే కానిస్టేబులు ముఖం దీనంగా మారిపోయింది— "మీకీ వార్త ఎలా అందజేయాలో తెలియడంలేదు—" అన్నాడు.

"ఏ వార్త?"

"మీ నాన్నగారు హత్యచెయ్యబడ్డారన్న వార్త!"

"ఏమన్నావ్?" అన్నాడు వీరభద్రం ఉలిక్కిపడి.

"మీ నాన్నగారు హత్య చేయబడ్డారు—" అన్నాడు కానిస్టేబులు.

"అమ్మా!" అంటూ గావుకేక పెట్టాడు వీరభద్రం. ఆ కేకకు యింట్లోంచి వీరభద్రం తల్లి, చెల్లెలుకూడా పరుగెత్తుకు వచ్చారు.

"ఏం జరిగిందిరా?" అంది వీరభద్రం తల్లి.

"నువ్వే చెప్పు—" అన్నాడు వీరభద్రం కానిస్టేబులుతో.

"మీ కీ వార్త యెలా అందజేయాలో తెలియడం లేదు—..." అన్నాడు కానిస్టేబులు మళ్ళీ మొదటికి వస్తూ.

వీరభద్రం విసుగ్గా—"ఇతను చాద స్తుడు. నాన్నగారు హత్య చెయ్యబడ్డారుట—" అన్నాడు. అతను మాట పూర్తిచేయగానే వీరభద్రం తల్లి పెద్ద కేకపెట్టి క్రింద కూర్చుండిపోయింది. ఆవిడ పక్కనే కూతురు కూర్చుండి పోయింది.

"ఇంట్లో ఇంకా ఎవరైనా ఉన్నారాండీ?" అన్నాడు కానిస్టేబులు.

వీరభద్రం ఈ లోకంలోకి వచ్చి—"ఇంకెవరూ లేరు కానీ ఏం జరిగిందో వివరంగా చెప్పు" అన్నాడు. అతని గొంతు రుద్ధమైపోతోంది.

"చంద్రావతి యింట్లో హత్య జరిగిందండి. ఎవరో గుండెల్లో బలంగా పొడిచి చంపారు. చంద్రావతి స్పృహ లేకుండా పడివుంది..."

"చంద్రావతి యింట్లోనా?" అంది వీరభద్రం తల్లి. మొగుడు కొట్టినందుకు కాదు కానీ తోటికోడలు నవ్వి నందుకు అన్నట్లు భర్త హత్య చంద్రావతి యింట్లో జరగడం ఆవిడకు చాలా బాధ అనిపించింది.

సాంబశివరావు లక్షాధికారి కావచ్చు కానీ ఆయన

భార్యను ఆట్టే సుఖపెట్టడంలేను. భర్త సంసారపక్షంగా ఉండాలన్న ఆమె కనీసపు కోర్కె తీరడంలేదు.

ఆయనకు తాగుడు, వ్యభిచారం_రెండూ బాగా యెక్కువగా ఉన్నాయి. తన అలవాట్లను ఆయన ఏదో ఒక స్థలానికి పరిమితం చేసుకోకుండా__యింట్లో పిల్లల యెదుట కూడా మానుకునేవాడు కాదు. తాగి యింటికి వచ్చిన తండ్రిని చూసి యెదిగిన పిల్లలు ఏమనుకుంటారో నని ఆవిడ భయం. తాగుడు మైకంలో ఆయన యెన్నో పర్యాయాలు పిల్లలు వింటున్నారన్న ధ్యాసయినా లేకుండా తనకూ చంద్రావతికీ మధ్య జరిగిన శృంగార సన్నివేశాలు కొన్ని వర్ణించి చెబుతాడు.

ఈ విధంగా జరగడం యిష్టంలేక లక్ష్మమ్మ పిల్లల్ని చాలా అదుపులో వుంచింది. పిల్లలకు తండ్రిదగ్గర చేరిక తక్కువవుండేలా చేసింది. తండ్రికి వాళ్ళు దరిదాపుల్లో వుండకుండా జాగ్రత్తపడేది. అందువల్ల పిల్లలకు తండ్రి అంటే భయమూ, జుగుప్సాభావమూ రెండూవున్నాయి. కాలక్రమేణా వారికి తండ్రి అంటే అసహ్యమూ తల్లి అంటే భక్తి, ప్రేమ_పెరిగాయి. లక్ష్మమ్మ కృషి ఫలించి పిల్లల ప్రవర్తన, అభిరుచులపై సాంబశివరావు ప్రభావం పడలేదు.

సాంబశివరావుకు బలహీనతలైతే వుండవచ్చుగానీ అందువల్ల భార్యాబిడ్డలకు ఆర్థికపరమైన అన్యాయం జరగడంలేదు. సంసారం చూడ్డానికి పచ్చగానే వుంది. ఆయనకున్న డబ్బు కారణంగానూ, ఆయన సంసారం పచ్చగానే కొనసాగుతున్నట్లు కనిపించడంవల్లనూ లక్ష్మమ్మ నలుగురిలోనూ బాగానే తలెత్తుకు తిరగ్గలుగు తోంది. చంద్రావతితో ఆయనకున్న పరిచయం జగ మెరిగిన రహస్యమే. అయినా ఆవిడ ఎదురుగా ఎవ్వరూ

ఆ ప్రసక్తి తీసుకువచ్చేవారు కాదు. కాబట్టి అది రహస్యమే అని ఆవిడ తృప్తిపడుతూ వచ్చింది.

భర్త చనిపోయాడనగానే ఆవిడకు భరించలేని దుఃఖం కలిగింది. అయితే భర్త చంద్రావతి ఇంట్లో పోయాడనగానే ఆ దుఃఖం తీరు తెన్నులు మారాయి.

## 7

"మా నాన్నగారికి శత్రువులుండే అవకాశం లేక పోలేదు. ఆయన వ్యాపారం జోరుగా సాగుతోంది. డబ్బు పుష్కలంగా వుంది. ఆయనకు దురలవాట్లున్నాయి. తాగుడు, వ్యభిచారం ఈ రెంటికీ ఆయన బానిస. అటు వంటివారికి శత్రువులుండి వుండవచ్చు. కానీ నా ఎరికలో మాత్రం ఎవ్వరూ లేరు" అన్నాడు వీరభద్రం.

ఇన్‌స్పెక్టర్ రాజ్‌కుమార్ అతడు చెప్పింది శ్రద్ధగా విని "మీరు చాలా ఫ్రాంక్‌గా మాట్లాడుతున్నారు. నాకు నచ్చారు. బాగా ఆలోచించి గుర్తుచేసుకోవడానికి ప్రయత్నించండి. ఎప్పుడైనా మీ ఇంటికి ఎవరైనా వచ్చి అనుమానాస్పదంగా ప్రవర్తించడం జరిగిందా? ఎవరి గురించైనా మీ నాన్నగారు ఆందోళన వ్యక్తపరచడం జరిగిందా? సరదాకైనా ఎవరైనా బెదిరించారా?" అనడిగాడు.

వీరభద్రం కాసేపు ఆలోచించాడు "ఏమీ గుర్తుకు రావడంలేదండీ" అన్నాడు.

"ఒకో పర్యాయం మనం బాగా చిన్నదిగా భావించే విషయంకూడా ఎంతో ముఖ్యమైనదై జటిలసమస్యలను పరిష్కరించడానికి పనికివస్తుంది. అందుకే బాగా ఆలోచించమంటున్నాను. మీరుగానీ, మీ చెల్లెలుగానీ బాగా ఆలోచించి నాకు చిన్న క్లూ ఇస్తేకానీ యీ కేసు ముందుకు నడవదు" అన్నాడు రాజకుమార్.

ఆ మాట నిజమే! ఈ హత్యకేసును పరిష్కరించ డానికి ఇన్‌స్పెక్టర్ పూర్తిగా సాంబశివరావు కుటుంబం మీద ఆధారపడ్డాడు.

ఎప్పటిలాగే సాంబశివరావు చంద్రావతి యింటికి వెళ్ళాడు. ఆయన వెళ్ళినప్పుడు చంద్రావతి ఇంట్లో ఆమె ఒక్కతేవుంది. రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతంలో చంద్రావతికి ఆపుకోలేనంత నిద్ర వచ్చేసింది. ఆ నిద్ర ఇరవైనాలుగు గంటలసేపు వుంది. చంద్రావతి ఇంటికి వచ్చిన పనిమనిషి తలుపులు బాదిబాది ఇరుగు పొరుగులను పిలిచి అల్లరిచేసి బలవంతంగా తలుపులు తెరిపించి లోపలకు వెళ్ళడంతో హత్యవిషయం బయటపడింది. పోలీసులు రంగంలోకి వచ్చారు.

హత్యకు ఉపయోగించినది ఒకేఒక కత్తి. బలంగా గుండెల్లో పొడవడంవల్ల సాంబశివరావు ప్రాణంపోయింది. హత్య రాత్రి తొమ్మిదిన్నర ప్రాంతాల జరిగింది. హతుడి జేబులో పాకెట్ రేడియో వుంది. దానిమీద హతుడివే కాక ఇంకెవరివో వేలిముద్రలున్నాయి. అవి సాంబశివ రావుకు తెలిసినవారివి కానీ, ఆయన కుటుంబసభ్యులవి కానీ కావు. హత్యాయుధంపై ఏవిధమైన ఆధారాలూ దొరకలేదు.

విచిత్రమేమంటే చంద్రావతిపై ప్రయోగించబడ్డ మత్తు పదార్థం సాంబశివరావుపై ప్రయోగించబడలేదు. పోలీసుల అనుమానం చంద్రావతిపై వుంది. కానీ చంద్రావతి సాంబ శివరావును ఎందుకు చంపుతుంది?

వృత్తినిబట్టి చంద్రావతి శరీరాన్ని బాగా నాజూకుగా వుంచుకుంటుంది. అందుకు అవసరమైన అన్ని జాగ్రత్తలూ తీసుకుంటుంది. ఆ కారణంగా ఆమె చాలా బలహీనంగా వుంటుంది. చేతిలో ఆయుధం వున్నప్పటికీ సాంబశివరావు

లాంటి భారీమనిషిని ఎంతోకొంత పెనుగులాట వేసుకుండా చంపడం సాధ్యంకాదు. సాంబశివరావు గుండెల్లో కత్తి దిగబడ్డ పద్ధతినిబట్టి అది చంద్రావతి పని అయ్యుండదని పోలీసులు నిర్ణయించారు.

అయితే సాంబశివరావు హత్యాసమయానికి ఆమె స్పృహలో ఉందో, లేదో పోలీసులు నిర్ణయించలేక పోతున్నారు. హత్య జరగడం ఆమె చూసిందనీ పోలీసుల బారినుండి తప్పించుకోవడంకోసం మత్తుమందు మింగిందనీ ఒకవర్గం అంటూంటే, తన మనిషిని నియోగించి యీ హత్యచేయించి ఎలిబీకోసం మత్తుమందు మింగిందని ఇంకో వర్గం అంటున్నారు.

"నా యింట్లో హత్యజరగడం నా ప్రకృతికి మంచిది కాదు. శవం పక్కన వుంటే ఏ మత్తుమందూ అక్కర్లే కుండానే మూర్ఛపోయేటంత భయస్థురాలిని నేను. ఆ సమయంలో బుర్రకు పని చెప్పే మనస్థిమితం కూడా నాకు వుండదు. అదలాగుంచితే సాంబశివరావువల్ల నాకు బాగా లాభిస్తోంది. ఆయన చావును కలలో కూడా కోరుకోను" అందిట చంద్రావతి.

ఆమె జవాబుల్లో సబబు కనిపించినా రాజకుమార్‌కు కొన్ని అనుమానాలున్నాయి. ఎవరైనా బాగా డబ్బాశ చూపించి చంద్రావతి యింట్లో ఈ హత్య జరగడానికి ఏర్పాటు చేసివుండవచ్చు. ఎందుకంటే సాంబశివరావును చంపడానికి అది అనువైన చోట.

హత్య విషయంలో చంద్రావతి ఎంతోకొంత సాయ పడగలదు. కానీ ఆమె సాయపడడంలేదు. తనకేమీ తెలియదని అంటోంది. పోలీసులు శతవిధాల ప్రయత్నించారు.

చంద్రావతిది చెప్పుకోదగ్గ అందం. మగవాళ్ళను ఆకర్షించే పద్ధతులు ఆమెకు చాలా తెలుసు. శీలాన్ని అమ్ముకుని బ్రతుకుతున్న వ్యక్తి. డబున్నది. ఈ కారణాల వల్ల పోలీసులకు చంద్రావతికి ఏమీ తెలియదన్న నమ్మకం త్వరగా కలిగింది. ఇన్‌స్పెక్టర్ రాజకుమార్ ఆమెచేత ఎలాగైనా నిజాన్ని కక్కించాలనుకున్నాడు కానీ ఐ. జీ.గారు అతన్ని అలా చేయవద్దన్నాడు. అందుకు అసలు కారణం విషయంలో రాజకుమార్‌కు అనుమానాలున్నా "ఆమె అమాయకురాలన్న నమ్మకం నాకు కలిగింది. అమాయకులను హింసించడం నాకు బాధను కలిగిస్తుంది" అని ఆయన చెప్పిన కారణం రాజకుమార్ అంగీకరించక తప్పలేదు.

సాంబశివరావు వ్యాపారానికి సంబంధించిన మనుషుల్ని కలుసుకుని రకరకాలుగా ప్రశ్నించాడు రాజకుమార్. అందరూ కూడా ఆయన గుణగణాలను అమితంగా పొగిడారు.

"ఆయన చచ్చిపోలేదనుకోండి. అప్పుడు ఆయన గురించి మీ అభిప్రాయం చెప్పండి" అని రాజకుమార్ వాళ్ళను రిక్వెస్ట్ చేశాడు–చచ్చిన వాళ్ళగురించి చెడ్డగా చెప్పడం ఇష్టంలేక వాళ్ళలా అంటున్నారేమోనని భ్రమ పడి. చచ్చినా బ్రతికినా సాంబశివరావు గురించి వారందరిదీ ఒకే అభిప్రాయమని తేలిపోయింది.

"పోనీ ఎవరికైనా అభిప్రాయభేదాలు, ఎప్పుడైనా కోప్పడడంలాంటివి...?"

హిరణ్యకశిపుడు, రావణాసురుడులాంటి వాళ్ళు కూడా సాంబశివరావుతో అభిప్రాయభేదాలుండవట. ఎవరైనా తనమీద తనే కోప్పడవచ్చును కానీ సాంబశివరావుపైన కోప్పడడం అసాధ్యమట. ఆయన ఎవరిపైన

అయినా కోపం ప్రకటిస్తే దాన్ని కోపంగా గుర్తించగల వాడీ ప్రపంచంలో పుట్టలేదుట.

ఇలాంటి కేసు రాజకుమార్‌కు ఎక్కడా తగలలేదు. ఎలాగో అలా దీన్ని పరిష్కరించాలి. అందుకు అతను సాంబశివరావు కుటుంబసభ్యులపైన ఆధారపడ్డాడు. వీరభద్రం మాట్లాడే పద్ధతి అతన్ని ఆకర్షించింది. కన్నతండ్రి అయినప్పటికీ సాంబశివరావు గురించి అతను మాట్లాడిన విధంగా ఇతర పరిచయస్థులు కూడా చెప్ప లేకపోయారు.

అయితే ఫ్రాంక్‌గా మాట్లాడడం ఒక్కటే చాలదు రాజ్‌కుమార్‌కు. ఏదైనా చిన్న క్లూ దొరకాలి. అదే ఇంకా దొరకలేదు.

# 8

వీరభద్రం యింకా యేదో ఆలోచిస్తుండగానే అక్కడికి ఒక పోలీసు కానిస్టేబులు వచ్చి రాజ్‌కుమార్‌కు సెల్యూట్ చేశాడు.

"ఏమిటి విశేషం?" అన్నాడు రాజ్‌కుమార్.

కానిస్టేబుల్ రాజకుమార్‌కు ఓ కవరు అందించి—"ఎస్సైగారు మీకిది అర్జంటుగా అందజేయమన్నారండి" అన్నాడు.

రాజ్‌కుమార్ కవరులోంచి ఒక ఉత్తరాన్ని బయటకు తీశాడు. ఆ ఉత్తరం చదువుతూంటే అతని కళ్ళు మెరిశాయి. ఉత్తరం చదవగానే—"ఎంత అదృష్టం!" అన్నాడు.

"ఏమయిందండీ?" అన్నాడు వీరభద్రం.

"హంతకుడు, క్లూ—ఈ రెండింటిలో కనీసం ఒకటి దొరికినట్లుంది—" అన్నాడు రాజకుమార్.

వీరభద్రం కూడా ఆ ఉత్తరం చదివాడు. అది సాంబ

శివరావు దస్తూరీ. ఆయనకు తను హత్య చేయబడతానన్న అనుమానం ఉంది. ఒక వ్యక్తి ఆయన్ను హత్యచేస్తానని బెదిరిస్తున్నాడు. పోలీసులకు ఫిర్యాదుచేసి రక్షణకోరే అవకాశం లేదుకానీ ఆ హంతకుణ్ణి పట్టివ్వడానికి ఆయన అతగాడి ఫోటో, వేలిముద్రలు సేకరించి—ఈ ఉత్తరంతో కలిపి ఒక కవర్లో పెట్టి సీలుచేసి తనకు నమ్మకస్తుడైన ఒక వ్యక్తికిచ్చి—తను కనుక హత్య చేయబడితే ఆ కవరు పోలీస్ స్టేషన్‌లో అందజేయవలసిందిగా కోరాడు.

ఉత్తరంలోని తండ్రి దస్తూరీ చూస్తుంటే వీరభద్రం కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "మా నాన్నగారంటే నాకెప్పుడూ యిష్టంలేదు. ఆయన మా అమ్మను సుఖపెట్టడం మాట అటుంచి కష్టపెట్టడంతో నాకు ఆయనంటే కోపం కూడా. కానీ ఆయన యికలేరనీ ఘోరంగా హత్యగావింపబడ్డారనీ తెలిసి నాకు చాలా బాధగా ఉంది. ప్రవర్తన యెలా ఉన్నా ఆయనకు మేమంటే యెంతో యిష్టం. యెటువంటివాడైనా తండ్రి లేకపోవడం పెద్ద లోటే. ఆ లోటు ఈ జన్మకు తీరదు_"

రాజ్‌కుమార్ అతనివంక జాలిగా చూసి—"ఒక పోలీసు ఇన్‌స్పెక్టర్‌వద్ద మీరిలా మాట్లాడకూడదు. మీ మాటలు రికార్డులోకి వెడితే మిమ్మల్ని కూడా అనుమానించవలసి ఉంటుంది. ఆ సంగతి అలా ఉంచి యిప్పుడు మీరు చెప్పండి_మీ నాన్నగారు తన నెవరో హత్య చేస్తానని బెదిరిస్తున్నట్లు మీ కెప్పుడూ చెప్పలేదా...—?" అన్నాడు.

"లేదు" అన్నాడు వీరభద్రం.

"మీ అమ్మగారికి_"

"లేదు_"

"ఎలా చెప్పగలరు?"

"మా అమ్మ అన్నీ మాకు చెబుతుంది..."

"పోనీ ఒకసారి కనుక్కొని చూడండి..."

"చూస్తాను. కానీ ఈ ఉత్తరంలో ఆయన హంతకుడి ఫోటో, వేలిముద్రలు పంపిస్తున్నట్లు రాశారు. ఆ ఫోటో, చూస్తే ఆ మనిషి గురించి యేమైనా చెప్పగలనేమో..."

"ఫోటో, వేలిముద్రలు—ఎస్పైగారిదగ్గర ఉన్నాయండి. ఐడెంటిఫికేషన్‌కు ఆయన అక్కడ ఏర్పాట్లు చేస్తున్నారండి." అన్నాడు కానిస్టేబుల్.

వీరభద్రానికి ఆ ఫోటో చూడాలని చాలా ఆత్రుతగా వుంది. తండ్రిని హత్యచేస్తానని బెదిరించిన ఆ వ్యక్తి యెవరు? యెందుకలా బెదిరించాడు? అతనే నిజంగా హత్య చేశాడా? ఈ విషయాలన్నీ తండ్రి తనకూ తల్లికీ చెప్పకుండా యెందుకు దాచాడు? ఆఖరికి తన ప్రాణాలు ప్రమాదంలో ఉంటే పోలీసులకైనా యెందుకు చెప్పలేదు?

వీరభద్రాన్ని చాలా ప్రశ్నలు వేధిస్తున్నాయి.

"ఆల్‌రైట్. నేను మళ్ళీ వస్తాను. ప్రస్తుతానికి అక్కడ మావాళ్ళు ఏం తెలుసుకున్నారో తెలుసుకోవాలి. అవసరాన్ని బట్టి మిమ్మల్ని కాంటాక్ట్ చేస్తాను-" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"సార్. నేనూ మీతో వస్తాను. ఆ ఫోటోను గుర్తుపట్టడానికి పనికివస్తాను..." అన్నాడు వీరభద్రం.

"అలాగే" అన్నాడు రాజ్‌కుమార్. "ఈలోగా ఈ ఉత్తరం ఒకసారి మీ అమ్మగారికి చూపించి ఆవిడ ఏమైనా చెప్పగలరేమో చూడండి."

వీరభద్రం ఉత్తరం తీసుకెళ్ళి తల్లికి చూపించాడు.

ఆవిడ అది చదివి భోరున ఏడ్చింది. ఉత్తరం కన్నీళ్ళతో తడిసిపోతుండగా వీరభద్రం కాపాడాడు.

"హత్య చేస్తానని నాన్నగారిని బెదిరించే వ్యక్తి ఎవ్వరయ్యుంటారు" అన్నాడు వీరభద్రం.

"ఆయన తాగితే తాగారు. ఆడవాళ్ళకోసం డబ్బు తగలేస్తే తగలేశారు. కానీ ఒకరితో గొడవపెట్టుకునే మనిషి కాదు. ఆయన్ను హత్య చేయాలనుకునే మనిషి గురించి యెలా ఊహించి చెప్పాలి?" అంది లక్ష్మమ్మ.

వీరభద్రం ఆ ఉత్తరం తీసుకొని రాజ్ కుమార్ వద్దకు వెళ్ళి తల్లి చెప్పినమాటలు అతనికి చెప్పాడు. ఇన్ స్పెక్టర్ నిట్టూర్చి బయటికి నడిచాడు.

# 9

"కేసులో మనం కాస్త ముందుకు వెళ్ళినట్లే తోస్తోంది. హంతుడి జేబులోని రేడియోమీద వేలిముద్రలతో— సాంబశివరావు పోస్టు చేయించిన కవర్ లోని వేలిముద్రలు టాలీ అయ్యాయి—" అన్నాడు ఎస్సై గోవిందం.

రాజ్ కుమార్ కళ్ళు మెరిశాయి — "ఫోటో యేదీ...?"

"పది నిమిషాల్లో వస్తుంది. పాత నేరస్తులలో అయిడెంటిఫై చేయడానికి పంపించాను—..." అన్నాడు గోవిందం.

ఫోటో వచ్చేవరకూ వీరభద్రం అక్కడ అసహనంగా కూర్చున్నాడు. ఫోటో రాగానే ఆత్రుతగా లేచి పోయాడు.

"ఇతను పాత నేరస్థుడు కాడు..." అన్నాడు ఫోటో తీసుకువచ్చిన మనిషి.

వీరభద్రం ఫోటో చూసి ఆశ్చర్యంగా—"అరే—ఇతనా?" అన్నాడు.

రాజ్‌కుమార్ కళ్ళు పెద్దవయ్యాయి—"ఇతను నీకు తెలుసా?"

"ఇతనెవరో తెలియదు. పేరు కూడా తెలియదు. ఎక్కడుంటాడో తెలియదు. కానీ మనిషి మాత్రం తెలుసును..." అన్నాడు వీరభద్రం.

"ఎలా తెలుసు?"

"ఒకరోజు సాయంత్రం మూడుగంటల ప్రాంతంలో మా యింటికి వచ్చి రాత్రి పదకొండుగంటలు దాటే వరకూ యింట్లో ఉన్నాడు. నాన్నగారితో అర్జంటుగా యేదో చెప్పాలన్నాడు. అదేమిటంటే రహస్యం అన్నాడు. ఆయనకోసం యెంతసేపైనా ఎదురుచూస్తానన్నాడు. కానీ రాత్రి పదకొండు గంటలు దాటేక మళ్ళీ వస్తానని వెళ్ళిపోయాడు. అతనితో నేను చాలాసేపు మాట్లాడేను కానీ అతని గురించి ఏ విధమైన వివరాలు తెలుసుకోలేకపోయాను."

"ఇతని గురించి ఇంకేమీ చెప్పలేరా?"

"చెప్పలేను."

"పోనీ యితను మిమ్మల్నెప్పుడు కలుసుకున్నాడో చెప్పగలరా?"

వీరభద్రం క్షణం ఆలోచించాడు. హఠాత్తుగా అతని కళ్ళు మెరిశాయి—"అతను మా యింటికి వచ్చిన రోజు రాత్రే మా నాన్నగారి హత్య జరిగింది" అన్నాడు అరిచినట్లు.

"వాట్!" అన్నాడు రాజ్‌కుమార్—"ఈ విషయం ముందే ఎందుకు చెప్పలేదు?"

"ఈ హత్యకీ దానికీ సంబంధముంటుందని ముందు నాకు తోచలేదు. అతను హంతకుడయుంటాడని ప్రవర్తననుబట్టి తోచలేదు. మనిషి మంచివాడు, తెలివైనవాడులా

కనిపించాడు నాకు. మా నాన్నగారికి స్నేహపాత్రుడే కానీ శత్రువని అనిపించ లేదు!—..." అన్నాడు వీరభద్రం.

"అసలేం జరిగిందో వివరంగా చెప్పండి" అన్నాడు రాజ్ కుమార్.

వీరభద్రం అంతా జాగ్రత్తగా గుర్తుచేసుకొని ఇన్‌స్పెక్టర్‌కు చెప్పాడు. అయితే అతను చెప్పిన కొన్ని మాటలు—తండ్రి ఒకప్పుడు పేదవాడుగా ఉండి భాగ్యవంతుడు కావడంలాంటివి మాత్రం వీరభద్రం ఇన్‌స్పెక్టర్‌కు చెప్పలేదు.

వీరభద్రం చెప్పిన వివరాలు విని—"అయితే ఆ మనిషి హంతకుడు కాడు..." అంటూ నిట్టూర్చాడు రాజ్ కుమార్.

"ఎందువల్ల?"

"హత్య రాత్రి తొమ్మిదిన్నరకూ, పది గంటలకూ మధ్య జరిగింది. అతను మీ యింట్లో రాత్రి పదకొండు గంటలు దాటేవరకూ ఉన్నాడంటున్నారు. ఈమధ్యలో ఒక్క క్షణం కూడా అతను బయటకు వెళ్ళ లేదా—?" అనడిగాడు రాజ్ కుమార్.

"లేదు. ఒక్క క్షణం కూడా బయటకు వెళ్ళ లేదు..."

"బాగా గుర్తు చేసుకోండి..." అన్నాడు రాజ్ కుమార్.

"నిజం చెప్పాలంటే తొమ్మిదినుంచి పదిదాకా కడుపు నొప్పితో బాధపడుతున్నాడు. నేనే వెళ్ళి డాక్టర్ని తీసుకువచ్చాను" అన్నాడు వీరభద్రం.

రాజ్ కుమార్ కళ్ళు మెరిశాయి. "డాక్టర్ని మీరే

తీసుకువచ్చారా? అయితే తొమ్మిదికీ పదికీ మధ్య ఇంట్లో లేరన్న మాట. ఆ సమయంలో అతను బయటకు వెళ్ళి వచ్చేశాడేమో?"

వీరభద్రం నవ్వి—"ఇంపాజిబుల్....—" అన్నాడు. "నేను స్కూటర్ మీద వెళ్ళాను. వెళ్ళడానికీ, డాక్టర్ని తీసుకురావడానికీ మొత్తం టైము పదిహేను నిముషాల కంటె పట్టలేదు. తొమ్మిదయ్యేసరికల్లా నేను డాక్టర్ని తీసుకుని వచ్చేశాను. అంతవరకూ అక్కడ మా అమ్మ ఉంది. డాక్టరు సుమారు గంటసేపు మా యింట్లో ఉన్నాడు."

"అయితే దొరికినట్లే దొరికి హంతకుడు మళ్ళీ చేయి జారిపోయాడు" అంటూ భారంగా నిట్టూర్చాడు రాజ్ కుమార్.

"ఒకవేళ హత్య పదకొండు దాటేక జరిగిందేమో" అన్నాడు వీరభద్రం.

"అసాధ్యం. హత్య తొమ్మిదిన్నరకు ముందుగానీ పది తర్వాతగానీ జరగడానికి ఏమాత్రమూ అవకాశాలు లేవని డాక్టర్ చెప్పాడు" అన్నాడు రాజ్ కుమార్.

"అతను ఎవరో? మా నాన్నగారతన్ని ఎందుకు అనుమానించారో?" అన్నాడు వీరభద్రం.

"పాయింట్ సార్!" అన్నాడు గోవిందం.

"యేమిటది?...—" అన్నాడు రాజ్ కుమార్ చిరాగ్గా.

"ఈ ఫోటోలోని మనిషి హత్య చేస్తానని సాంబశివరావుగార్ని బెదిరిస్తూ ఉండి ఉంటాడు. అయితే ఆ విషయం సాంబశివరావుగారు గ్రహించి ఇతగాడి వేలిముద్రలు సంపాదించి—నువ్వు నన్ను చంపావంటే నేను చచ్చిన తక్షణం నీ వివరాలు పోలీసులకు అందజేసే

ఏర్పాటుచేశానని బెదిరించి ఉంటాడు. ఆ ఏర్పాటుకు భయపడిన ఈ మనిషి హత్యకు మరో మనిషిని నియోగించి—హత్యా సమయానికి తనకు దుర్భేద్యమైన ఎలిబీ సృష్టించుకుని ఉంటాడు" అన్నాడు గోవిందం.

"వండర్‌ఫుల్!" అంటూ గోవిందం వీపుమీద గట్టిగా చరిచాడు రాజ్‌కుమార్.

గోవిందం వెనక్కి చేయిజాచి వీపు నిమురుకోబోయాడు కానీ వీలుపడలేదు. కానిస్టేబులొకడు పరుగెత్తుకువచ్చి గోవిందానికి వీపు నిమిరిపెట్టాడు. గోవిందం సంతోషించి రాజ్‌కుమార్ తనను మెచ్చుకున్న విధంగానే కానిస్టేబుల్ని మెచ్చుకున్నాడు. కానిస్టేబులు చేతులు వెనక్కి జాపి వీపు నిమురుకున్నాడు.

"సమస్య పువ్వులా విడిపోయింది. ఈ మనిషి కోరికతే హంతకుడు కోరికినట్టే! ఎలిబీకోసమే అతను మీ ఇంటికి వచ్చి ఉండడమూ, కడుపునొప్పి పేరుతో డాక్టర్ని రప్పించుకోవడమూ జరిగింది. హత్య యెన్నిగంటలకు జరుగుతుందో అతనికి ఖచ్చితంగా తెలిసివుండాలి. అందుకే పదకొండుగంటల ప్రాంతంలో అర్థాంతరంగా ఇల్లు వదలిపెట్టాడు. ది అయిడియా ఈజ్ రియల్లీ ఫంటాస్టిక్—హాట్సాఫ్ టూ ఉంగరాలజుట్టూ—" అన్నాడు రాజ్‌కుమార్.

ఇలా జరగవచ్చునని వీరభద్రానికి ముందుగా తోచలేదు కానీ గోవిందం, రాజ్‌కుమార్ వివరించాక అతనికి చాలా ఆశ్చర్యంగా ఉంది. నిజజీవితంలో ఇంత నేర్పుగా ఓర్పుగా ఆలోచించి పథకాలు వేసుకునే వాళ్ళుంటారంటే అతనికి థ్రిల్లింగ్‌గా ఉంది.

"మీరన్న ప్రకారమే జరిగుండాలి సార్—మా నాన్న

గారి హత్య యితని కారణంగానే జరిగి ఉండాలి_''
అన్నాడు వీరభద్రం.

వీడింకా ఈ ఊళ్ళోనే ఉండి ఉంటాడు. ఫోటో ఉంది, వేలిముద్రలున్నాయి. ఈ ఊళ్ళో కాదు, ముల్లోకాల్లో ఎక్కడున్నా వీణ్ణి సాధించి తీసుకువస్తాను_''
అన్నాడు రాజ్‌కుమార్ దర్పంగా.

## 10

వీరభద్రం తలుపులు తీసి ఆశ్చర్యంగా ''హాయ్, మీరా?'' అన్నాడు. అంతలోనే అతని కళ్ళలో భయం తొంగిచూసింది. తనకు యెదురుగా నిలబడిన వ్యక్తి సామాన్యుడు కాదు. నిండుప్రాణాన్ని నిలువునా తీయగల దారుణ హంతకుడు.

''ఇంక మీరు నన్ను మీరా అని పిలవక్కర్లేదు. ఇప్పుడు మీరడక్కుండానే నా పేరు చెప్పుకుంటాను. గోపీ నా పేరు'' అన్నాడతను.

''అయితే ఉంగరాలజుట్టు పేరు గోపీ అన్నమాట_'' అనుకున్నాడు వీరభద్రం. ''అయితే గోపీగారూ_మీరు కలుసుకోనేలోగానే నాన్నగారు...''అంటూ అర్థోక్తిలో ఆగిపోయాడతను.

''అన్నీ నాకు తెలుసునని మీకూ తెలుసు. నాగురించి మీకున్న అనుమానంకూడా నాకు తెలుసు. పేపర్‌లో నా ఫోటో చూసేక పోలీసులంటే కూడా నాకు అసహ్యం వేసింది. నన్ను పట్టియిచ్చినవారికి బహుమతి యిస్తారట. పట్టి యివ్వడానికి నేనేమైనా నేరస్థుణ్ణా?'' అన్నాడు గోపీ.

''ఆ విషయాలు నాకేం తెలుస్తాయండీ__ఏదో కారణం లేనిదే_పోలీసుల ఎటువంటిపని చేయరుగదా?'' అన్నాడు వీరభద్రం.

"లోపలకు వచ్చి కూర్చోవచ్చా?—" అన్నాడు గోపీ.

తడబడుతూనే—"రండి, కూర్చోండి—" అన్నాడు వీరభద్రం.

గోపీ లోపలకు వచ్చి కూర్చుని—"నేను నేరస్థుణ్ణి అనడానికి ఋజువుల్లేవు. ఆ విషయం మీకూ తెలుసు. అటువంటప్పుడు ఫోటో క్రింద అలా రాసివుండాల్సింది కాదు. ఫలానా ఫోటోలోని వ్యక్తిపైన అనుమానంగా ఉంది కాబట్టి, ఆతను యెక్కడున్నా సరే వచ్చి పోలీసులను కలుసుకోవలసింది—అని రాసివుంటే నేను ఎంతో సంతోషించేవాణ్ణి—" అన్నాడు.

"అంటే?" అన్నాడు వీరభద్రం.

నేను పోలీసులను కలుసుకొని మాట్లాడ్డానికి సిద్ధంగా వున్నాను. అయితే అంతకుముందుగా మీ యింటికి వచ్చాను. ఎందుకంటే హతుడు మీ తండ్రి. నేను సాంబశివరావుగారిని హత్య చేశానని పోలీసులతోపాటు మీరు నమ్ముతూ వుండి వుండాలి. అందుకు కారణం మీ నోటి వెంటనే వినాలని నాకు కోరిక కలిగింది."

వీరభద్రం తండ్రి పోలీసులకు అందేలా ఏర్పాటుచేసిన ఉత్తరం గురించి చెప్పాడు. అదంతా విని "ఆ ఉత్తరం గురించి మీలో ఒక్కరూ బుద్ధి వుపయోగించి ఆలోచించినట్లు లేదు. సాంబశివరావుగారిని నేను హత్య చేయాలనుకొంటే నా వివరాలన్నీ ఆయనకు అందజేసి—వాటితో ఆయన నన్ను బెదిరిస్తూంటే—అందుకొక ఎలిబీ సృష్టించుకొని హత్య చేయాల్సిన అవసరం నాకేముంది? ఒకమనిషి తన్ను చంపాలనుకుంటున్నాడని తెలిస్తే—వాణ్ణి తనను చంపనిచ్చి ఆ తర్వాత వాడి వివరాలు పోలీసులకు అందే

ఏర్పాటు చేసేటంత తెలివితక్కువ దద్దమ్మలు ఈ ప్రపంచంలో యెక్కడైనా ఉంటారా? ఎవరికైనా ప్రాణాలు ముఖ్యంగానీ ప్రాణాలు పోయేక హంతకుడు దొరకడం ముఖ్యం కాదుగదా! సాంబశివరావు ముందుగానే పోలీసులకు నా విషయమెందుకు చెప్పలేదు? అంటే ఇందులో యేదో పెద్ద తిరకాసు ఉందనేగా అర్థం!'' అన్నాడు గోపీ.

గోపీ మాట్లాడే పద్ధతి చూస్తూంటే అతను మంచివాడులా, పెద్దమనిషిలా, నిజాయితీపరుడిలా అనిపించింది వీరభద్రానికి. అతను చెప్పిన విషయం ఆలోచించదగినదే నని అతనికీ అనిపించింది.

''మీరు ఆ రోజు రాత్రి ఎలిబీకోసం కాకపోతే మరెందుకు వచ్చినట్లు?'' అని సూటిగా గోపీని అడిగాడు వీరభద్రం.

''ఎలిబీకోసం కాదని నే ననలేదే__?'' అన్నాడు గోపీ.

''అయితే...?'' అని అర్థోక్తిలో ఆగిపోయాడు వీరభద్రం. అతనికి నోటమాట రాలేదు. గోపీ మాటలకు అర్థమేమిటి?

''మీ నాన్నగారు ఆ సమయంలో హత్యకావించబడతారని నాకు తెలుసు. ఆ హత్యానేరం నామీద రుద్దడానికి ప్రయత్నిస్తారనికూడా నాకు తెలుసు, ఆ హత్య ఎక్కడ ఎప్పుడు ఎల్లా జరుగుతుందో నాకు తెలియదు. కానీ జరుగుతుందని మాత్రం తెలుసును. ఆ హత్యను ఆపడం నా చేతకాదు. నన్ను నేను రక్షించుకోవడం కోసం మీ యింటికి వచ్చాను'' అన్నాడు గోపీ.

''పోనీ మీరైనా యెందుకు పోలీసులకు చెప్పలేదు...''

"ప్రాణాలు పోగొట్టుకొనే వ్యక్తి పోలీసుల దగ్గరకు వెళ్ళలేక పోతున్నాడు. నేనుమాత్రం ఎలా వెళ్ళగలను" అన్నాడు గోపీ.

"అయితే హంతకుడు యెవరు—?" అన్నాడు వీరభద్రం.

"అది తెలుసుకోవడం నీకు మంచిది కాదు."

"ఎందువల్ల?"

"అణువు బద్దలైతే ఏం జరుగుతుందో తెలుసుకోవాలని కుతూహలం వుండడంలో తప్పులేదు. కానీ అణువు బద్దలుకొట్టేక తెలుసుకుందుకు అక్కడ ఎవ్వరూ వుండరు."

వీరభద్రం కుతూహలం పెరిగింది "మీరు చాలా నర్మగర్భంగా మాట్లాడుతున్నారు. వివరంగా చెప్పండి."

"ఆ వివరాలన్నీ నన్నడగొద్దు. నేనిప్పుడు పోలీసుల దగ్గరకు వెడుతున్నాను. వెళ్ళేముందు మీ అమ్మగారినో సారి కలుసుకుని నాకు తెలిసిన అన్ని విషయాలూ పోలీసులకు చెప్పవచ్చునో కూడదో తెలుసుకుందామని వచ్చాను" అన్నాడు గోపీ.

వీరభద్రం ముఖం ఎర్రబడింది "మీరు మాట్లాడే పద్ధతి చూస్తూంటే మమ్మల్ని బెదిరించాలని అనుకుంటున్నారనిపిస్తోంది."

"మీరెలా అనుకున్నా సరే ముందు మీ అమ్మగారిని పిలవండి" అన్నాడు గోపీ.

వీరభద్రం తల్లిని పిల్చుకువచ్చాడు. లక్ష్మమ్మను చూస్తూనే "మిమ్మల్నిలా చూడాల్సి వస్తుందని అనుకోలేదు" అన్నాడు గోపీ.

"దుర్మార్గుడా—అంతా నీ వల్లనే జరిగింది" అంది లక్ష్మమ్మ.

"జరిగిందో లేదో మీకు తెలియదు. కానీ పోలీసులు నన్ననుమానించి నా ఫోటో పేపర్లో వేశారు. నేనే స్వయంగా పోలీసుల్ని కలుసుకునేందుకు వెడుతున్నాను. నేను నిరపరాధినని పోలీసులముందు ఋజువుచేసుకో గలను. ఆ సందర్భంలో సాంబశివరావుగారికి సంబంధించిన అన్ని నిజాలూ పోలీసులకు చెప్పాలా వద్దా అని ఆలోచించి ఎటూ తెగక మీ సలహాకోసం వచ్చాను."

"నిజాలంటే—ఏ నిజాలు?" అంది లక్ష్మమ్మ కంగారుగా.

"మీ రడక్కుండానే చెబుదును. కానీ ఇక్కడ మీ అబ్బాయి ఉన్నాడని తటపటాయిస్తున్నాను" అన్నాడు గోపి.

"ఫరవాలేదు. వాడికీ నాకూ మధ్యకూడా రహస్యా లుండేటంత దౌర్భాగ్యపు స్థితికి మా పరిస్థితి యింకా దిగజారిపోలేదు" అంది లక్ష్మమ్మ.

"అమ్మమ్మ అలా అనేయకండి. నన్ను నిరపరాధిగా నిరూపించుకోవడంకోసం ఫోటోల గురించి చెప్పక తప్పదు. ఆ విషయాలన్నీ మీ అబ్బాయి ఎదురుగానే చర్చించడానికి మీకు అభ్యంతరం లేకపోతే నాకూ లేదు" అన్నాడు గోపి.

లక్ష్మమ్మ ముఖంలో కంగారు కనపడింది "ఏం కావాలి నీకు?"

"అన్నీ చెబుతాను. కానీ..."

"ఏమిటమ్మా ఇదంతా?" అన్నాడు వీరభద్రం అసహనంగా.

"బాబూ-నువ్వు కాసేపు బయటకు వెళ్ళు" అంది లక్ష్మమ్మ.

"ఎందుకమ్మా నేనూ పక్కనుంటాను" అన్నాడు వీరభద్రం.

"నా మాట విను. కాసేపు బయటకు వెళ్ళు" అంది లక్ష్మమ్మ

"నేను బయటకు వెడితే నీకేమైనా ప్రమాదం...?"

"నేను నీ క్షేమం, నా క్షేమం, మన క్షేమం కోరి చెబుతున్నాను. కాసేపు హాల్లోంచి వెళ్ళిపో" అంది లక్ష్మమ్మ. వీరభద్రం తల్లి ఆజ్ఞ పాటించాడు.

# 11

హాల్లో నాలుగువైపులా తలుపులు మూసివచ్చింది లక్ష్మమ్మ. మధ్యసోఫాలో కూర్చున్నాడు గోపీ. లక్ష్మమ్మ అతనికి ఎదురుగావున్న సోఫాలో కూర్చుంది.

"నీ కొడుకు ఎదురుగా నిన్ను గౌరవించాను కానీ నువ్వంటే నాకు అసహ్యం" అన్నాడు గోపీ.

గోపీ ధోరణి మారినందుకు లక్ష్మమ్మ ఆశ్చర్యపోయి "ఏమిటి నీ ఉద్దేశ్యం?" అంది.

"అంతా నీకు అర్థమయ్యే వుంటుంది. నీ గురించి నాకు అంతా తెలుసు."

"ఏం తెలుసు నీకు?" అంది లక్ష్మమ్మ.

"నిన్ను పెళ్ళాడినప్పుడు సాంబశివరావుకు దురలవాట్లు లేవు. నిన్ను పెళ్ళాడి ఇద్దరుపిల్లల్ని కన్న కొంతకాలానికి ఆయన ప్రవర్తన మారింది. తాగుడు మొదలుపెట్టాడు. చంద్రావతి నుంచుకున్నాడు.ఆ తర్వాత నీకు పిల్లలు కూడా పుట్టలేదు."

లక్ష్మమ్మ భయంగా గోపీవంక చూసి "ఇంకా ఏం తెలుసు?" అంది.

"చంద్రశేఖరం గురించి కూడా తెలుసు."

లక్ష్మమ్మ ముఖంలో కంగారు కనబడింది. "ఇవన్నీ నాకు ఎందుకు చెబుతున్నట్లు?"

"ఏమీ లేదు. సాంబశివరావును చంపిన మనిషి నేనేనని పోలీసులు అనుకుంటున్నారు. అయితే హంతకుడెవరో నాకు తెలుసు. నన్ను నేను రక్షించుకునేందుకు పోలీసులకు హంతకుడి పేరు చెప్పాలిగదా—పేరు చెప్పి ఊరుకుంటే చాలదు కాబట్టి మరికొన్ని వివరాలు చెప్పాలి. ఆ వివరాల్లో నువ్వున్నావు. నీ గురించి ఏం చెప్పాలో, ఏం చెప్పకూడదో తెలియదు. నిన్ను సంప్రదించి పోలీసుల దగ్గరకు వెడదామని నీ దగ్గరకు వచ్చాను. నాకు నీ గురించి ఏం తెలుసో నీకు తెలిసినట్లు లేదు. అందుకే ఇవన్నీ నీకు చెప్పాల్సి వచ్చింది" అన్నాడు గోపీ.

"సరే—ఇంతకీ ఆయన్ని చంపినదెవరు?" అంది లక్ష్మమ్మ తమాయించుకుని.

"ఆయన అంటే?"

"సాంబశివరావు... నా భర్త!" అంది లక్ష్మమ్మ.

గోపీ నవ్వి "హంతకుడు నీ భర్తే!" అన్నాడు.

లక్ష్మమ్మ వులిక్కిపడి "అర్థంలేని మాట—నా భర్తను నా భర్తే చంపడమేమిటి?" అంది.

"ఆలోచించి చూడు—నీకే అర్థమవుతుంది?"

లక్ష్మమ్మ ఒక్క నిముషం ఆలోచించి "ఆయన ఆత్మహత్య చేసుకున్నారా?" అంది.

"నారాయణ గుర్తున్నాడా నీకు?" అన్నాడు గోపీ.

లక్ష్మమ్మ వులిక్కిపడి "ఏ నారాయణ?" అంది.

"ఎంతమంది నారాయణలు తెలుసు నీకు?" అన్నాడు గోపీ.

"ఎవ్వరూ తెలియదు..."

"నారాయణ అనే పేరుగల వ్యక్తి నీకు భర్త అయుండే అవకాశముందేమో ఆలోచించి గుర్తు తెచ్చుకునేందుకు ప్రయత్నించు" అన్నాడు గోపీ.

లక్ష్మమ్మ ఉలిక్కిపడి భయంగా గోపీవంక చూసి "ఏమన్నావ్?" అంది.

"నీ గురించి నాకు చాలా విషయాలు తెలుసు" అనినవ్వాడు గోపీ.

లక్ష్మమ్మ గోపీవంక బెదురుచూపులు చూసి "నా భర్తను నారాయణ చంపేడంటావ్" అంది.

"అయితే నారాయణ నీ భర్త అని ఒప్పుకున్నావ్!" అన్నాడు గోపీ.

లక్ష్మమ్మ మౌనంగా తల దించుకుంది.

"నారాయణ నీ భర్తను చంపాడు" అన్నాడు గోపీ.

"ఎందుకు?"

"ఆలోచించి చూడు. గుర్తుకు వస్తుందేమో?" అన్నాడు గోపీ.

లక్ష్మమ్మ ఏమీ మాట్లాడలేదు. ఆమె నిజంగానే ఆలోచిస్తోంది.

* * *

లక్ష్మమ్మ అసాధారణ సౌందర్యవతి కాదు కానీ ఆమె ముఖం కళగానే వుంటుంది. అయితే వయసు ఆమెకు అందించిన అవయవాల పొందిక పురుషలోకానికి వెర్రెత్తించేలా వుండేది.

పన్నెండేళ్ళ వయసప్పుడే అంతా ఆమెకు పద్దెనిమిదేళ్ళు అనుకునేవారు. ఆమెను ఒంటరిగా చూసిన ప్రతివాడూ మరోసారి చూడకుండా వుండలేకపోయేవాడు. బంధువుల్లోగానీ, ఇతరుల్లోగానీ ఆమెతో అరక్షణం ఏకాంతం సంపాదించగల ప్రతిమగవాడూ సభ్యతను

వదిలి మాట్లాడానికి తెగించేవాడు. అటువంటి మాటలు వినటానికి సిగ్గు అనిపించినా లక్ష్మమ్మకు అసహ్యం అనిపించేదికాదు. కాస్త సరదాగా కూడా వుండేది.

కామాన్ని రెచ్చగొట్టే తనరూపం అందమైనదని ఆమె భ్రమపడింది. ఆ అందానికి అలంకరణలతో మెరుగులు దిద్దేది. అలంకరణ, సినిమాలు ఆమెకు తగని పిచ్చి. తండ్రి అట్టే ఉన్నవాడు కాదు కాబట్టి అందుకు డబ్బు ఆమెకులభించేది కాదు. అప్పుడే ఆమెకు నారాయణ పరిచయం లభించింది.

ఒకరోజు బెంచీటికెట్ కొరకు తిరుగుముఖం పట్టిన లక్ష్మమ్మకు నారాయణ బాల్కనీటికెట్ ఆఫర్ చేశాడు. సినిమా చూడాలన్న కాంక్షతో లక్ష్మమ్మ నారాయణ పక్కన కూర్చుని సినిమా చూసింది.

పొరపాటు పేరుతో సారీ చెప్పుకుంటూ నారాయణ చాలా పర్యాయాలు ఆమె భుజంమీద చేతులువేశాడు. మొదట్లో మృదువుగా తొలగించినా తర్వాత లక్ష్మమ్మ ఊరుకుంది. అందుకు చాలా కారణాలున్నాయి. మాటి మాటికీ అతని చేతిని తొలగించడంవల్ల సినిమా శ్రద్ధగా చూడడం కుదరడంలేదు. మూడుగంటల ఆట తర్వాత ఎలాగూ యిద్దరూ విడిపోతారు. అతను చెయ్యి భుజం మీద వేస్తే ఒక పిసరు సిగ్గుగావున్నా శరీరానికి హాయిగా వుంది.

లక్ష్మమ్మ తన చర్యను ప్రోత్సహించినట్లే నారాయణ భావించాడు. తను తాత్కాలికంగా సహించానని లక్ష్మమ్మ అనుకుంది. కానీ ఆ నాటి వారి పరిచయం అంతటితో ఆగిపోలేదు. నారాయణ లక్ష్మమ్మకు అలంకరణ సామగ్రులు కొనిపెడుతూ, సినిమాలు చూపిస్తూ వచ్చాడు. అతని పొరపాట్లు భుజంమీద చేతులు వేయడంతో ఆగక

పోయినా లక్ష్మమ్మ సహించింది. ఆమె సహనం పెరిగిన కొద్దీ నారాయణ సహనం తగ్గిపోయింది.

ఆమెను అతను ఒకరోజు మధ్యాహ్నం సినిమా కాకుండా ఒక ఏకాంతస్థలానికి ఆహ్వానించాడు. లక్ష్మమ్మ ఆ ఆహ్వానాన్ని మన్నించి వెళ్ళింది. అక్కడ నారాయణ ఒక్క క్షణం కూడా సహనాన్ని ప్రదర్శించలేకపోయాడు. అది లక్ష్మమ్మ సహించింది. ఇద్దరూ ఒకటయారు. తర్వాత లక్ష్మమ్మ ఏడ్చింది.

"ఏడవకు నిన్ను నేను పెళ్ళిచేసుకుంటాను" అన్నాడు నారాయణ.

"సినిమాలు చూస్తున్నాగా-మగాళ్ళంతా ఇలాగే అంటారు" అంది లక్ష్మమ్మ.

"నేను అందరి మగాళ్ళలాంటివాణ్ని కాదు" అన్నాడు నారాయణ.

"ఇంతవరకూ అందరి మగాళ్ళలాగే ప్రవర్తించావు" అని ఏడ్చింది లక్ష్మమ్మ.

మర్నాడు నారాయణ తనకూ అందరి మగాళ్ళకూ తేడా చూపించాడు. లక్ష్మమ్మను గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడు. లక్ష్మమ్మ నారాయణను మెచ్చుకోలేదు.

నారాయణ యింకా కాలేజీలో చదువుకుంటున్నాడు. తండ్రి అతనికి డబ్బు పంపిస్తున్నాడు. అతని పెళ్ళి గురించీ, వచ్చేకట్నం గురించీ చాలా ఆశలు పెట్టుకున్నాడు తండ్రి. కొడుక్కి పెళ్ళి జరిగినట్లు తెలిస్తే కోపంవచ్చి ఆయన అతనితో తెగ తెంపులు చేసుకుంటాడు. దాంతో నారాయణ చదువు ఆగిపోతుంది. చదువు పూర్తయి తన కాళ్ళమీద తను నిలబడగలిగే వరకూ పెళ్ళి చేసుకోకూడదని నారాయణ మొదట్లో అనుకున్నాడు. అయితే పెళ్ళి తప్పనిసరి కాగా కనీసం ఆ

విషయాన్ని తండ్రికి తెలియకుండా రహస్యంగా వుంచాలని అతననుకున్నాడు.

అందుకే లక్ష్మమ్మకు అంత తృప్తిగాలేదు. పెళ్ళి జరిగి సంసారం చేస్తున్నా అటు తన తండ్రికీ, ఇటు భర్త తండ్రికీ కూడా ఈ విషయం తెలియదు. లక్ష్మమ్మ కూడా అతికష్టంమీద నారాయణతో తనకు పెరిగిన చనువును నలుగురికీ తెలీకుండా దాచగలిగింది.

ఒకసారి లక్ష్మమ్మ నారాయణను కలుసుకుని తిరిగి యింటికి వెడుతోంది. ఏం ఆలోచిస్తోందో కానీ పరధ్యానంగా నడుస్తూండగా ఒకకారు వేగంగా ఆమె మీదకు వచ్చింది. హారన్ మ్రోగినా ఆమె వినిపించుకో లేదు. ఆమె ప్రాణం పోవలసిందే కానీ కాస్తలో ప్రమాదం తప్పింది. ఆమెను యెవరో బలంగా పక్కకు లాగారు.

"నా పేరు సాంబశివరావు" అన్నాడతను.

"చాలా చాలా కృతజ్ఞురాలిని" అంది లక్ష్మమ్మ.

అతను ఆమెవంక గుచ్చిగుచ్చి చూస్తున్నాడు. ఆ చూపులలో ఆపదలోవున్న వారిని రక్షించిన భావంలేదు. నారాయణ తనవంక చూసే చూపుల్లానే వున్నాయి. "ప్రాణం పోయివుండేది నేను లాగకపోతే."

"నిజమే!" అని అతనింకా తనచేయి వదలకపోతుంటే తనే వదిలించుకుంది లక్ష్మమ్మ "అదృష్టం బాగుండి బ్రతికి పోయ్యాను."

"అదృష్టం మీది కాదు నాది. అనుకోకుండా మీ అంత అందాలరాశితో పరిచయం లభించింది" అన్నాడు సాంబశివరావు.

ఆ పరిచయం అక్కడితో ఆగలేదు. సాంబశివరావు తరచుగా లక్ష్మమ్మను కలుసుకుందుకు ప్రయత్నిస్తూ చిన్న

చిన్న బహుమతులు అందిస్తూండేవాడు. ఆ బహుమతులు అందుకుంటూ అతని ప్రాథమిక చిలిపితనాన్ని సహిస్తూ వచ్చింది లక్ష్మమ్మ. ఆఖరికి తనామెను ప్రేమిస్తున్నాననీ ఆమె లేనిదే బ్రతకలేననీ సాంబశివరావు చెప్పాడు. తనకు అప్పటికి వివాహమయిందన్న విషయం లక్ష్మమ్మ సాంబశివరావుకు చెప్పలేదు. అతను ఆమెతో ఏకాంతానికి ప్రయత్నిస్తే సహకరించింది. అతనామెను వశపర్చుకోబోతే లొంగిపోయింది. ఆ తర్వాత ఏడ్చేసింది.

"ఏడవకు. నిన్ను పెళ్ళాడతాను" అన్నాడు సాంబశివరావు.

"అందరు మగాళ్ళూ అలాగే అంటారు" అంది లక్ష్మమ్మ.

"నేను అందరి మగాళ్ళలాంటి వాణ్ని కాదు" అన్నాడు సాంబశివరావు.

"ఇంతవరకూ ఆ తేడా చూడలేదు..." అంది లక్ష్మమ్మ.

అయితే మర్నాటికి అతను ఆ తేడా చూపించాడు స్వయంగా. లక్ష్మమ్మయింటికి వెళ్ళి ఆమెతండ్రితో మాట్లాడేడతను. సాంబశివరావుకు ఏదో చిన్న ఉద్యోగం వుంది. సంప్రదాయమైన కుటుంబం. కట్నం అక్కర్లేదన్నాడు. లక్ష్మమ్మ తండ్రికి పెళ్ళికి అభ్యంతరం చెప్పడానికి కారణం కనబడలేదు. సంతోషంగా అంగీకరించేడాయన.

ఆ సమయంలో నారాయణకు సెలవులు. అతనికి సమాచారం అందించే అవకాశం లక్ష్మమ్మకు లభించలేదు. ఆమె పెళ్ళి మామూలుగా జరిగిపోయింది. లక్ష్మమ్మ కాపురానికి వెళ్ళిపోయింది.

నారాయణకు విషయం తెలిసి లక్ష్మమ్మను చూడ

పోయాడు. తన అనుమతితో నిమిత్తంలేకుండా వివాహం జరిగిపోయిందని లక్ష్మమ్మ ఏడ్చింది. ఆమె పరిస్థితులను సానుభూతితో అరంచేసుకున్నాడు నారాయణ. "న్యాయానికి నేనే నీ భర్తను. నాతో వచ్చేసేయ్" అన్నాడతను.

"చాటుగా తాళికట్టిన నిన్ను భర్త అనుకోవాలా, నలుగురిముందూ తాళికట్టిన సాంబశివరావును భర్త అనుకోవాలా నువ్వే చెప్పు" అంది లక్ష్మమ్మ.

"నన్ను నువ్వు ప్రేమించలేదా, నేనంటే నీ కిష్టం లేదా?" అనడిగాడు నారాయణ.

"నువ్వంటే చాలా యిష్టం నాకు. కానీ నీతో ఎలా వచ్చేది? నీ కింకా ఉద్యోగమైనా లేదు..." అంది లక్ష్మమ్మ.

"ఉద్యోగం వస్తే నాతో వచ్చేస్తావా?" అనడిగాడు నారాయణ.

"తప్పకుండా!" అంది లక్ష్మమ్మ.

నారాయణ చదువుకు స్వస్తిచెప్పి ఉద్యోగంకోసం శతవిధాల ప్రయత్నించాడు. కొద్ది నెలల్లోనే అతడికి ఓ చిన్న ఉద్యోగం దొరికింది. అతను వెళ్ళి లక్ష్మమ్మను కలుసుకున్నాడు.

"జీతం యెంత?" అంది లక్ష్మమ్మ. నారాయణ చెప్పాడు.

"నా భర్త జీతం నీ జీతంకంటె యెక్కువ" అంది లక్ష్మమ్మ.

"అయితే?"

"సాంబశివరావును వదిలి నీ దగ్గరకు రావడం ఎందుకు? ఎక్కువ సుఖాన్ని పొందడానికేగదా! విధం చెడినా ఫలం దక్కాలి" అంది లక్ష్మమ్మ.

"నువ్వు నన్ను ప్రేమించడం లేదా?" అన్నాడు నారాయణ దెబ్బతిని.

"నువ్వు నా శరీరాన్ని ప్రేమిస్తున్నావు-నీకు ఆ శరీరం సుఖం యిస్తుంది కాబట్టి. నాకు సుఖం యిచ్చేది డబ్బు. నువ్వు నన్ను భోగభాగ్యాలలో ముంచి తేల్చగలిగినప్పుడు నీతో వస్తాను" అన్నది లక్ష్మమ్మ.

తర్వాత ఒకటి రెండు నెలల్లో లక్ష్మమ్మ ప్రసవించింది. కానీ పుట్టినబిడ్డకు ప్రాణంలేదు. ఆ తర్వాత రెండు సంవత్సరాలకు నారాయణ ఆమె దగ్గరకు వచ్చాడు.

"నేనిప్పుడు లక్షాధికారిని" అన్నాడతను.

"ఎలా?" అన్నదామె.

"కేవలం నిన్ను స్వంతం చేసుకొని నీతో సంసార జీవితం శాశ్వతం చేసుకోవాలన్న కోర్కెతో నేను అవినీతి పథాన్ని పట్టాను. ఇప్పటికి మూడులక్షల క్యాషు ఉంది నాదగ్గర" అన్నాడు నారాయణ.

"చాటుమాటు బ్రతుకా. సంఘంలో పెద్దమనిషిగా చలామణీ కాగలవా?" అంది లక్ష్మమ్మ.

"నీకు తెలియదేమో—ఈ సంఘంలో పెద్దమనుషులుగా చలామణీ అవుతున్న వారంతా నాలాంటి వాళ్ళే—" అన్నాడు.

లక్ష్మమ్మ ముఖం వెలిగింది. "అయితే నీతో వచ్చేస్తాను. డబ్బు తీసుకువచ్చి చూపించు—"

నారాయణ అక్కణ్నించి వెళ్ళిపోయాక లక్ష్మమ్మ మెదడులో రకరకాల ఆలోచనలు కలిగాయి. సాంబశివరావు సామాన్యుడు. నారాయణ నేరస్థుడు. నారాయణతో జీవితం ఎప్పటికైనా తనకు ప్రమాదమే! నారాయణ యిచ్చిన డబ్బు సాంబశివరావు చేతికి అందితే

తాము సాక్షిగా జీవితం గడపవచ్చు.అందుకేదో వుపాయం ఆలోచించాలి.

రెండురోజుల తర్వాత నారాయణ ఆమెను కలుసుకుని డబ్బు చూపించాడు. లక్ష్మమ్మ డబ్బును చూసి చాలా సంతోషించింది.

"ఎలా సాధ్యం—యింత డబ్బు సంపాదించడం?" అందామె ఆశ్చర్యంగా.

"రెండు మార్గాలున్నాయి. ఒకటి ప్రమాదకరమైనది. దాని పేరు స్మగ్లింగ్. రెండవది ప్రమాదం లేనిది. దాని పేరు వ్యభిచారం. నేను మొదటిది చేస్తున్నాను..." అన్నాడు నారాయణ.

"వ్యభిచారంలో నువ్వు డబ్బెలా సంపాదించాలనుకున్నావో నాకు తెలియడంలేదు."

"చేతిలో నలుగురు అందమైన ఆడపిల్లలుంటే డబ్బున్న వాళ్ళకు సప్లయ్ చేసి లక్షలు గడించవచ్చు. ఈ వ్యాపారానికి నే నింకా ప్రయత్నించ లేదు. యెందుకంటే ఆరంభంలో చాకులాంటి పిల్ల కావాలి."

"చాకులాంటి పిల్ల అంటే?" అంది లక్ష్మమ్మ.

"నీకులాంటి పిల్ల..."

లక్ష్మమ్మ ఒక్క క్షణం తటపటాయించి "ఈ జీవితానికి సుఖాన్నిచ్చేది డబ్బు. అందుకోసం యేం చేసినా తప్పులేదు. లక్షలు సంపాదించడానికి నేను పనికివస్తానంటే నన్నుపయోగించుకో—" అంది.

నారాయణ తెల్లబోయి "నిజంగా అంటున్నావా నువ్వీ మాటలు..." అన్నాడు.

"నిజంగా నే అంటున్నాను."

"నేను నిన్ను పెళ్ళాడింది—నీతో డబ్బు సంపాదించడానికనుకున్నావా?" అన్నాడు నారాయణ.

"నేనేమీ పవిత్రురాలిని కాను. ఇప్పటికిద్దరయ్యారు. కొన్ని లక్షలు సంపాదించడానికి మరికొందరు అయినా ఫరవాలేదు. ఎటొచ్చీ విషయం రహస్యంగా ఉండాలి" అంది లక్ష్మమ్మ.

"నువ్వు నన్ను పరీక్షిస్తున్నావు–" అన్నాడు నారాయణ.

అది అబద్ధమని నారాయణకు తెలిసిపోయింది. అతని ఆశ్చర్యంలో ఒక నెలరోజుల్లో ఇరవై నాలుగు వేలు సంపాదించింది. ఈవిధమైన వ్యాపారానికి ఆమెవంటి ఆడది అరుదైన వరం అన్న పేరుకూడా వచ్చింది. ఆయిదారు నెలల్లో నే ఆమె మూడులక్షలవరకు సంపాదించింది.

అటు సౌఖ్యానికీ యిటు డబ్బుకూ ఈ పద్ధతి బాగుం దనిపించింది లక్ష్మమ్మకు. ఈవిధమైన జీవితం కొనసాగించడంకోసం ఆమె నారాయణతో వెళ్ళిపోవడానికి సిద్ధపడింది.

"నేను నీ స్మగ్లింగుకు పనికొస్తాను. నీ పద్ధతులు నాకు నచ్చాయి. మనమిద్దరం ఒకటైతే లక్షలకు లక్షలు గడిస్తూ హాయిగా గడపచ్చు" అంది లక్ష్మమ్మ.

"కానీ నేనాశించినది అటువంటి జీవితం కాదు. కేవలం నీకోసం నేను అవినీతికి పాల్పడ్డాను. ఈ డబ్బు సంపాదించేక సాఫీ జీవితం గడుపుదామనుకున్నాను. నీతో అందరికిలాగే సంసారం చేయాలనుకొన్నాను. కానీ నువ్వు ఈ దేశంలో పుట్టవలసిన మనిషివి కాదు. భగవంతుడు నీకు అద్భుతమైన శరీరసౌష్టవాన్నిచ్చి–అందుకు తగ్గ మనసునే సృష్టించాడు. నీకూ నాకూ సంసారం సరిపడదు. ఇప్పటికి నాకు బుద్ధివచ్చింది. నిన్ను పూర్తిగా అర్థం చేసుకున్నాను" అన్నాడు నారాయణ.

లక్ష్మమ్మ అప్పటికి ఏమీ మాట్లాడలేదు. తను సంపా

దించిన డబ్బుతోపాటు—నారాయణ డబ్బు కూడా ఆమె వద్దనే ఉంది.

రెండురోజుల అనంతరం లక్ష్మమ్మకు అనుకోని ప్రమాదం వచ్చింది. నారాయణ లక్ష్మమ్మను సూర్యం అనే వ్యక్తిద్వారా రహస్య వ్యభిచారంలో ప్రవేశ పెట్టాడు. ఆ సూర్యం ఆమెకు తెలియకుండా చాలా ఫోటోలు తీశాడు. ఆ ఫోటోలు రహస్యంగా వుంచడానికి అతను రెండులక్షలు అడుగుతున్నాడు.

సూర్యం నుంచి ఇటువంటి ప్రమాదం అప్పటికే పరిమితం కాదనీ ముందుముందు కూడా అతను తనను జలగలా పీడించగలడనీ లక్ష్మమ్మ గ్రహించింది. రహస్య వ్యభిచారంలో యిప్పుడామెకు సూర్యంవంటి వాళ్ళ సాయం అవసరంలేదు. కానీ యిబ్బంది వచ్చిపడింది.

లక్ష్మమ్మ తన యిబ్బందిని నారాయణకు చెప్పింది. నారాయణ ఆవేశంగా సూర్యాన్ని కలుసుకున్నాడు. మాటలు పోట్లాటలోకి మారగా నారాయణ చేతిలో సూర్యం చచ్చాడు. నారాయణ పారిపోయి లక్ష్మమ్మ యింటికి వచ్చి జరిగింది చెప్పాడు.

"ఫోటోలు ఎక్కడ?"

"వాటిభయం నీకు లేదు. వాటిని సూర్యం యెక్కడ దాచాడో నాకు తెలుసు. అవి మూడోకంట పడే ప్రమాదం లేదు" అన్నాడు నారాయణ.

"ఇప్పుడు నేనేం చేయాలి?" అంది లక్ష్మమ్మ.

"నా డబ్బు నాకిచ్చేయ్. ఇక్కణ్ణించి వెళ్ళిపోతాను" అన్నాడు నారాయణ.

లక్ష్మమ్మ మంచిమాటలతో అతన్ని ఓ గదిలోకి తీసుకి వెళ్ళి గొళ్ళెంపెట్టి పోలీసుల్ని పిల్చుకువచ్చి తోచిన కట్టు కథ చెప్పింది. లక్ష్మమ్మ ఆధారంతో సూర్యంహత్య తేలి

పోయింది. నారాయణ హంతకుడుగా నిరూపించబడ్డాడు. నారాయణ నేరాన్ని ఒప్పుకున్నాడు, తప్పితే ఇంకేమీ చెప్పలేదు. దొంగ తన యింట్లో డబ్బు వదిలిపెట్టినట్లు భర్తకు చెప్పి లక్షల ఆస్తిని అతనివశం చేసింది లక్ష్మమ్మ.

సరిగ్గా పదిహేను రోజుల తర్వాత నారాయణ జైలు నుంచి తప్పించుకున్నాడు. అతను లక్ష్మమ్మను కలుసుకుని "నా జీవితం నీ కారణంగా నాశనమైంది. నిన్ను చంపడం నాకిష్టంలేదు. ఎందుకంటే అది చాలా సామాన్యమైన శిక్ష. సూర్యం తీసిన ఫోటోలు నీ భర్తకు చూపించాను. ఏ ఆడదైనా అలా బరితెగిస్తే మగవాడికి సంతోషంగా ఉండవచ్చుగానీ ఆ ఆడది తన భార్య అయుండి-పరాయి మగవాడి మీదకు అలా బరితెగిస్తే సహించలేడు. ఆ అసహనమే నీకు సరిపడ్డ శిక్ష" అని వెళ్ళిపోయాడు.

తర్వాత అతను తనకు తానే పోలీసుల దగ్గరకు వెళ్ళి "ఒక చిన్నపని మిగిలిపోయిన కారణంగా జైలునుంచి పారిపోయాను. తప్పితే నాకు జైల్లో వుండడమే ఇష్టం" అని చెప్పి లొంగిపోయినట్లు తెలిసింది.

సాంబశివరావు ఫోటోలతోసహా భార్యవద్దకు వచ్చి "నాదనుకున్న నీ శరీరంతో ఇంత పచ్చిగా ఎంతోమంది ఆడుకున్నారని నాకు తెలియదు. అందుకే నిన్ను తప్పు పట్టలేను. లోపం నాదే అయివుండాలి. అందుకే నిన్ను ఏమీ అనను. నీ ఇష్టం వచ్చినట్లు నువ్వు జీవించు. ఈ రోజునుంచీ మనమిద్దరం స్నేహితులమే తప్పితే దంపతులం కాము" అన్నాడు.

ఆ రోజునుంచీ సాంబశివరావు తాగుడుకు అలవాటు పడ్డాడు. కొద్దినెలల్లోనే అతను చంద్రావతిని వుంచుకున్నాడు.

# 12

"తప్పు చేసింది నేను. నా భర్త కాదు. నారాయణ నా భర్తను చంపడం అన్యాయం" అంది లక్ష్మమ్మ.

"అయితే కథంతా గుర్తుకు వచ్చిందన్నమాట" అని నవ్వి "యుద్ధాల్లో రాజులు పోరు. వారి పరివారమే చస్తుంది" అన్నాడు గోపీ.

"ఇప్పుడు నేనే చేయాలి?" అంది లక్ష్మమ్మ.

"ఆ ఫోటోలు యింకా నారాయణ దగ్గర వున్నాయి" అన్నాడు గోపీ.

"నేను వాటిని ఎప్పుడో చింపేశాను" అంది లక్ష్మమ్మ.

"కానీ నారాయణ దగ్గర యింకా చాలా కాపీలున్నాయి. నెగెటివ్స్ కూడా వున్నాయి."

"ఉంటే?"

"అవి నీ కన్నకొడుకు చూస్తే?"

లక్ష్మమ్మ నిలువెల్లా వణికిపోయింది "వద్దు నువ్వేం చెబితే ఆ పని చేస్తాను"

"ఏమీ లేదు. నువ్వు నారాయణకు భార్యవు కావాలి. యిక్కడ యీ ఇంటి పెత్తనం నాకివ్వాలి" అన్నాడు గోపీ.

"అంటే?"

"జైల్లో ఉన్నంతకాలమూ నారాయణ నిన్ను తలచుకుంటూనే ఉన్నాడు. తన కారణంగానే నువ్వు పాడయ్యావనీ, నీ బిడ్డ పెడదారులు తొక్కిందనీ, నీ జీవితం నరకప్రాయమైందనీ అనుకున్నాడు. యావజ్జీవ కారాగారశిక్ష పడినప్పటికీ సత్ప్రవర్తన కారణంగా అతను కొద్దికాలం క్రితమే జైలునుంచి విడుదలయ్యాడు. విడుదలైనప్పట్నుంచీ నిన్ను తనకు అప్పగించవలసిందని సాంబశివరావును కోరాడు. ఆ పనిమాత్రం చెయ్యనన్నాడు సాంబశివరావు.

అప్పుడు నారాయణ మొట్టమొదట నిన్ను తనే వివాహం చేసుకున్నట్లూ ఒక బిడ్డను కూడా కన్నట్లూ చెప్పాడు.''

''అబద్ధం'' అంది లక్ష్మమ్మ.

''అబద్ధంకాదు. ప్రాణంలేకుండా పుట్టిందని నువ్వను కున్న బిడ్డను నేనే. హాస్పిటల్లో నర్సుకు డబ్బిచ్చి నారాయణ ఆ మార్పిడి చేయించాడు. మీ ఇద్దరి సంసా రానికి నేనే సాక్షిని. నారాయణ చెప్పిన వివరాలు విని సాంబశివరావు నన్ను చూడగోరాడు. నన్ను చూసినప్ప ట్నించీ ఆయనకు మతిపోయింది. నారాయణ లక్ష్మమ్మను కోరేమాటయితే తను ఆత్మహత్య చేసుకుని నన్ను హంత కుడిని చేయగలనని బెదిరించాడాయన. ఆయన ఆత్మహత్య చేసుకోవడం నాన్నకు ఇష్టమే! అందుకే ఆయన్ను బాగా రెచ్చగొట్టాడు. ఆయన చివరివార్నింగ్ యిచ్చాడు. ఆ రోజునే నేను మీ యింటికి వచ్చి ఎలిబీ సంపాదించాను. సాంబశివరావు ఆత్మహత్య చేసుకున్నాడు. ఆయన అలా చేసుకుంటాడని తెలిసుండీ ఊరుకున్నందుకు నాన్న హంతకుడే అవుతాడు.''

లక్ష్మమ్మ ఆశ్చర్యంగా గోపీని చూస్తూ ''అయితే నువ్వు?'' అంది.

''నీ కన్నకొడుకునని చెప్పుకునేందుకు సిగ్గుపడుతున్న వాణ్ని. వీరభద్రాన్ని కూడా అలా చేయగల సమర్థుణ్ణి.''

''ఇప్పుడేం చేస్తావ్?''

''నీకు నారాయణతో ఉండడం యిష్టమే అయిన పక్షంలో అన్ని వ్యవహారాలూ నేనే సెటిల్ చేసే స్తాను'' అన్నాడు గోపీ.

''ఎలా?''

''సాంబశివరావుది ఆత్మహత్య. ఆ నిజం చంద్రావతికి తెలుసును. అది ఆమెచేత కక్కించడం సులభమే. సాంబ

శివరావు నపుంసకుడనీ నీ సంతానం అతని అనుమతితో నారాయణ కారణంగా కలిగిందనీ_నారాయణ నిన్ను భార్యగా పొందగోరితే సాంబశివరావు అతన్ని హత్య కేసులో యిరికించి జైలుకు పంపించాడనీ_జైలునుంచి నారాయణ తిరిగివచ్చేక నీకోసం ఒత్తిడి చేయగా యేం చేయాలో తెలియక ఆత్మహత్య చేసుకున్నాడనీ పోలీసుల్ని నమ్మిస్తాను.''

''మరి చంద్రావతి విషయం...''

''తను నపుంసకుడని ప్రపంచానికి తెలియకుండా ఉండడంకోసం చంద్రావతి నాయన ఉంచుకున్నాడన్న చంద్రావతిచేత నే చెప్పించగలను.''

''ఛీ...ఛీ...కన్నబిడ్డ ముందు ఎటువంటి సంభాషణ చేయాల్సి వస్తోంది__?''అంది లక్ష్మమ్మ అప్రయత్నంగా.

''అలా బాధపడనక్కర్లేదు. విదేశాల్లో తల్లీకొడుకులు ఇలాగే మాట్లాడుతుంటారు. అందులో తప్పేమీ లేదు. నువ్వీ దేశంలో పుట్టవలసిన ఆడదానివికాదని నారాయణ అననే అన్నాడు'' అన్నాడు గోపీ.

''నారాయణ, నారాయణ అనకపోతే నాన్న అన లేవా?''

''నారాయణ అంటే పుణ్యం వస్తుంది. నాన్న అంటే పాపం వస్తుంది'' అన్నాడు గోపీ.

''ఈ దేశానికి తగని నా కడుపున మీలాంటి బిడ్డలు పుట్టడడం అదృష్టమో, దురదృష్టమో...!'' అంది లక్ష్మమ్మ.

''ఇంతకూ నీ నిర్ణయం యేమిటి?'' అన్నాడు గోపీ.

''నేనింకా విధవను కాలేదు'' అంటూ లోపలకు నడిచింది లక్ష్మమ్మ.

——:ఐపోయింది:——

# ఇత్తడి బంగళా!

## అజీజ్

"పోస్ట్!" అన్న కేక విని, చూస్తున్న పేపర్ మడిచి లేచింది షీల. ఆర్డినరీ ఉత్తరాలైతే లెటర్ బాక్స్‌లో వేసిపోతాడు పోస్ట్‌మెన్. ఏదో రిజిస్టర్డ్ పోస్టే అయ్యుంటుంది అనుకుంటూ గడియతీసి తలుపు తెరిచింది.

"రిజిస్టర్డ్ లెటర్ మేడమ్!" అంటూ ఓ గులాబీరంగు కవర్ అందించాడు పోస్ట్‌మెన్.

అక్నాలెడ్జ్‌మెంట్ కార్డుమీద సంతకంచేసి, కవర్ వెనక్కి తిప్పి, ఫ్రమ్ అడ్రెస్ చూస్తూ లోపలికి వచ్చి కూర్చుంది.

'పి. పచేలరావు,
బ్రాస్ ప్యాలెస్,
వంగత్తూర్.'

ఆ పేరుగానీ, ఆ 'ఇత్తడి బంగళా' గురించిగానీ అదివరకెప్పుడూ విన్న గుర్తులేదామెకు. మద్రాసుకు మూడు మైళ్ళ దూరంలో వుంది వంగత్తూర్. ఆ వూళ్ళోనూ తనకు

పరిచయమున్న వాళ్లెవ్వరూ లేరు. మరి యేమిటీ ఉత్తరం?...

అనుకుంటూ కవర్ చింపి, లోపల మడత పెట్టివున్న కాగితాన్ని యివతలికి లాగింది. కాగితం మడత విప్పగానే ఆశ్చర్యంతో షీల కళ్ళు పెద్దవయ్యాయి! కారణం, ఆ మడతలమధ్య ఓ వందరూపాయల పూర్తి నోటూ, సగం చింపిన వెయ్యి రూపాయలు నోటుముక్క పెట్టి ఉన్నాయి.

గబ గబ ఉత్తరాన్ని చదవడం ప్రారంభించింది.

'మిస్ షీలా!

ఈ వుత్తరం చూసి మీరు చాలా ఆశ్చర్య పోవచ్చు. కారణం, మనం, పరస్పరం అపరిచితులం! ఇంతవరకూ ఒకర్నొకరం చూసుకోలేదు. ఐనా, నేను మిమ్మల్ని నా అతిధిగా మా ఇంటికి ఆహ్వానిస్తున్నాను. నా ఆహ్వానాన్ని అంగీకరించి, వారం పదిరోజులపాటు నా యింట్లో ఆతిధ్యం స్వీకరించవలసిందిగా కోరుతున్నాను.

ఈ వింత ఆతిధ్యం యేమిటా అని ఆశ్చర్య పోవచ్చు, ముక్కూ మొహం తెలియని వ్యక్తి ఒక అపరిచితురాలిని యింటికి ఆహ్వానించడంలో యేదో గూడుపుఠాణీ ఉందని శంకించవచ్చు.

ఇందులో గూడుపుఠాణీ ఏమీ లేదు. పైగా నా ఆహ్వానాన్ని మన్నించడంలో మీకే అన్ని విధాలా లాభం చేకూరుతుంది. వయసులో ఉన్న, అందమైన మీరు ఒంటరిగా ఇక్కడికెలా రావాలా అని సందేహిస్తున్నారా? ఆ భయాలేవీ పెట్టుకోకండి. కారణం, నేను ఎనభైఏళ్ళ వయోవృద్ధుణ్ని!

ఇప్పుడో, అప్పుడో పరలోకానికి ప్రయాణం కట్టే ప్రయత్నంలో ఉన్న రోగిష్టిని!!

ఏదో ఒక సందర్భంలో మీరు నా పేరు వినే ఉంటారు. ఒకప్పుడు నేను దేశంలోకల్లా పేరు పొందిన ఇత్తడి వ్యాపారిని. ఆ రోజుల్లో మాకు మద్రాసు నగరంలో రకరకాల ఇత్తడి సామాను తయారుచేసే పెద్దఫ్యాక్టరీ వుండేది. నా అనారోగ్య కారణాలవల్ల క్రమేణా ఫ్యాక్టరీ ఉత్పత్తులు కుంటుపడి, పదేళ్ళ క్రితం దివాలా తీసినట్టు ప్రకటించి, వంగత్తూర్‌లో ఉన్న మా పూర్వీకుల యింటికి మకాం మార్చేశాను.

బహుశా, ఇప్పుడు మీ కర్థమై ఉంటుంది. మా ఇంటికి 'బ్రాస్ ప్యాలెస్' అని పేరెందుకు పెట్టారో? ఈ ఉత్తరంతోబాటు మీ రాకపోకల ఖర్చు నిమిత్తం వంద రూపాయల నోటు పంపుతున్నాను...

అలాగే, వచ్చేది మీరే కాదో గుర్తింపుకోసం వెయ్యిరూపాయల నోటు ముక్క కూడా జతచేసి పంపుతున్నాను. మీ రిక్కడికి వచ్చాక ఆ నోటు ముక్క చూపిస్తే చాలు వచ్చింది మీరేనని రూఢి అవుతుంది. రాని పక్షంలో మాత్రం కలిసివచ్చే అదృష్టాన్ని చేజేతులా పోగొట్టుకోగలరని మరో మారు గుర్తుచేస్తున్నాను. మీరు రాకుంటే నాకే నష్టమూ లేదు. నష్టపోయేది మీరే!

ఉంటాను—

పచేలరావు.'

ఉత్తరం ముగించిన షీల యింకా ఆశ్చర్యంలోంచి తేరుకోక ముందే గదిలో కాలింగ్ బెల్ మోగింది.

"ఎస్, కమిన్!" అంది తలుపువైపు చూస్తూ.

డోర్ తోసుకుంటూ డిటెక్టివ్ ఉత్తమకుమార్ అసిస్టెంట్ సంజయ్ వచ్చాడు లోనికి. రెండు నెలల క్రితం వాళ్ళిద్దరికీ 'విచిత్ర నరకులు' అనే కేసులో పరిచయమైంది. ఆ పరిచయం కాస్తా ఈ రెండు నెలల వ్యవధిలో మంచి స్నేహంగా మారి, తీరుబడి ఉన్నప్పుడల్లా అడపా దడపా కలుసుకుంటూ ఉంటారు.

"హాయ్, సంజయ్! రా, సమయానికి వచ్చావ్!" అంటూ అతను సోఫాలో కూర్చున్నాక, ఆ ఉత్తరాన్నందిస్తూ, "చదువు!" అంది షీల.

దాన్ని సాంతం చదివి ఆశ్చర్యపోతూ, "ఎవరీ కుచేలరావు?" అడిగేడు సంజయ్.

"అర్థంలేని ప్రశ్న! అందులో స్పష్టంగా రాసుంది కదా, అతనికీ నాకూ ఎటువంటి పరిచయమూ లేదని!"

"ఐతే, ఏం నిర్ణయించుకున్నావ్?"

"కేసు చాలా ఇంట్రస్టింగా వుంది. వెళ్ళాలనే అనుకుంటున్నాను."

"ఒంటరిగానా?"

"ఆ ఎనభైఏళ్ళ ముసలాడు నన్నేం చేస్తాడులే!"అంది షీల నవ్వుతూ.

"నిన్ను చూస్తే ఎనభైఏళ్ళవాడే కాదు, నూరేళ్ళ ముసలాడుకూడా ఇరవైఏళ్ళ పడుచువాడయ్యే ప్రమాదముంది. పైనా అతను రాసిందంతా నిజమేననీ, అతనికి ఎనభైఏళ్ళేనని ఏమిటి నమ్మకం? నిన్నక్కడికి రప్పించడానికి రాసిన హంబక్ కూడా కావచ్చు కదా? పైగా ఆ యిల్లు మద్రాసుకు మూడుమైళ్ళ దూరాన ఉందని గుర్తుంచుకో!"

"ఔను. లోలోపల నాకూ అనుమానంగానే ఉంది.

ఆల్ రైట్! యిప్పుడు నీ వేదైనా కేసులో పని చేస్తున్నావా?"

"కేసులేవీ లేవు గనకే నిన్ను బోర్ కొట్టిద్దామని ఇక్కడ తగలడ్డాను. ఉత్తమ్‌కుమార్ గారు పనిమీద హైదరాబాద్ వెళ్ళారు!"

"ఐతే, నువ్వు నా వెంట రారాదూ?"

"అతను ఆహ్వానించింది నిన్నొక్కదాన్నే కదా?"

"అక్కడికెళ్ళాక సర్ది చెబుతాలే. ఒంటరిగా రావడం ఇష్టంలేక నిన్ను వెంటబెట్టుకొచ్చానని."

"రావడానికి నాకేం అభ్యంతరంలేదు. ఐతే ఎప్పుడు ప్రయాణం?"

"నేనిప్పుడు సెలవుమీదే ఇంట్లో ఉన్నానుకదా? ఈ రోజే బైలుదేరదాం!"

"ఓ. కే! మధ్యాహ్నం రెండు గంటలకల్లా రెడీగా ఉండు. కారు తీసుకొస్తాను..." అంటూ లేచాడు సంజయ్.

## 2

సాయంత్రం సరిగ్గా ఐదు గంటలకు బ్రౌన్ ప్యాలెస్ చేరుకుంది కారు.

వంగతూర్ కి అరమైలు ఇవతలే, ఓ నిర్మానుష్యమైన ప్రదేశంలో ఉంది ఆ పురాతన భవనం! మేన్ రోడ్డుని కలుపుతూ అక్కడికెళ్ళడానికి ఓ మట్టిరోడ్డు వేసి ఉంది. రోడ్డు కిరుపక్కలా మొలచిన ముళ్ళకంప.

భవనం ముందు విశాలమైన, ఎత్తైన ప్రహరీ ఉంది. గేటుగుండా కాంపౌండ్ లోకి కారుని పోనిచ్చేడు సంజయ్.

ఎన్నో ఏళ్ళుగా ఆ భవనానికి సున్నం వెయ్యనట్టూ,

శ్రద్ధ తీసుకోనట్టూ గోడలన్నీ కమిలిపోయాయి. అక్కడక్కడే చెట్లుకూడా మొలిచాయి గోడల్లో. ఆంగ్లేయుల కాలంనాటి కట్టడాన్ని జ్ఞప్తికి తెస్తోంది భవనం. పైన ప్రతి గది మీదా పొగ చూరు గొట్టాల్లాటివి కట్టి ఉన్నాయి.

పోర్టికోలో కారాపి దిగారు ఇద్దరూ.

సింహద్వారం మూసివుంది. దాని తలుపులు చెక్కతోనే తయారైనా, వాటిమీద నగిషీలు చెక్కిన ఇత్తడి రేకులు తాపడంజేసి వున్నాయి. తలుపు కుడిపక్క లావుపాటి ఇత్తడి గొలుసు వేళాడుతోంది. దాని చివర సింహం తల అమర్చి వుంది.

“బహుశా, ఈ గొలుసు లాగితే లోపల గంట మోగుతుందేమో!” అన్నాడు సంజయ్ సింహం తల అందుకుంటూ.

“అంటే, లోపల కరెంట్ లేదన్నమాట! పాపం ఈ కుచేలరావింకా ద్వాపరయుగంలో వున్నాననుకుంటున్నాదేమో!” అంది షీల ఆశ్చర్యంగా చుట్టూ కలయజూస్తూ.

సంజయ్ మారు మాటాడకుండా గొలుసు పట్టుకుని రెండు మూడుసార్లు లాగేడు. అంతే, లోపల చెవులు చిల్లులుపడే గంట శబ్దం వినిపించింది. ఎవ్వరో గబ గబ ద్వారం దగ్గరికి వస్తున్న అడుగుల ధ్వని. తలుపు తెరుచుకుంది.

ముప్పై ఏళ్ళుంటాయతనికి. నల్లగా, గున్న ఏనుగులా ఉన్నాడు. గుడ్లగూబలాటి కళ్ళు. లావుపాటి పెదాలు. కండలు తిరిగిన చేతులు.

“ఏం కావాలి?” అడిగేడు.

"కుచేలరావుగారున్నారా?"

తలూపాడు మౌనంగా.

షీల ఓ అడుగు ముందుకేసి, "నా పేరు షీల! కుచేల రావుగారు నన్ను ఆహ్వానిస్తూ ఉత్తరం రాశారు..." అంది.

ఆమె పేరు వినగానే అతని కళ్ళు మెరిశాయి. "మీరు లోపలికి రావచ్చు!" అన్నాడు తలుపు కడ్డం తొలుగుతూ.

"ఇతను నా కజిన్! నాకు తోడుగా వచ్చాడు" అంది షీల సంజయ్‌ని చూపుతూ.

అతను అనంగీకారంగా తల అడ్డం తిప్పి, "షీల అనే యువతిని తప్ప మరెవ్వర్నీ లోపలికి రానివ్వద్దని చెప్పారు బాబుగారు" అన్నాడు.

"ఐతే మీ అయ్యగారితో చెప్పు! ఇతను కూడా రానిదే నేను లోపలికి రానని" అంది ఎర్రబడ్డ మొహంతో.

అతను క్షణం ఆలోచించి, "సరే, ఆయన్ని కనుక్కొస్తాను. మీకు పంపిన వెయ్యి రూపాయలనోటు ముక్క తెచ్చారా?" అడిగాడు చెయ్యి చాపుతూ.

షీల తలూపి, వేనిటీబ్యాగ్ లోంచి నోటు ముక్క తీసిచ్చింది. దాన్నందుకుని లోపలికెళ్ళిపోయాడతను.

"ఈ పరిసరాలూ, ఇక్కడ రాజ్యమేలుతున్న నిశ్శబ్దమూ నీలో ఎటువంటి అనుభూతిని కలిగిస్తున్నాయి?" అడిగేడు సంజయ్ చుట్టూ కలయజూస్తూ.

"చెప్పలేని భయాన్ని రేకెత్తిస్తున్నాయి...!" అంది షీల.

అంతలో ఆ గున్న ఏనుగు మళ్ళీ వచ్చాడు. "అయ్యా

గారు ఈయన్ని కూడా లోపలకు తీసుకురమ్మన్నారు. మీ సామానెక్కడ?"

కారు డిక్కీవైపు సైగ చేశాడు సంజయ్. అతను గబ గబ వెళ్ళి, డిక్కీలోంచి సూట్ కేస్, ఎర్ బ్యాగ్ అందుకుని, "నా వెంటరండి!" అంటూ లోనికి దారితీశాడు.

అతని వెనక విశాలమైన హాల్లో అడుగుపెట్టి చకితులయ్యారిద్దరూ.

బ్రాస్ ప్యాలెస్ నిజంగా బ్రాస్ ప్యాలెసే! లోపలున్న వస్తువులన్నీ దాదాపు బ్రాస్ తో తయారుచేసినవే. ఫర్నిచరంతా పాతకాలానిదే అయినా, అన్నిటికీ యిత్తడి రేకులు తాపడంచేసి వున్నాయి.

గోడలకు వేళాడే నిలువెత్తు పటాల ఫ్రేములన్నీ ఇత్తడితో తయారుచేసినవే. అక్కడక్కడా ఎలక్ట్రిక్ బల్బులు వేళాడుతున్నాయి. వాటిపైన కప్పులన్నీ ఇత్తడివే. అంటే, ఇంట్లో ఎలక్ట్రిసిటీ వుందన్నమాట. చలికాచుకోడానికి ఆ రోజుల్లో గోడలమధ్య ఏర్పాటు చేసుకునే కుంపటిలోని మంట సెగదోయడాని కుపయోగించే రాడ్ కూడా ఇత్తడిదే కావటం మరో విచిత్రం!

హాల్లోంచే పైకెళ్ళడానికి మెట్లున్నాయి. అతను వాళ్ళిద్దర్నీ మెట్లగుండా పైకి తీసికెళ్ళి, "మీ గది ఇదే!" అన్నాడు తలుపులు తెరిచున్న ఓ గది చూపుతూ.

ఆ గదిలో ప్రవేశించి మరోసారి నోళ్ళు తెరిచారు వాళ్ళు. అక్కడ అమర్చివున్న వస్తువులు కూడా దాదాపు ఇత్తడితో తయారుచేసినవే! మంచంకోళ్ళు కూడా ఇత్తడివే కావడం మరో విడ్డూరం!

"ఇద్దరం యీ గదిలోనే వుండాలా?" అడిగాడు సంజయ్.

"ఆవిడ వెంట మీరు వస్తున్నారని నాకేం తెలుసు?

మీ కోసం పక్క గది శుభ్రంచేస్తాను'' అంటూ సామాను ఆ గదిలో పెట్టి వెనుతిరిగాడతను.

"నీ పేరు తెలుసుకోవచ్చా?"

"వెంకపదం!"

"వచేలరావుగార్ని మేమెప్పుడు కలుసుకోవాలి?"

"రాత్రి ఎనిమిది గంటలకు డైనింగ్ హాల్లో ఆయనే స్వయంగా మిమ్మల్నందర్నీ కలుసుకుంటారు!"

"అందర్నీ అంటే, మాతోపాటు మరికొంత మంది ఆహ్వానించబడ్డారా?"

"ఔను. మరో ఐదుమంది వున్నారు. అందరూ ఇంత క్రితమే వచ్చేశారు''అంటూ బైటికి నడిచాడు వెంకపదం.

షీలా, సంజయ్‌లు ఒకరి మొహాలొకరు చూసు కున్నారు.

"ఆ వచేలరావుకు ఇత్తడి ఫోబియా వున్నట్టుంది. ఇంట్లో ఏ వస్తువు చూసినా ఇత్తడిదే!'' అంటూ మంచాన్ని సమీపించాడు సంజయ్.

దాని కోళ్ళు పూర్తిగా ఇత్తడివో, లేక వాటిమీద ఇత్తడిరేకులు అతికించారో చూద్దామని మంచాన్ని కదిలించి నివ్వెరబోయాడు. అంగుళం కూడా కదల్లేదు మంచం! నేలలో పాతేసివున్నాయి దాని కోళ్ళు.

"సంజయ్! అటుచూడు'' అంటూ గోడవైపు సైగ చేసింది షీల.

తలెత్తి అటు చూశాడు సంజయ్. గోడలకు తగిలించి వున్న పటాలఫ్రేంలన్నీ ఇత్తడివే అయినా, అవి మూలలకు వేళాడదీయబడిలేవు. ఏకంగా గోడల్లోనే బిగించి వున్నాయి.

"పాపం ఆ మహానుభావుడీ ఇత్తడిని ఎక్కడైనా

ఎత్తుకుపోతారన్న భయంకొద్దీ ఈ ఏర్పాట్లు చేశారేమో!" అన్నాడు సంజయ్ నవ్వుతూ.

అంతలో వెంగపదం తిరిగివచ్చి "మీ కోసం పక్కగది శుభ్రంచేశాను. వెళ్ళి రెస్టుతీసుకోండి. సరిగ్గా ఎనిమిది గంటలకి డైనింగ్ హాల్లోకి వచ్చేయ్యండి" అన్నాడు.

తన ఏర్ బ్యాగ్ అందుకుని పక్కగదిలోకి నడిచాడు సంజయ్.

అప్పటికే చీకట్లు ముసురుకున్నాయి. వెంగపదం ఓ పెద్దలాంతర్ వెలిగించి తెచ్చి, షీల గదిలోని బల్లమీద పెట్టి వెళ్ళాడు. ఇంట్లో ఎలక్ట్రిక్ బల్బులుండగా అవెందుకు వాడుతున్నారో అర్థం కాలేదామెకు. ఐనా, అతన్నడగడం యిష్టంలేక ఊరుకుంది.

ఆ గదిలోనే బాత్‌రూం కూడా అటాచ్ చెయ్యబడింది. తలుపుమూసి, టవల్, సోప్ అందుకుని అటు నడిచింది. అక్కడా ఇత్తడి మయమే! స్నానం కానిచ్చి, చీర మార్చుకుంటుండగా, చెవులు చిల్లులుపడే భయంకర శబ్దంతో భవనమంతా మారుమోగింది. ఉలిక్కిపడి అటూ ఇటూ కలయజూసింది షీల. కింద మూడుసార్లు మ్రోగిన గంటశబ్దం అది!

అంతలో "డిన్నర్ టైమయింది. డైనింగ్ హాల్లోకి రండి!" అన్న వెంగపదం కేకతో, ఇక్కడీ విచిత్ర పద్ధతి అమల్లో వుందన్నమాట అనుకుంటూ గబగబ తయారై తలుపు తెరిచి పక్కగదివైపు వెళ్ళింది.

అంతలో సంజయ్ కూడా ఇవతలికి వచ్చాడు. వెంగపదం వాళ్ళని వెంటబెట్టుకుని కింద ఓ పక్కవున్న డైనింగ్ హాల్లోకి తీసికెళ్ళాడు.

# 3

అప్పటికే మిగతా ఐదుగురు అతిథులూ వచ్చి ఆసీనులై వున్నారక్కడ.

వెంగపదం వాళ్ళనక్కడ వదిలేసి వెళ్ళిపోయాడు. విశాలమైన ఆ డైనింగ్ టేబుల్ కుడిపక్క ఖాళీగావున్న రెండు కుర్చీల్లో ఆసీనులయ్యారిద్దరూ. మిగతా అతిథులు కన్నార్పకుండా వాళ్ళనే చూస్తున్నారు.

అంతవరకూ తానొక్కర్తే స్త్రీ అతిథి అనుకుంటున్న షీల భయం తొలగిపోయింది. కారణం, అక్కడ కూర్చున్న మిగతా ఐదుగురిలో ఒక నడివయసు స్త్రీ, ఒక అందమైన యువతి కూడా వున్నారు. మిగతా ముగ్గురూ మగవాళ్ళు. అందరూ నలభైలోపు వయస్కులే.

షీల ఆలోచనా స్రవంతికి ఆనకట్ట వేస్తూ, ముప్పైఏళ్ళ ఓ ఫుల్ సూటతను లేచి నిల్చుని కంఠం సర్దుకున్నాడు.

“లేడీస్ అండ్ జంటిల్‌మన్! మనమంతా పరస్పరం అపరిచితులమని వేరే చెప్పనవసరం లేదు. దిష్టిబొమ్మలా ఒకర్నొకరు చూసుకుంటూ కూర్చునేబదులు, ఒకరి తరువాత ఒకరు తమతమ పరిచయాలు మిగితా వాళ్ళకి తెల్పితే మొహమాటం తొలగి, అందరిమధ్యా సభ్యత ఏర్పడే అవకాశం వుంటుందని నా అభిప్రాయం!

ముందు నన్ను నేను పరిచయం చేసుకుంటాను. నా పేరు డాక్టర్ ఆనంద్! మద్రాసులో ప్రాక్టీస్ చేస్తున్నాను. రెండురోజుల క్రితం ఈ ఇంటి యజమాని కుచేలరావుగారి దగ్గర్నుంచి నాకో ఉత్తరం వచ్చింది. దానితో బాటు ఓ వందరూపాయల నోటూ, సగంచించిన వెయ్యిరూపాయల నోటుముక్కా వున్నాయి. ఉత్తరంలో నన్నిక్కడికి వచ్చి, కొన్నాళ్ళు తన అతిథిగా వుండవలసిందిగా కోరారాయన. విషయం చాలా ఆసక్తి

కరంగా తోచి, ఏమిటో కనుక్కుందామనే కుతూహలంతో బైలుదేరి వచ్చేశాను'' అంటూ తిరిగి కుర్చీలో కూర్చున్నాడతను.

అతని తరవాత రెండో వ్యక్తి లేచినిల్చున్నాడు. అతనికి దాదాపు ముప్పైఎనిమిదేళ్ళుంటాయి. సన్నగా పొడుగ్గా వున్నాడు. కళ్ళకి అద్దాలు.

''ఫ్రెండ్స్! నాపేరు నారాయణశర్మ. ఇన్‌కమ్‌టాక్స్ ఆఫీసులో చీఫ్ ఆడిటర్‌గా పనిచేస్తున్నాడు. డాక్టర్ ఆనంద్‌గారిలాగానే నేను కూడా కుచేలరావుగారి ఆహ్వానంపై తిరుపతి నించి భార్యాసమేతంగా వచ్చానిక్కడికి. ఈమె నాభార్య సత్యవతి!'' అంటూ పక్కనే కూర్చున్న నడివయసు స్త్రీని పరిచయం చేశాడతను.

ఆమెకు ముప్పైఐదేళ్ళుంటాయి. ఎర్రగా, లావుగా వుంది.

ఆ తరవాత సుమారు ముప్పైఏళ్ళున్న మరొకతను లేచి నిల్చున్నాడు. ఇతను డాక్టర్ ఆనంద్‌కన్నా స్మార్ట్‌గా చార్మింగ్‌గా వున్నాడు. ఉంగరాల జుత్తు, కోటేరు ముక్కు.

కంఠం సర్దుకుని, ''ఫ్రెండ్స్ నా పేరు హరనాథ్. రాజమండ్రి డిగ్రీకాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్నాను. వివాహితుణ్ని. ఐనా, విధి వైపరీత్యంవల్ల మళ్ళా బ్రహ్మచారి జీవితం చవిచూస్తున్నాను. కారణం రెండేళ్ళ క్రితం నా భార్య తొలిప్రసవంలోనే ఈ లోకానికి నమస్కారం పెట్టేసింది.

మిగతా ఇద్దరిలాగే నాకూ కుచేలరావుగారి ఆహ్వానలేఖ అందడంతో మానవసహజమైన కుతూహలాన్ని ఆపుకోలేక, బైలుదేరి వచ్చాను'' అన్నాడు.

ఈసారి అందరి కళ్ళూ ఆ అందమైన యువతి మీదికి మళ్ళాయి. దాంతో ఆ పిల్ల రవంత సిగ్గుపడుతూ లేచి నిల్చుంది. ఇరవై, ఇరవై ఒకటి వుంటుంది వయసు. గులాబీరేకల్లాంటి పల్చటిపెదాలు. లేడికూనలాటి చార డేసికళ్ళు. జాన్నముక్కలాటి నున్నని చెక్కిళ్ళు.

"నాపేరు శారీక! ఇండియన్ ఏర్‌లైన్స్‌లో ఏర్ హోస్టెస్‌గా పనిచేస్తున్నాను. ఈ మధ్యే బెంగళూర్ నించి బేగంపేట విమానాశ్రయానికి బదిలీ అయింది. మీలాగే నాకూ కచేలరావుగారి దగ్గర్నించి ఉత్తరం వచ్చింది. ఉండబట్టలేక ఆసక్తికొద్దీ బైలుదేరాను" అంటూ కూర్చుంది.

ఈ సారి అందరి కళ్ళూ షీలా, సంజయ్‌లవైపు మళ్ళాయి. షీల లేచినిల్చుని తనని పరిచయం చేసుకుంది. ఆఖర్న సంజయ్ లేచి తన వివరాలు చెప్పుకున్నాడు. వృత్తివిషయంలో మాత్రం తాను డిటెక్టివ్ ఉత్తమ్ కుమార్ అసిస్టెంట్‌నని గాక ఇంకేదో చెప్పాడు.

"ఇప్పుడు మనమధ్య పరస్పర పరిచయాలయ్యాయి కదా? ఇక నేను మిమ్మల్నొక ప్రశ్న అడగదలచాను. కచేలరావుగారి దగ్గర్నించి మీ అందరికీ ఆహ్వానలేఖ లందాయి. ఆయనకూ, మీకూ పూర్వపరిచయాలేమైనా వున్నాయా?" అడిగాడు సంజయ్ అందర్నీ కలయ జూస్తూ.

"లేదు. ఆయన్ని మేమింతవరకూ చూళ్ళేదు" అన్నా రంతా, ముక్తకంఠంతో.

"ఐతే, ముక్కూ మొహం తెలియని మనందర్నీ ఆయన ఏ ఉద్దేశంతో ఇక్కడికి ఆహ్వా..."

"అందర్నీ కాదు, కేవలం ఐదుగుర్ని..." అన్న

కంచుకంఠం విని, అందరూ ఉలిక్కిపడి తలుపువైపు చూశారు.

వెంగపదం!

అతనొక్కడే లేడక్కడ. అతని పక్కన ఓ పండు వృద్ధుడు నిల్చునున్నాడు. వెంగపదం ఆ ముసలాణ్ణి పొదివి పట్టుకుని నిల్చునున్నాడు. ఎనభైఏళ్ళుంటాయా వృద్ధుడికి. ఖరీదైన సూటు. అస్థిపంజరానికి తొడిగించినట్టుంది. అతని ఒంట్లో మాంసానికి బదులు ఎముకలే ఎక్కువ వుండివుంటాయి. వెండిలా పండిన తల. కళ్ళకి రిమ్‌లెస్ కళ్ళజోడు. చేతిలో హాండ్ స్టిక్!

అతన్ని చూడగానే అతిథులందరి మనసులో ఒకేఒక భావం తళుక్కుమంది.

కుచేలరావు!

"వెంగపదం! అతిథులందరూ ఉన్నట్లే కదా ఇక్కడ?" అడిగాడా వృద్ధుడు.

"ఔనండి!" వినయంగా జవాబిచ్చాడు వెంగపదం.

"లేడీస్ అండ్ జంటిల్ మన్! నేను ఒక్కొక్కర్నీ పేరుపెట్టి పిలుస్తాను. దయచేసి బదులివ్వండి... డాక్టర్ ఆనంద్!" పిలిచాడు కుచేలరావు.

"ఎస్ సర్!"

"నేను బడిపిల్లల అటెండెన్స్ తీసుకోడంలేదు. పేరు పెట్టి పిల్చాక దయచేసి మీరు ఏదో ఒకటి మాట్లాడాలి. అప్పుడే నాకు మీ కంఠాలు గుర్తుంటాయి. వృద్ధాప్యమూ, అనారోగ్యమూ నా కంటిచూపు యిగిర్చివేశాయి" అన్నాడు కుచేలరావు అభ్యర్థిస్తూ.

"నా పేరు డాక్టర్ ఆనంద్. మీ ఆహ్వానం అందగానే మద్రాసునించి వచ్చాను."

"థాంక్స్! కార్తీకా."

"ఎస్ సర్! నా పేరు కార్తీక. మీ ఉత్తరం చూడ గానే బేగంపేట నించి హుటాహుటిన బైలుదేరి వచ్చాను."

వచేలరావు ఆలా ఒక్కొక్కర్నీ పేరుపెట్టి పిలవ సాగాడు. అందరూ అతను కోరినట్లు జవాబులిచ్చారు.

"మీరంతా నా ఆహ్వానాన్ని మన్నించి దూరదూర ప్రదేశాలనించి వచ్చిందుకు థాంక్స్! వెంగపదం! ఇక నన్ను నా సీట్లో కూర్చోబెట్టు" అన్నాడు వచేలరావు.

వెంగపదం అతని చెయ్యి పట్టుకుని నడిపించుకుంటూ వచ్చి, ఇత్తడితో ప్రత్యేకంగా తయారుచేసిన కుర్చీలో కూర్చోబెట్టి చేతులుకట్టుకు నిల్చున్నాడు. ఆ పండు ముసలి తమనెందుకు ఆహ్వానించాడో తెల్సుకుందామని అందరి గుండెలూ కొట్టుకుంటున్నాయి క్యూరియాసిటీతో.

రెండునిమిషాల నిశ్శబ్దంగా కూర్చుని తలెత్తాడు వచేలరావు. "డియర్ ఫ్రెండ్స్! ముక్కూ మొహం తెలి యని మిమ్మల్ని నేనెందుకిలా ఆహ్వానించానో తెలుసు కుందామని మీరెంత ఆరాటపడుతున్నారో నేనర్థం చేసుకోగలను.

ఇక అసలు విషయం! మా వంశంలో ఇప్పుడు మిగిలి వున్న వాణ్ణల్లా నేనొక్కణ్ణే! ఒకప్పుడు మా వంశం ఇత్తడి వ్యాపారంలో దేశంలోకల్లా పేరు గాంచింది. స్వాతంత్ర్యం వచ్చాక క్రమేపీ మా ఇంపాయర్ పల్చబడ సాగింది. మాకు పోటీగా ఎందరో తలెత్తారు. దాంతో, క్రమక్రమంగా మా వ్యాపారం దెబ్బతినసాగింది.

అనారోగ్య కారణాలవల్ల నా చేతుల్లో వ్యాపారం పూర్తిగా చతికిలబడిపోయింది. విసుగెత్తి పదేళ్ళక్రితం నేనే మా కంపెనీ దివాలాతీసినట్టు ప్రకటించి, మా

తాత ముత్తాతల కాలంనాటి ఈ భవనంలో విశ్రాంతి తీసుకుంటున్నాను.

కంపెనీ దివాలాతీసిందని ప్రకటించినంత మాత్రాన నేను పూర్తిగా దివాలాకోర్ని కాలేదు. ఏనుగు బ్రతికి వున్నా, చచ్చినా లక్షరూపాయలు విలువచేస్తుందన్న సామెత మీరు వినేవుంటారు. అలాగే నా వ్యక్తిత్వం ఇప్పుడు అరవైలక్షల రూపాయలు విలువ చేస్తుంది!

ఇక మిమ్మల్ని పిలవడానికి కారణం చెబుతాను వినండి. ఈ మధ్య నా ఆరోగ్యం మరీ క్షీణించింది. నా తరవాత అరవైలక్షలకన్నా ఎక్కువ విలువచేసే ఈ ఆస్తి పాస్తులకు వారసులెవ్వరు? ఈ అపార సంపత్తిని అనుభవించేదెవ్వరు? అన్న దిగులు నన్ను ప్రతిక్షణం వేధించడం ప్రారంభించింది.

నా లాయర్ కాంతిప్రకాశ్‌తో కలిసి, బాగా ఆలోచించి, ఈ పథకం అమలుపెట్టాను. ఆ పథకంలోని భాగమే, మీ ఐదుగుర్ని ఆహ్వానించడం! నిజానికి నేను ఆహ్వానించదలచుకున్న వ్యక్తులు మొత్తం ఏడుగురు!!

ఆరా తియ్యగా అందులో ఒకరు చాలా రోజుల క్రితమే చనిపోయినట్లు తెలిసింది. మరొకరి కోసం ఎంత గాలించినా ఆచూకీ లభించడంలేదు. అతనికోసం ఇంకా వెతికిస్తూనే వున్నాను. ఎందుకో తెలుసా? నా మరణానంతరం, అరవైలక్షలు విలువచేసే నా ఆస్తిపాస్తులకు వారసులుగా మీలోనే ఎవ్వరో ఒకర్ని ఎన్నుకోవాలి.

ఒక్కర్నే అన్న నియమం ఏమీలేదు. ఇద్దర్ని కూడా ఎన్నుకోవచ్చు. నలుగుర్ని కూడా ఎన్నుకోవచ్చు. లేదా, అందరికీ సమానంగా పంచవచ్చు. అతంతా నా ఇష్టా ఇష్టాలమీద ఆధారపడుంది.

దేశంలో డెభ్భైకోట్ల జనాభా వుండగా, నేను మీ

ఏడుగురినే ఎందుకు ఎన్నుకున్నానా అని ఆశ్చర్య
పోతున్నారు కదూ? కారణం లేకపోలేదు. నా గత జీవి
తంలో మీ తలిదండ్రులు ఏదో ఒక సందర్భంలో నా
ప్రాణాలు కాపాడి పుణ్యం కట్టుకున్నారు.

విచారకర విషయమేమిటంటే, ఆనాడు ప్రాణదాత
లైన మీ తలిదండ్రుల్లో ఏ ఒక్కరూ ఇప్పుడు జీవించి
లేరు. నిజమేనా?'' అడిగాడు కుచేలరావు అందర్నీ కలయ
జూస్తూ.

అందరూ తలలూపారు ఒకేసారి!

''అందుకే ఆ పుణ్యమూర్తుల సంతానమైన మీకు ఈ
విధంగా మేలుచేసి, నా ఋణభారాన్ని దించుకోదల
చాను. మీ తలిదండ్రులు నాకేవిధమైన మేలు జేశారో
తెలుసుకోవాలని కుతూహలపడుతున్నారుకదూ? చెబుతా
వినండి.

మిస్టర్ నారాయణవర్మా! మీ నాన్నగారూ, నేనూ
ఒకే ఈడువాళ్ళం. సహాధ్యాయులం. యూనివర్సిటీలో
చదువుకునే రోజుల్లో ఒక విద్యార్థితో నాకు బద్ధవిరోధం
ఉండేది. ఒక రాత్రి నేనూ, మీ నాన్నా సెకండ్ షో
సినిమా చూసి వస్తుండగా, ఆ విద్యార్థి, నలుగురు గూండా
లని వెంటబెట్టుకొని నామీద దాడి జేశాడు. అప్పుడు
మీ నాన్న ఆ రౌడీలతో హోరాహోరీ పోరాడి నా
ప్రాణాలు రక్షించాడు.

మిస్ షీలా! మీ నాన్నగారు ఆ రోజుల్లో గొప్ప
డాక్టర్‌గా పేరు పొందారు. ఒకప్పుడు నేనొక మొండి
వ్యాధికి గురయ్యాను. ఎందరో డాక్టర్లు వైద్యంచేసి,
నయంజెయ్యలేకపోయిన ఆ జబ్బును మీ నాన్నగారు
ఎంతో నేర్పుతో చికిత్సచేసి రూపుమాపారు. ఆ విధంగా
నాకు పునర్జన్మ ప్రసాదించారు.''

షీల ఉలిక్కిపడి ఏదో చెప్పడానికి నోరు తెరిచింది. సంజయ్ మెరుపులా ఆమె చెయ్యినొక్కి మాట్లాడవద్దని సైగ చేశాడు. అదేమీ గమనించకుండా తన ధోరణిలో చెప్పుకుపోతున్నాడు కుచేలరావు.

"మిస్టర్ హరనాథ్! మీ అమ్మా, నేనూ కాలేజిలో చదువుకునేవాళ్ళం! ప్రతి కాలేజీ కుర్రాడి హృదయం లోనూ, యెవ్వరో ఒక విద్యార్థిని చెరగని ముద్ర వేసు కోడం, ఆ తియ్యని స్మృతులు ఆజన్మాంతం అతని హృదయంలో పదిలంగా నిలిచిపోవడం సహజం!" అంటూ భారంగా నిట్టూర్చి, "పోనివ్వు! ఈ వయసులో అటువంటి గతాన్ని తిరగదోడటం హాస్యాస్పదమే... మొత్తానికి నువ్వు ఏ వ్యక్తి కడుపునైతే పుట్టావో ఆ వ్యక్తి జ్ఞాపకాలు యిప్పటికీ నాలో స్థిరంగా మిగిలి వున్నాయి" అంటూ క్షణం ఆగాడు కుచేలరావు.

అందరి కళ్ళూ అప్రయత్నంగా లెక్చరర్ హరనాథ్ వైపు మళ్ళాయి. అందరి మస్తిష్కంలోనూ ఒకే ఒక ఆలోచన కదులుతోంది. బహుశా, కుచేలరావు చదవు కునే రోజుల్లో హరనాథ్ తల్లిని ప్రేమించి ఉంటాడు!

కుచేలరావు కంఠం ఖంగుమంది మళ్ళీ. "మిస్ శాస్త్రి! మీ నాన్నగారు ఆ రోజుల్లో పోలీస్ సబిన్స్పెక్టర్గా పనిచేసేవారు. ఒకప్పుడు నేనో హత్యకేసులో ఇరికించ బడ్డాను.సాక్ష్యాలన్నీ నాకు విరుద్ధంగా సృష్టించబడ్డాయి. పోలీసు ఉన్నతాధికార్లంతా ఆ హత్య నేనే చేశానని నమ్మినా, మీ నాన్న మాత్రం అది నమ్మక, అహో రాత్రులూ శ్రమించి, పరిశోధించి అసలు హంతకుణ్ణి పట్టుకుని, నా కంఠానికి ఉరితాడు బిగుసుకోకుండా కాపాడారు.

డాక్టర్ ఆనంద్! ఒకప్పుడు నేను తీవ్రంగా జబ్బు పడి ఒక శానిటోరియంలో అడ్మిటయ్యాను. అప్పుడు మీ అమ్మ నాకు యెంతో ఆత్మీయంగా, శ్రద్ధగా శుశ్రూషలు చేసి, మళ్ళీ పునర్జన్మ ప్రసాదించింది. ఆమె సేవల ఫలితంగానే నేను లేచి తిరగగలిగే యోగ్యత సంపాదించాను. ఆ శానిటోరియంలో మీ అమ్మ నర్సుగా పని చేసేదని వేరే చెప్పనవసరం లేదనుకుంటాను.

ఆ విధంగా మీ మీ తలిదండ్రులు నాకు చేసిన ఉపకారాల ఫలితంగానే ఈ రోజు మీరిక్కడున్నారు. మనిషి యెవ్వరినైనా మరిచిపోగలడుగానీ, తన ప్రాణదాతలని ఎన్నడూ మరవలేడు.

దయచేసి మీరంతా పదిహేను రోజులపాటు నా అతిధులుగా యీ యింట్లో బసచెయ్యాలసిందని అభ్యర్థిస్తున్నాను. ఆ పదిహేనురోజుల్లో నేను మీ మీ మనస్తత్వాలు స్టడీ చేసి, నా ఆస్తికి ఎవర్ని వారసులుగా ఎన్నుకోవాలో నిర్ణయిస్తాను. యీ లోపల యెవ్వరైనా వెళ్ళిపోదలిస్తే నిరభ్యంతరంగా వెళ్ళిపోవచ్చు. అటువంటప్పుడు నా ఆస్తిలో వాళ్ళ కేటువంటి ప్రమేయం ఉండదు.

పదిహేనురోజుల తరవాత నా నిర్ణయం ప్రకటించబడుతుంది. ఆ రోజే నా లాయర్ శాంతిప్రకాశ్ సమక్షంలో విల్లు రాసేస్తాను. ఇక్కడ మీకే యిబ్బందీ ఉండదు. వెంగపదం మీ అవసరాలన్నీ చూసుకుంటాడు...

ఇక యింతకి మించి యెక్కువ మాట్లాడలేకపోతున్నందుకు క్షంతవ్యుణ్ని. ఇప్పటికే చాలా పొద్దుపోయింది. మీరు భోజనాలు కానిచ్చి, మీ మీ గదుల్లో విశ్రాంతి

తీసుకోండి. వెంగపదం! నన్ను తీసుకెళ్ళు" అంటూ ముగించాడు కుచేలరావు.

వెంగపదం అతన్ని లేపి, నడిపించుకుంటూ బైటికి తీసికెళ్ళాడు.

అతిథులంతా ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. అందరి కళ్ళల్లోనూ ఆ అపార ఆస్తికి ఎవరెవరు, ఏ ఏ మోతాదులో వారసులవుతారో అన్న మీమాంసా, కుతూహలం స్పష్టంగా ద్యోతకమాతున్నాయి.

## 4

భోజనాలయ్యాక అందరూ మేడమీది తమ తమ గదుల్లోకి వెళ్ళిపోయారు.

సంజయ్ షీల వెంట ఆమె గదిలోకి వచ్చి, తలుపులు దగ్గరగా జేరవేసి—"ఇప్పుడు చెప్పు. కుచేలరావు నీ తండ్రి డాక్టర్ అనీ, తన ప్రాణాలు కాపాడాడనీ చెప్పినప్పుడు నువ్వు ఉలిక్కిపడ్డావ్! ఎందుకు?" అడిగాడు.

"కారణం చెప్పానంటే నువ్వు నిర్ఘాంతపోక మానవు! మా నాన్న డాక్టర్ కాదు!! రైల్వేలో టికెట్ కలెక్టర్‌గా పని చేసేవారు. కుచేలరావు అంత పచ్చి అబద్ధం ఎందుకు చెప్పాడో నా కర్థంకావడంలేదు" అంది షీలా ఆశ్చ ఆశ్చర్యంగా.

సంజయ్ భ్రుకుటి ముడిపడింది. కాసేపు ఆలోచించి, సాలోచనగా తలూపేసు, "షీలా! కుచేలరావు అబద్ధం చెప్పలేదు. అందుకు ఋజువులున్నాయి. నీ విషయం చెప్పినప్పుడు—అది అబద్ధం గనక నువ్వు ఉలిక్కిపడ్డావ్. నేను వారించకపోతే నిజం చెప్పేదానివే!

అటువంటప్పుడు మిగతావాళ్ళ మొహాల్లో ఆశ్చర్య భావాలు పొడసూపేవి. అవేమీ కాకుండా అందరూ

కుచేలరావు చెప్పిందివిని, నిజమే అన్నట్టు బుర్రలూపారు. దీన్నిబట్టి ఆలోచిస్తే, కుచేలరావుకు నీ విషయంలోనే ఏదో పొరబాటు జరిగివుంటుందనిపిస్తోంది.

ఆయన ఈ అతిథుల వివరాలు తెలుసుకోడానికి నియమించిన వ్యక్తే నీ విషయంలో పొరబడుంటాడు. ఇంకెవరో షీల అనే అమ్మాయిని వెతకబోయి, నిన్నే ఆమె అనుకుని కన్‌ఫ్యూజ్ అయ్యుంటాడు.''

''ఒక విధంగా నీ హేతువాదం సమంజసంగానే ఉంది. కాని, మరోవైపునించి కూడా ఆలోచించాలి. కుచేలరావు యితర్ల గురించి చెప్పిందంతా నాలాగే అబద్ధమైనా వాళ్ళు కిమ్మనకుండా ఊరుకోడానికి ఆస్కారం ఉందికదా?

ఒకవేళ ఆయన చెప్పింది అబద్ధమనీ, తమ తలిదండ్రులు యింకెవ్వరో అనే నిజం బైటపెడితే ఆయన యెక్కడ వెళ్ళిపొమ్మంటాడో, ఆ విధంగా కలిసిరాబోతున్న అదృష్టం ఎక్కడ చేజారిపోతుందో అని వాళ్ళు భయపడి ఉండవచ్చు కదా?''

''ఔను. అదీ నిజమే. నిజానిజాలు తెలుసుకోడానికి ఓ పని చేద్దాం! నేను మద్రాసు క్రయింబ్రాంచి హెడ్ క్వార్టర్స్‌కు ట్రంకాల్ జేసి, ఇన్‌స్పెక్టర్ రాజారెడ్డికి కథంతా వివరించి, ఈ అతిథుల తలిదండ్రుల వివరాలు తెలుసుకుని, వాళ్ళతో కుచేలరావుకు నిజంగా సంబంధాలుండేవో? లేదో? ఆరా తీయించమని కోరతాను. ఏమంటావ్?''

''ఐడియా బావుంది. అలాగే చెయ్యి!''

''ఈ యింట్లో టెలిఫోన్ లేనట్టుంది. అంతే కాదు, యిల్లంతా ఎలక్ట్రిక్ సర్క్యూట్ ఉండగా కరెంట్

లేకపోవడం మరో విడ్డూరం! వంగపూర్ ఇక్కడికి అర మైలు దూరమే. అక్కడ పోలీస్ స్టేషన్ కూడా ఉండి ఉంటుంది. రేపక్కడికెళ్ళి పోలీస్ స్టేషన్లోంచి ట్రంకాల్ జేస్తాను. ఆల్ రైట్! ఉదయం మళ్ళీ కలుసుకుందాం, గుడ్ నైట్!'' అని తన గదిలోకెళ్ళాడు సంజయ్.

తలుపులు మూసి, నైట్ డ్రెస్ తొడుక్కుని, లైటార్పి పక్కమీద వాలాడు. గడియారాన్ని దిండుకింద పెట్టి, కళ్ళు మూసుకున్నాడు. ఇంటివెనక తోటలో చెట్టుమీద కూర్చుని భయంకరంగా అరుస్తోంది గుడ్లగూబ.

కుచేలరావు గురించే ఆలోచిస్తూ నిదరలోకి జారుకున్నాడు.

అర్ధరాత్రి—

హఠాత్తుగా భవనం దద్దరిల్లేలా గావుకేక వినిపించినట్టయి, చటుక్కున కళ్ళు తెరిచాడు. చెవులు రిక్కించి అలాగే పడుకొన్నాడు. ఈసారి గొంతు పార చినిగేలా వినిపించింది పొలికేక! మేడమీద కాదు, కిందనించి!

అప్పటికే మేడమీదున్న గది తలుపులు తెరుచుకుంటున్న శబ్దాలు వినిపించాయి. కిందినించి వెంగపదం అరుస్తున్నాడు గట్టిగా. "బాబుగార్నెవరో చంపేశారు. రండి, త్వరగా రండి.''

తలుపు తెరిచి బైట కొచ్చాడు సంజయ్. అప్పటికే షీలతోబాటు అతిధులంతా గదుల్లోంచి బైటికి వచ్చారు. అందరూ హడావుడిగా మెట్లవెపు పరిగెత్తారు. హాల్లో నిల్చుని గుండెలు బాదుకుంటున్నాడు వెంగపదం!

"ఏం జరిగింది? ఏమైంది?'' అడిగారంతా.

"నా గది అయ్యగారి పడగ్గది పక్కనే వుంది. ఐదు నిముషాల క్రితం ఆయన గావుకేక విని, నిద్ర లేచాను. నా

గదిలోనించి బైటికి రాబోతుండగా మళ్ళీ కేక వినిపించింది. ఆయన గది దగ్గరికి పరిగెత్తి చూస్తే తలుపులు బార్లా తెరిచున్నాయి. లోపల మంచం మీద—''

"ఆయన గదెక్కడుంది?" మధ్యలో అందుకున్నాడు సంజయ్.

వెంగపదం వాళ్ళని కుచేలరావు గది దగ్గరికి తీసికెళ్ళాడు. ఆ గదిలో అడుగు పెట్టగానే అందరూ స్థాణువులైపోయారు! మంచంమీద వెల్లకిలా పడున్నాడు కుచేలరావు. నిర్జీవంగా, చలనరహితంగా! పరుపూ, దిండూ రక్తంతో తడిసివున్నాయి.

డాక్టర్ ఆనంద్, సంజయ్‌లిద్దరూ గబగబ మంచాన్ని సమీపించారు.

అప్పుడు పడింది సంజయ్ దృష్టి, మంచానికాస్త యివతల నేలమీద పడున్న వస్తువుమీద. అది పొడవాటి ఇత్తడి రాడ్! దాని ఓ చివర మూడంగుళాల వరకూ నల్లబారి ఉంది. రక్తపు మరకలు కూడా అక్కడే ఉన్నాయి.

సడన్‌గా జ్ఞాపకం వచ్చింది సంజయ్‌కు—తానా యింట్లో అడుగుపెట్టినప్పుడు, హాల్లో ఓ పక్కగోడలో కట్టిన చలి కాచుకునే కుంపటిదగ్గర కనిపించిన రాడ్ అది. మంటను ఎగదొయ్యడాని కుపయోగించేవారు గనక దాని ముందుభాగం నల్లబారి ఉంది. బహుశా హంతకుడు కుచేలరావు తల పగలగొట్టి చంపుంటాడు.

అంతలో డాక్టర్ ఆనంద్ కుచేలరావు చెయ్యి అందుకుని పల్స్ చూసి, "థాంక్ గాడ్! ఈయనింకా బ్రతికే ఉన్నాడు. పల్స్ కొట్టుకుంటోంది. కేవలం స్పృహ

పోయింది. వెంగపదం! వెంటనే వెళ్ళి నా గదిలోంచి మెడికల్ చెస్ట్ పట్రా!'' అన్నాడు హడావుడిగా.

వెంగపదం బాణంలా బైటికి పరిగెత్తాడు.

"గాయం కడగడానికి వేణ్ణీళ్ళు పట్టుకొద్దాం! నా వెంట రండి'' అంటూ భర్త చెయ్యి పట్టుకొని బైటికి నడిచింది సత్యవతి.

నిమిషాల మీద వచ్చేశాయి మెడికల్ చెస్ట్, వేణ్ణీళ్ళు.

డాక్టర్ ఆనంద్ గబగబ పచేలరావు నుదుటిమీది గాయాన్ని శుభ్రం చేసి, కట్టు కట్టి రక్తస్రావాన్ని ఆపేశాడు. ఆయనకింకా స్పృహ రాలేదు.

గదంతా ఓమారు కలయజూశాడు సంజయ్. ఆ గది పడమటిదిక్కున పెద్ద కిటికీ వుంది. లోపలివైపు బోల్ట్ వేసివుంది. అంటే, ఆ కిటికీగుండా బైటినించి ఎవ్వరూ రాలేదన్నమాట.

సంజయ్‌ను ఆకట్టుకున్న మరో విషయం ఏమిటంటే, ఆ యింట్లో యెటు చూసినా ఇత్తడి వస్తువులున్నమాట నిజమేగానీ ఈ గదిలో వాటి సంఖ్య ఇంకాస్త ఎక్కువ మోతాదులో వుంది. మంచంలోసహా యెటు చూసినా ఇత్తడే! అన్నీ పాలిష్ చెయ్యబడ్డట్టు ధగధగ మెరిసి పోతున్నాయి.

సాలోచనగా తలూపి, "ఆ ఇత్తడి రాడ్ నెవ్వరూ ముట్టుకోవద్దు. దానిమీద హంతకుడి వేలిముద్ర లుండి ఉంటాయి. నే వెళ్ళి, వంగతూర్ పోలీసుల్ని పిల్చు కొస్తాను. పచేలరావుగారిమీద హత్యాప్రయత్నం జరి గింది. ఇది పోలీసుకేసు. వాళ్ళకు ఇన్ఫర్మేషన్ ఇవ్వడం మన కనీస కర్తవ్యం!'' అంటూ షీల నక్కడే ఉండ మన్నట్టు సైగ చేసి బైటికి నడిచాడు సంజయ్.

బైట వున్న తమ కారెక్కి, పది నిమిషాల్లో చేరు కున్నాడు ఊళ్ళోకి. పోలీస్ స్టేషన్ కనుక్కోడం కష్టం కాలేదు. అదృష్టవశాత్తూ ఇన్ స్పెక్టర్ అక్కడే ఉన్నాడు.

సంజయ్ తనని తాను పరిచయం చేసుకోగానే, "గ్లాడ్ టు మీట్ యూ మిస్టర్ సంజయ్! మీ గురించి మా డిపార్ట్ మెంట్ లో తరుచూ వింటూంటాను" హార్దిక స్వాగతం పలికాడు.

అతనికి జరిగింది వివరించి, వెంటనే కావలసిన సిబ్బందితో బైలుదేరమని కోరాడు సంజయ్. ఐదు నిమిషాల్లో సిబ్బందితో జీప్ ఎక్కాడు ఇన్ స్పెక్టర్. వాళ్ళు కుచేలరావు యింటికి చేరేలోగా, ఆ వృద్ధుడికి స్పృహ తెప్పించడంలో కృతకృత్యుడయ్యాడు ఆనంద్. అప్పటికే ఏర్ హోస్టెస్ కార్తీక కాఫీ తయారుచేసి, ఆయనచేత తాగిస్తోంది.

"ఈ రాడ్ తో నేనా హత్యాప్రయత్నం జరిగింది?" అడిగాడు ఇన్ స్పెక్టర్ కింద పడున్న ఇత్తడి కడ్డీవైపు చూపుతూ.

"ఔను. దాన్ని జాగ్రత్తగా తీసి కెళ్ళి ఫింగర్ ప్రింట్స్ తీయించండి. ప్రింట్స్ గనక దొరికాయంటే హంతకుడు పట్టుబడటానికి క్షణం పట్టదు" అన్నాడు సంజయ్.

"ఎవరు? ఎవరు మాట్లాడుతోంది? ఒకరు సంజయ్ అనుకొంటాను. ఆ కొత్త కంఠం ఎవరిది?" అడిగాడు మంచంమీద కూర్చున్న కుచేలరావు.

"ఈయన పోలీస్ ఇన్ స్పెక్టర్! తంగత్తూర్ నించి వచ్చాడు."

"పోలీస్ ఇన్ స్పెక్టరా? నా యింట్లో పోలీసులకేం

పని?'' కుచేలరావు నోటినించి వెలువడ్డ ఆ మాటలు అందర్నీ చకితుల్ని చేశాయి.

''అదేమిటి రావుగారూ? మీమీద హత్యాప్రయత్నం జరిగింది. ఆ దౌర్జన్యానికి పాల్పడ్డ వ్యక్తిని పట్టుకోడం పోలీసుల కర్తవ్యం కాదా?'' అన్నాడు సంజయ్ ఆశ్చర్యంగా.

''వీళ్ళనెవరు పిల్చారిక్కడికి?''

''నేనే!''

''మిస్టర్ సంజయ్! ఇది నా యిల్లు. ఇక్కడ నా అనుమతి లేనిదే ఏ పనీ జరగడడానికి వీల్లేదు. నా యింటి చుట్టూ పోలీసులు తిరగడం నా కిష్టం ఉండదు. నామీద హత్యాప్రయత్నం జరిగింది. నిజమే! ఐనా, నేనింకా బ్రతికే ఉన్నాను. అటువంటప్పుడు ఈ గొడవంతా యెందుకు? ఒక వేళ నా ప్రాణాలు పోయుంటే అప్పుడు మీ రేంజేసుకున్నా నా కభ్యంతరం ఉండేదికాదు. ఇన్స్పెక్టర్! దయచేసి మీరిక వెళ్ళొచ్చు'' అన్నాడు కుచేలరావు నిర్మొహమాటంగా.

ఇన్స్పెక్టర్ మొహం జేవురించింది. ''సరే మీకు మా సహాయం అవసరం లేకంటే, తరవాత మమ్మల్ని నిందించవద్దు'' అంటూ విసవిస బైటికి నడిచాడు.

అతని వెనకే సంజయ్ కూడా ఇవతలికి వచ్చాడు.

''ఆ ముసలాడికి పిచ్చిగానీ ఉందేమిటి!'' అన్నాడు ఇన్స్పెక్టర్ మొహం చిట్లిస్తూ.

''పిచ్చిలేదుగానీ, అలా యెందుకు ప్రవర్తించాడో నా కర్థంకావడంలేదు. మొత్తానికి ఏదో వుంది రహస్యం! అయామ్ సారీ ఇన్స్పెక్టర్. నావల్ల మీకీ విధంగా అవమానం జరిగింది!''

"డోంట్ వర్రీ! నా సహాయ సహకారాలు మీ కెప్పుడూ ఉంటాయి. ఏది ఏమైనా, ఈ పరిస్థితుల్లో త్వరలోనే మరో సంఘటన జరగవచ్చని నా అనుమానం! మీరు కాస్త జాగ్రత్తగా ఉండటం మంచిది!"

సంజయ్ తలూపి, "ఆల్ రైట్! మీ వెంట నేనూ పోలీస్ స్టేషన్ వస్తున్నాను. అక్కణ్ణించి మద్రాసుకు ట్రంకాల్ జేసి, క్రయిం బ్రాంచ్ ఇన్స్పెక్టర్ రాజారెడ్డితో కాస్త మాట్లాడాలి." అన్నాడు కారెక్కుతూ.

అప్పటికే తూరుపు దిక్కున తెల తెలవారసాగింది.

# 5

రెండు రోజులు ఎలాటి అవాంఛనీయ సంఘటన జరక్కుండా గడిచిపోయాయి.

మూడోరోజు మధ్యాహ్నం లంచ్ సమయంలో అందరూ డైనింగ్ హాల్లో కూర్చున్నాక, సంజయ్ లేచి, "ఫ్రెండ్స్! ఈరోజు మిస్టర్ కుచేలరావు ముందు మిమ్మల్ని ఆశ్చర్యచకితుల్ని జేసే కొన్ని నిజాలు బైటపెట్ట దలచాను. ఆయన్ను పిల్చుకురమ్మని వెంగపదాన్ని పంపించాను. అంతవరకూ ఓపిగ్గా కూర్చోగలరు" అన్నాడు.

సంజయ్ ధోరణి అందర్నీ విస్మయపరచినా, ఏం జరుగుతుందో చూద్దామని కిమ్మనకుండా కూర్చున్నారంతా. పది నిమిషాల తరవాత కుచేలరావుని నడిపించుకుంటూ వచ్చి, కుర్చీలో కూర్చోబెట్టాడు వెంగపదం!

"మిస్టర్ సంజయ్! నాతో ఏదో ముఖ్య విషయం మాట్లాడాలన్నారట. ఏమిటది?" అడిగాడు కుచేలరావు కుతూహలంగా.

"ఔను. ఈరోజు మీ అతిథులముందు నేనొక పచ్చి నిజాన్ని బైటపెట్టదలచాను."

"ఏమిటది?"

"మీరీ ప్రపంచంలోకల్లా ఆరితేరిన అబద్ధాలకోరని!" సంజయ్ నోటివెంట వెలువడ్డ ఆ మాటలు అక్కడ కూర్చున్న వాళ్ళందర్నీ స్థాణువుల్ని జేశాయి.

కుచేలరావు ఆ షాక్ లోంచి తేరుకుని, "నేనా? అబద్ధాలకోరునా?" అన్నాడు నోరు తెరుస్తూ.

"ఔను. ఋజువులతో సహా చెబుతాను వినండి. షీల తండ్రి ఒకప్పుడు గొప్ప డాక్టర్ అనీ, మిగతా డాక్టర్లు నయం జెయ్యలేక ఆశవదులుకున్న మీ జబ్బును రూపు మాపి మీ ప్రాణాలు కాపాడారనీ చెప్పారు కదూ?

నిజానికి, ఆయన డాక్టర్ కాదు. మీ ప్రాణాలు కాపాడలేదు. ప్రాణాలు తియ్యడానికి కుట్రపన్ని విష పూరితమైన మందులిచ్చి మిమ్మల్ని చంపడానికి ప్రయత్నిం చేడు. దైవవశాత్తూ మీరా గండంనించి గట్టెక్కి కోర్టులో ఆయనమీద కేసు పెట్టారు. సాక్ష్యాలు సరిపడక, ఆ కేసు నిలువలేదు. ఆయన మిమ్మల్ని ఎందుకు చంపడానికి ప్రయిత్నించాడో కారణం మీకే తెలియాలి.

మిస్టర్ నారాయణవర్మ తండ్రీ, మీరూ యూనివర్సి టీలో చదువుకుంటున్నప్పుడు, మీ శత్రువైన ఒక విద్యార్థి గుండాలతో మీమీద దాడిజేసి, చంపడానికి ప్రయత్నిస్తే ఆయన తండ్రి వాళ్ళను చితకదన్ని మిమ్మల్ని కాపాడారని చెప్పారు.

నిజానికి మీమీద గుండాలతో దాడిజేసింది వేరే ఎవ్వరో కాదు. నారాయణవర్మ నాన్నే! ఆ దాడిలో మిమ్మల్ని మూర్ఛపోయేట్టు కొట్టి, చనిపోయారనుకుని

రోడ్డుమీద వదిలేసి పారిపోయారు వాళ్ళు. దారిన పోయే దానయ్యలద్వారా మీరు హాస్పిటల్ జేర్చబడ్డారు.

తరవాత మీరు వాళ్ళమీద కేసుపెడితే, అందరికీ ఆరారు నెలలు శిక్ష పడింది. ఆయన మిమ్మల్నలా ఎందుకు చావగొట్టించాడో నాకు తెలియదు. ఇక హరనాథ్ తల్లి విషయం! ఆవిడా, మీరూ ఒకే కాలేజీలో చదువుకున్న మాట నిజమే!

అలాగే, జబ్బుతో శానిటోరియంలో చేరిన మీకు అక్కడ నర్సుగా పనిజేసిన డాక్టర్ ఆనంద్ తల్లి ఎంతో శ్రద్ధాసక్తులతో సేవలుజేసిన మాటకూడా వాస్తవమే! ఐతే, మీరా శానిటోరియం నించి డిశ్చార్జయ్యాక, కొద్ది రోజులకు ఆవిడ మీ ఇంటికివచ్చి, మీతో తీవ్రంగా ఘర్షణపడి, నానా బూతులూతిట్టి వెళ్ళిపోయింది. హాతాత్తుగా ఆవిడలా దేనికి ప్రవర్తించిందో విచిత్రమే.

పోతే, కార్తీక తండ్రి గురించి_ ఆయన ఆ రోజుల్లో పోలీస్ ఇన్స్పెక్టర్ గా పనిజేసేవారనీ, ఏదో హత్య కేసులో ఇరుక్కున్న మిమ్మల్ని చాకచక్యంతో కాపాడారనీ చెప్పారు. నిజానికి ఆ హత్యకేసులో మిమ్మల్ని ఇరికించింది ఎవ్వరోకాదు, ఆయనే!

కొమ్ములు తిరిగిన లాయర్లనుపెట్టి, మీరా కేసులోంచి తప్పించుకోగలిగేరు. ఇక్కడ అత్యంత విచిత్ర విషయం ఏమిటంటే, అంతకుముందు ఆయనా, మీరూ ప్రాణ మిత్రులు. అటువంటప్పుడు ఆయన మిమ్మల్ని హత్య కేసులో ఇరికించి, ఎందుకు ఉరికంబం ఎక్కించదలచాడో ఎవరికీ అంతుబట్టలేదు!

అటువంటి మీ ఆగర్భ శత్రువుల సంతానమైన వీళ్ళం దర్నీ మీరు ఏ ఉద్దేశంతో యిక్కడికి పిలిపించారో

అంతకన్నా అగమ్యగోచరం!'' అని చుట్టూ కూర్చున్న అతిథులవైపు చూశాడు సంజయ్.

అందరూ అతన్ని నమిలి మింగేసేలా చూస్తున్నారు, ఒక్క షీలా తప్ప!

లోలోపల నవ్వుకున్నాడు సంజయ్. ఇంతవరకూ తాము కుచేలరావు ప్రాణదాతల సంతానమనీ, దాని ప్రతిఫలంగా ఆయన ఆస్తికి వారసులం కాబోతున్నామనీ మురిసిపోతున్నవాళ్ళు, ఇప్పుడు హఠాత్తుగా తామాయన శత్రువుల సంతానమని తెలియగానే, కలిసి రాబోతున్న ఆ కలిమి యెక్కడ తొలగిపోతుందోనని బెదిరిపోతున్నారు.

ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ఖంగుమంది కుచేలరావు కంఠం.

"మిస్టర్ సంజయ్! నీ గురించి నేనేమో అనుకున్నాను. మొత్తానికి కాకులుదీరిన పిండాని వేసన్నమాట. ఈ విషయ సేకరణకు నీవు ఎంతో మందిమార్బలాన్ని వినియోగించి ఉంటావ్! ఔనా?"

"ఆ విషయం తరవాత! ముందు నేచెప్పిందంతా నిజమేనని మీ రంగీకరిస్తున్నారా?"

"నా అంగీకార, అనంగీకారాలతో మీకు నిమిత్తం లేదు. ఒకవేళ వీళ్ళంతా నా శత్రువుల సంతానమే అనుకున్నా, యెంతో వ్యయప్రయాసలకోర్చి, వీళ్ళను పిలిపించి, నా ఆస్తికి భాగస్వాములను చెయ్యాడం గొప్ప విషయమే కదా?

ఇక యింతకి మించి నేనేమీ మాట్లాడదలచుకోలేదు. వెంగపదం! నన్ను తీసికెళ్ళు'' అన్నాడు కుచేలరావు లేస్తూ.

అతిధులంతా తలమీది భారం తొలగిపోయినట్టు నిట్టూర్చారు తేలిగ్గా.

"కుచేలరావుగారూ! దయచేసి కూర్చోండి. నేనింకా అసలు విషయానికి రాలేదు. నేను బైటపెట్టదలచుకున్న మరో కొత్త సమాచారాన్ని విన్నాక ఈ అతిథులంతా దిగ్భ్రాంతితో స్తబ్ధులవుతారో, మరేమవుతారో నని భయంగా ఉంది—" అన్నాడు, సంజయ్ నాటకీయంగా.

"ఏమిటది?" అన్నాడు కుచేలరావు అప్రయత్నంగా కుర్చీలో చతికిలబడుతూ.

"మీరిప్పుడు అరవై లక్షలకు అధిపతి అనీ, మీ తదనంతరం ఆ డబ్బంతా వీళ్ళకు చెందేలా విల్లు రాస్తాననీ బొంకారు కదూ?"

"బొంకడమా? ఏమిటీ పిచ్చి వాగుడు? అది నా దృఢ నిర్ణయం" అన్నాడు కుచేలరావు తీక్షణంగా.

పకపక నవ్వేడు సంజయ్. "ఐతే ఆ డబ్బెక్కడుంది? అంత ధనాన్ని మీరీ లంకంత యింట్లో ఒంటరిగా వుంచరన్నది సుస్పష్టం! అందుకే భారతదేశంలోని బ్యాంకులన్నీ క్షుణ్ణంగా చెక్ చెయ్యబడ్డాయి. ఏ ఒక్క బ్యాంకులోనూ మీ పేర ఖాతా గానీ, లాకర్ గానీ లేవు. మరి మీ అరవై లక్షల అపార సంపత్తి ఎక్కడున్నట్టు?

అంతేకాదు. ప్రస్తుతం మీమీద తలకుమించిన అప్పులున్నాయి. ఆరు నెలలుగా కరెంట్ బిల్ కట్టనందుకు మీ ఇంటి ఫ్యూజ్ బోర్డ్ ఊడబెరుక్కుపోయారు. అలాగే టెలిఫోన్ బిల్ చెల్లించనందుకు ఆ లైన్ కూడా కట్ చెయ్యబడింది. అంతకన్నా విచిత్రం ఏమిటంటే పాలవాడికీ, బొగ్గులవాడికీ సైతం మీరు అనేక నెలలనించి డబ్బు చెల్లించడంలేదు. అరవై లక్షల ఆస్తిపరుడికి ఇటువంటి పిల్ల అప్పులా? దీనికి మీ జవాబేమిటి?"

వేదాంతిలా నవ్వేడు కుచేలరావు. "మిస్టర్ సంజయ్! మీ అమోఘమైన తెలివితేటల్ని నేను అభినందించ కుండా ఉండలేకపోతున్నాను. కారణం, దేశంలోని ఏ బ్యాంకులోనూ నాకు ఖాతా లేదన్నమాట నిజం! అలాగే, నామీద చిన్న చిన్న అప్పులు కూడా ఉన్నమాట నిజమే.

అంతమాత్రాన నాదగ్గర అరవైలక్షలు లేకనుపోడం సబబు కాదు. నేనా ధనాన్ని మరెక్కడో గుప్తంగా దాచి ఉండవచ్చు కదా? అలాగే నా అప్పుల విషయం, నా తరవాత అవి అణాపైసలతో సహా చెల్లించబడతాయి. నా విల్లులో ఆ ఏర్పాట్లు జేస్తాను. ఆ అప్పులవాళ్ళు ఊరికే నాపైన అన్నిరోజుల బాకీలు వదిలి ఊరుకోలేదు. ధనవంతులపైన తమ బాకీలు ఉండటం వాళ్ళు గర్వకారణంగా భావిస్తారు."

"ఇటువంటి కల్లిబొల్లి కబుర్లతో మీరీ అతిథుల్ని మభ్యపెట్టడానికి ప్రయత్నిస్తున్నారన్నామాట!"

"మీలాగే వీళ్ళు కూడా అలాగే అనుకుంటే, నిక్షేపంగా ఇక్కణ్ణించి వెళ్ళిపోవచ్చు. నే నెవ్వర్నీ అభ్యంతరపెట్టను. దట్సాల్" అంటూ లేచాడు కుచేలరావు.

వెంగపదం ఆయన్ని తోడ్కొని వెళ్ళిపోయాక, అందరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు.

"మిస్టర్ సంజయ్! పానకంలో పుడకలా మీరు మా వ్యక్తిగత విషయాల్లో తలదూర్చి, కుచేలరావుగారి మన శ్శాంతిని భంగం చేస్తున్నారు. మీరు కేవలం మీ కజిన్ కు తోడుగా యిక్కడికి వచ్చారని మరిచిపోకండి.

ఒకవేళ ఆ ముసలాయనవద్ద దమ్మిడీ లేకుంటే, మా అందరికీ వందరూపాయలనోట్లూ, వెయ్యి రూపాయల

నోట్లూ ఎలా పంపుతాడు? దివాలాకోరు మనిషెవ్వడైనా అలా ఐదువేల ఐదువందల రూపాయలు వృధాజేస్తాడా? ఆయనదగ్గర డబ్బు ఉంది. ఎక్కడో దాచి ఉంది. ఈ వ్యవహారం తేలేవరకూ నే నిక్కణ్ణించి కదలదలచుకో లేదు'' అన్నాడు హరనాథ్ సీరియస్‌గా.

''నేనూ!''

''నేనూ!''

''నేనూ!'' అన్నారందరూ ముక్తకంఠంతో.

# 6

ఆ మర్నాటి సాయంత్రం ఏడు గంటలకు డాక్టర్ ఆనంద్ సంజయ్ గదికి వచ్చి, ''ఈఇంట్లో సరైన కంపెనీ దొరక్క చాలా బోర్‌గా ఉంది నాకు. బైట వెన్నెల కాస్తోంది. అలా తోటలో తిరిగివద్దామా?'' అడిగాడు.

''ఓ. కే! ఉండండి, షీలకూడా వస్తుందేమో కను క్కొస్తాను—'' అంటూ ఆమె గది కెళ్ళి అడిగాడు సంజయ్.

షీల యేదో యింగ్లీష్ నవల చదువుకుంటోంది. అతన్ని వెళ్ళమంది. డాక్టర్ ఆనంద్ వెంట యింట్లోంచి బైటికి వచ్చాడు సంజయ్. బైట నిజంగానే పిండారబోసినట్టు కాస్తోంది వెన్నెల. ఆ వెన్నెల్లో తోటలో ఎన్ని గంటలు గడిపినా తెలిసిరాదు. ఇద్దరూ పచార్లు చేస్తున్నట్టు వెనక తోటలోకి నడిచేరు.

కొద్దిదూరం వెళ్ళారో లేదో, సంజయ్ చటుక్కున డాక్టర్ చెయ్యి నొక్కి ఆపాడు. ఆ హఠాత్సంఘటనకు నివ్వెరబోతూ అతనివైపు చూశాడు ఆనంద్. సంజయ్ మాట్లాడవద్దన్నట్టు సైగజేసి, ఎదురుగా ఉన్న ఓ చెట్టు వైపు సైగ జేశాడు.

చటుక్కున అటు చూసి నోరు తెరిచాడు ఆనంద్.

హరనాథ్, కార్తీకా ఈ లోకాన్ని మైమరచి ఒకరి బాహుబంధాల్లో ఒకరు ఇమిడి తన్మయత్వం అనుభవిస్తున్నారక్కడ! హరనాథ్ ఆమె పెదాలనీ, బుగ్గలనీ తన అధరాలతో స్పృశిస్తూ వీపు వెనక బ్లౌజు హుక్స్ ఊడదీస్తున్నాడు.

"ఓహ్ గాడ్! నో!" ఆ దృశ్యం చూళ్ళేక గట్టిగా కళ్ళుమూసుకున్నాడు ఆనంద్.

"ఇందులో చూడకూడనిదేమీ లేదే? స్త్రీ పురుషులిరువురూ రాసక్రీడలు సల్పడం వింతేమీ కాదే? మీకిలాటివి పడవా?" అడిగాడు సంజయ్ నవ్వుతూ.

ఆనంద్ పలకలేదు. కళ్ళు తెరిచి మళ్ళీ అటు చూశాడు. అప్పటికే కార్తీక బ్లౌజు హుక్స్ ఊడదీశాడు హరనాథ్. అంతే!

"నో, నో! ఆగండి...ఆగండి. తొందరపడకండి" అంటూ అటు పరుగుతీశాడు డాక్టర్ ఆనంద్.

అంతవరకూ ఈ లోకంలో లేని జంట పక్కలో పిడుగులు పడ్డట్టు అదిరిపడి లేచి నిల్చున్నారు. కార్తీక చటుక్కున పైటనిండుగా కప్పుకుని చెట్టుపక్కకి తప్పుకుంది.

భార్యా వియోగుడైన ఆ బ్రహ్మచారి, ఎన్నాళ్ళ తరువాతో లభ్యమైన ఆ సువర్ణావకాశం ఆ విధంగా భగ్నమయ్యేసరికి నిప్పులు కక్కే కళ్ళతో చూశాడు ఆనంద్ వైపు. అతని ఆగ్రహ దృక్కుల్ని తట్టుకోలేక తలవంచుకున్నాడు డాక్టర్.

"అయామ్ వెరీ సారీ మిస్టర్ హరనాథ్! మీరు చేస్తున్నపని అనుచితంగా తోచి, ఆవేశపడ్డాను" అన్నాడు తగ్గు స్వరంతో.

"మీరావేశపడటానికి నేనేమీ రేప్ చెయ్యడంలే దామెను. ఇద్దరం ప్రేమించుకున్నాం. త్వరలో పెళ్ళి చేసుకోబోతున్నాం! తొందర పడ్డామే అనుకోండి. ఇందులో అనుచితం ఏముంది? ఐనా, మా వ్యక్తిగత విషయాల్లో కలగజేసుకుని కలత చెందడానికి మీరెవ్వరు?" అన్నాడు హరనాథ్ తీక్షణంగా.

"ఐనవాణ్ని గనకే యింతగా ఆరాటపడుతున్నాను" అంటూ యింకా ఏదో చెప్పబోయి, మౌనం వహించాడు ఆనంద్.

హరనాథ్ సాలోచనగా తలూపాడు. "ఇప్పుడర్థమైంది. అందమైన కార్తికను పొందడానికి తపించిపోతున్న నీవు, మేమిలా కనిపించేసరికి ఈర్ష్యాసూయలతో దహించుకుపోతున్నావన్నమాట."

"శివ, శివా!" అంటూ చెవులు మూసుకున్నాడు ఆనంద్.

"లేకుంటే నీవింతగా బాధ పడిపోవడానికి ఏమిటి కారణం? మే మిద్దరం ప్రేమించుకోవడం, నీ కిష్టం లేదా?"

"అపచారం! మహాపచారం!"

అంతవరకూ ప్రేక్షకుడిలా నిల్చుని ఆ ఆర్భాటం చూస్తున్న సంజయ్ కలగజేసుకున్నాడు. "మిస్టర్ ఆనంద్! మీరేదో చెప్పడానికి తటపటాయిస్తున్నారు. దాస్తున్నారు. ఏమిటది? చెప్పండి." అన్నాడు అతన్ని సూటిగా చూస్తూ.

డాక్టర్ ఆనంద్ నోరు విప్పడానికి మళ్ళీ వెనకా ముందూ అయి, ఇక విధిలేదన్నట్టు తలెత్తాడు. "కఠిన కఠోరమైన ఆ నిజం మీ ముందు ఎలా బైటపెట్టాలో నా

కరంగావడం లేదు. చెబితే విని తట్టుకోగలరా మీరు? చెప్పకుంటే మానవజాతి యావత్తూ సిగ్గుపడేటటువంటి ఘోరం జరిగిపోవచ్చు.

ముందు నా జీవనరహస్యం చెబుతా వినండి. నా తల్లి ఒక శానిటోరియంలో నర్సుగా పనిచేసేదన్న విషయం మీకు తెలుసుకదా?

ఒకప్పుడు కుచేలరావు జబ్బుపడి ఆ శానిటోరియంలో చేరానని చెప్పాడు కదా? అప్పుడు నా తల్లి ఎంతో ఆత్మీయంగా తనకు సేవలు జేసి, కోలుకోడానికి తోడ్పడిందన్నాడు కదా?

అక్కడే అతను నా తల్లితో ప్రేమపురాణం సాగించాడు. పెళ్ళి చేసుకుంటానని బాసలు జేశాడు. ఆమె అతన్ని నమ్మింది. మనసా వాచా ఆరాధించింది. కుచేలరావు ధనవంతుడు గనక స్పెషల్ వార్డ్‌లో ధనవంతులకు ప్రత్యేకించే రూంలో ఉండేవాడు. మాయ మాటలతో నా తల్లిని వశంజేసుకుని, అక్కడే ఆమెను..." చెప్పటానికి నోరు చెల్లక ఆగిపోయాడు ఆనంద్.

క్షణం తరవాత తలెత్తి—"అలా నా తల్లిని కొంతకాలం ఆటబొమ్మలా వాడుకున్నాడక్కడ. శానిటోరియంనించి డిశ్చార్జయి నెలరోజులు గడిచినా అతన్నించి ఎటువంటి రెస్పాన్స్ లేకపోయేసరికి, ఒకరోజు నా తల్లి స్వయంగా అతనింటికెళ్ళి, పెళ్ళి విషయం కదిపింది.

అదివరకు తానామెను యెరగనట్టే మాట్లాడాడుట. అప్పుడు తెలిసిందామెకు అతని నిజరూపం! నా తల్లి ఆ అవమానాన్నీ, ఆగ్రహాన్నీ భరించలేక అతనితో ఘర్షణపడి, నానా బూతులూ తిట్టి వచ్చేసింది. ఆ తరవాత ఆమె పెళ్ళి అదే శానిటోరియంలో పనిచేసే ఒక కంపౌండర్‌తో జరిగిపోయింది.

ఆమె చనిపోతూ చివరి ఘడియల్లో నాకు చెప్పిన కథనం ఇది. అందుకు బలీయమైన కారణం లేకపోలేదు. ఏరోజైతే ఆమె కుచేలరావు యింటికెళ్ళి తనని పెళ్ళి చేసుకోమని ప్రాధేయపడిందో, అప్పటికే అతని ప్రతి రూపం ఆమెలో రూపు దాల్చిందట.

పెళ్ళైన తరవాత ఆమె ఓ మగపిల్లాణ్ని కన్నది. ఆ పిల్లాడు ఎవ్వరో కాదు. నేనే!" డాక్టర్ ఆనంద్ నోటి నించి వెలువడ్డ ఆ వాక్యం ఆ ముగ్గుర్నీ దిగ్భ్రాంతిలో ముంచెత్తింది.

"నేనే కాదు. ఇక్కడికి పిలిపించబడ్డ అతిథులంతా ఆయన అక్రమ సంతానమేనని నా అనుమానం! యవ్వనంలో ఆయన స్త్రీలోలుడై ఉంటాడు. పరిచయమైన ప్రతి ఆడదాన్నీ మాయమాటలతో వశం చేసుకుని, అవసరం తీరాక వంచించి ఉంటాడు. అందుకే ఆ కుటుంబాలతో విరోధం తెచ్చుకున్నాడు. ఈ చివరిదశలో తనకు వారసు లెవ్వరూ మిగల్లేదు గనక, తన అక్రమ సంతానమైన మేము జ్ఞాపకం వచ్చివుంటాం!

కనీసం ఈ విధంగానైనా మాకు మేలు జేసి, తన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసుకోవాలనుకున్నాడేమో! ఇప్పు డర్థమైందా హరనాథ్! మీ యిద్దరి విషయంలో నేనెందుకింత ఆరాటపడ్డానో? అజ్ఞానంలో పడి మీ రెటువంటి పాపానికి ఒడిగట్టబోయారో? ఒక విధంగా కార్తీక నీకు వరసకు చెల్లెలవుతుంది!" డాక్టర్ మాటలకు కార్తీక ఒక్కసారి గావుకేక పెట్టి, వెక్కి వెక్కి ఏడుస్తూ అక్కణ్నించి పరుగుతీసింది.

హరనాథ్ మొహంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు!

ఆ మర్నాటి ఉదయం అందరూ బ్రేక్ ఫాస్ట్ ముగించుకుని, హాల్లో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

రాత్రి జరిగిన సంఘటనతో కార్తీక, వాళ్ళ ఎదుటపడటానికి సిగ్గుపడి తన గదిలోనే గడుపుతోంది. బ్రేక్ ఫాస్ట్ కూడా పైకే తెప్పించుకుంది.

అంతలో బైట కారాగిన చప్పుడు విని అందరూ ద్వారంవైపు చూశారు.

చేతిలో ఫైళ్ళు పట్టుకొని, ఓ వ్యక్తి లోపలికి వచ్చాడు.

అతన్ని చూడగానే, "లాయర్ శాంతిప్రకాశ్ గారొచ్చారు" అంటూ గబ గబ కుచేలరావు గదివైపు వెళ్ళాడు వెంగపదం.

అందరి దృష్టి లాయర్ మీద నిలిచింది. నలభైఏళ్లుంటాయతనికి. చామనచాయ. కణతలదగ్గర నెరసిన జుత్తు. కళ్ళకి అద్దాలు. అతనుకూడా అందరివైపు ఒకసారి దృష్టి సారించి, చిరునవ్వు నవ్వుతూ కుచేలరావు గదిలోకి నడిచాడు.

రెండు నిమిషాల తరవాత వెంగపదం హాల్లోకి వచ్చి, "బాబుగారు అందర్నీ లోపలికి రమ్మంటున్నారు" అన్నాడు.

అంతా లేచి ఆయన గదిలోకెళ్ళారు.

"ఫ్రెండ్స్! నా ఫామిలీ లాయర్ శాంతిప్రకాశని చెప్పానే. ఈయనే! మద్రాసులో ప్రాక్టీస్ చేస్తున్నాడు. నేను చెప్పిన వివరాల ఆధారంగా మీయందరి గురించీ ఆరాతీసింది కూడా ఈయనే!

నా నిర్ణయం ప్రకటించడానికి మిమ్మల్ని పదిహేను

రోజులిక్కడ అగమన్నాను కదా? ఇప్పుడా ఉద్దేశం మార్చుకున్నాను.''

—అని కుచేలరావు చుట్టూ ఓసారి కలయజూసి, ''ఇప్పటికే మీరంతా ఇక్కడ విసుగెత్తి ఉంటారు. ఇక నేను మీ ఓర్పుని పరీక్షించదలచుకోలేదు. అందుకే, శాంతి ప్రకాశ్‌తో సంప్రదించి నా ఆస్తికి వారసుల్ని నిర్ణయించాను'' అన్నాడు.

అందరూ ఊపిరి బిగబట్టి, ఆయన యేం చెబుతాడో వినాలని చెవులు రిక్కించారు.

''నా మరణానంతరం అరవైలక్షలు విలువజేసే నా ఆస్తిని మీ అందరికీ సమానంగా, అంటే ఒక్కొక్కరికి పది లక్షల చొప్పున పంచుతున్నాను'' కుచేలరావు నోటి నించి వెలువడ్డ ఆ వాక్యాలు అందరి హృదయాలమీదా తేనెజల్లులు కురిపించాయి.

నాగు పాము బుసలు కొట్టినట్టు నిట్టూర్చారు తేలిగ్గా.

''ఐతే, ఇందులో కొన్ని షరతులున్నాయి. నిజానికి నేను పిలవదలచుకున్న వ్యక్తులు ఏడుగురు. అందులో ఒకతను కాలచక్రంలో కలసిపోయాడు. మరొకరి గురించి ఇంకా ఆచూకీ తెలియలేదు. అతని పేరు లక్ష్మీపతి. అతనితో కలిపి వారసుల సంఖ్య ఆరవుతుంది.

నా మరణానంతరం నెలరోజుల్లోగా అతని ఆచూకీ తెలిస్తే మిగతావాళ్ళతోబాటు అతనికీ పదిలక్షలు చెందుతాయి. నెలరోజులు దాటాక, నా ఆస్తితో యెటువంటి సంబంధం వుండదు. అతనికి చెందవలసిన ఆ పదిలక్షలూ మీ ఐదుగురికీ సమానంగా పంచబడతాయి. అంటే, అతను రాని పక్షంలో మీ ఐదుగురికీ అదనంగా మరో చెరి రెండు లక్షలు చెందుతాయన్నమాట.

పోతే, ఈ ఇల్లు వెంగపదం పేర రాస్తున్నాను. కారణం, వాడు పదేళ్ళనించీ రాత్రీ పగలూ అనక నాకు సేవలు చేస్తున్నాడు. వాడి నిస్వార్థ సేవలకు ఋణం తీర్చుకోవడం నా కనీస ధర్మం!”

“మరి మీ అప్పుల సంగతేమిటి?” మధ్యలో అందు కున్నాడు సంజయ్.

కుచేలరావు నవ్వి- “చెరి పన్నెండులక్షలు పుచ్చు కునే ఈ ఐదుగురు వారసులు నా కొద్దిపాటి అప్పులు కూడా తీర్చలేరా? ఆల్ రైట్! లాయర్ కాంతిప్రకాశ్ ఈ ఇంట్లోని సామానంతా అమ్మేసి ఆ అప్పులు తీర్చే స్తాడు లెండి. మీ కెందుకు శ్రమ” అంటూ అతనివైపు తిరిగి, “వీలునామా సిద్ధం జేశావా?” అడిగాడు.

కాంతిప్రకాశ్ తలూపి, ఫైల్లోంచి అరతావు సైజు కాగితాలు తీశాడు. “వీళ్ళందరి సమక్షంలో సంతకం జేస్తా నిలా ఇవ్వు. సాక్ష్యుల స్థానంలో సంజయ్, సత్య వతీ సంతకాలు జేస్తారు. వీరికి ఆ సిరితో ఎటువంటి సంబంధం లేదుకదా!” అన్నాడు కుచేలరావు చెయ్యి జాపుతూ.

కాంతిప్రకాశ్ వీలునామాను ఫైలు మీదుంచి, పెన్ను ఆయన కందించాడు.

ఆయన సంతకం పూర్తయ్యాక. సాక్ష్యులస్థానంలో సంజయ్, సత్యవతీ సంతకాలు పెట్టారు.

“వీలునామా ఎలాగూ రాసేశారు కదా? ఇక అరవై లక్షల ధనరాశిని ఎక్కడ దాచిపెట్టారో కూడా చెప్పేస్తే బావుంటుందని నా అభిప్రాయం!” అన్నాడు సంజయ్ కుతూహలం అపుకోలేక.

కుచేలరావు నవ్వి— “సమయం వచ్చినప్పుడు అది కూడా తెలుస్తుంది లెండి. ఆ రహస్యాన్ని నే నిప్పు

దప్పుదే బెట్టపెట్టదలచుకోలేదు. అది నాకు తప్ప మరెవ్వరికీ తెలీదు. లాయర్ శాంతిప్రకాశ్ కూడా!

ఇక వీలునామా తయారయింది కనక, మీరంతా వెళ్ళిపోదలచుకుంటే వెళ్ళడానికి నాకేం అభ్యంతరం లేదు. ఉండాలనుకున్నా ఆక్షేపణలేదు. ఎందుకైనా మంచిది. మరో పదిరోజులాగి చూడండి. నేను శాస్త్ర మూడిప్ని. ఆ నిధి రహస్యం మీతో చెప్పాలని నాకు ఏక్షణంలోనైనా తట్టవచ్చు..." అంటూ లేచాడు.

శాంతిప్రకాశ్, వెంగపదం ఆయన్ని నడిపించుకుంటూ లోపలికి తీసికెళ్ళారు.

అతిథులందరి కళ్ళల్లోనూ తృప్తీ, ఆనందం వెల్లి విరుస్తున్నాయి.

లేచి ఎవ్వరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

ఆ సాయంత్రం అలా ఇంటిబైట పచార్లుజేసి వద్దామని గదిలోంచి బైటికివచ్చిన సంజయ్‌కు ఎన్నడూ లేనిది వెంగపదం ఈరోజు టిప్‌టాప్‌గా తయారయి ఎక్కడికో వెళుతూ ఎదురయ్యాడు.

"పెళ్ళికొడుకులా తయారయ్యావు! ఎక్కడికీ ప్రయాణం?" అడిగాడు సంజయ్.

వెంగపదం నవ్వి- "అయ్యగారు వారాని కొక్కసారి నాకు సెలవిస్తారు. ఆదివారమంతా వంగతూర్‌లో గడిపి వస్తుంటాను. ఈరోజు శనివారం గదా? వెళ్ళిపోతున్నాను. రేపు సాయంత్రానికల్లా వచ్చేస్తాను. అంత వరకూ మీ అవసరాలన్నీ ముసలి తోటమాలి చూసుకుంటాడు. వస్తాను" అంటూ ముందుకు సాగిపోయాడు.

ఆ ఇంట్లో వెంగపదంగాక, తోటమాలీ, వంటమనిషీ పనిజేస్తున్నారు. వాళ్ళిద్దరూ భార్యాభర్తలు గనక తోట చివర గుడిసెలో ఉంటారు.

ఆ రాత్రి భోజనాలయ్యాక, షీల సంజయ్ గదిలోకి వచ్చి- "కుచేలరావు వీలునామా రాసేశాడు కదా? ఇంకా మనమిక్కడుండి ఏం చెయ్యాలి? నాకు చచ్చే బోర్‌గా ఉంది. మద్రాసు వెళ్ళిపోదాం!" అంది.

సంజయ్ కాసేపు ఆలోచించి, "ఆల్ రైట్ ! రేపొక్కరోజుండి, వెళ్ళిపోదాం! నాకు నిదర ముంచు కొస్తోంది. వెళ్ళిపడుకో" అన్నాడు.

షీల వెళ్ళగానే గది తలుపుమూసి, లైటార్పి పక్క మీద వాలాడు సంజయ్.

# 8

అర్ధరాత్రి ఆ నిశ్శబ్ద నిశీధిని చీల్చుకుంటూ గుండెలదిరేలా గావుకేక వినిపించి, సంజయ్ త్రుళ్ళిపడి లేచాడు. ఎక్కడో, ఎవ్వరో సన్నగా మూలుగుతున్న సవ్వడి.

దిండుకిందినించి టార్చితీసి, ఒక్క వుదుటున మంచం దిగి, తలుపువైపు ఉరికాడు. నడవాలో అడుగుపెట్టి చుట్టూ కలయజూశాడు.

అప్పటికే ఒకొక్క గది తలుపు తెరుచుకుని ఖంగారుగా బైటికి వస్తున్నారు మిగితావాళ్ళు.

"ఏమిటా గావుకేక?"

"ఎక్కణ్నించి వచ్చింది?"

"పదండి. కిందికెళ్ళి చూద్దాం!" అంటూ మెట్లవైపు పరుగు తీశాడు సంజయ్. కుచేలరావు గదిముందు తలుపు దగ్గర మంచముంది. ఆ మంచంమీద బోర్లా పడుందో ఆకారం! పరుపంతా రక్తసిక్తం!! టార్చి వెలుగు ఆ ఆకారంమీద వేసి ఉలిక్కిపడ్డాడు సంజయ్.

అతను శాంతిప్రకాశ్! లాయర్ శాంతిప్రకాశ్!! అతని వీపులో కత్తి!!! సడన్‌గా కుచేలరావు జ్ఞాపకం

వచ్చి, ఆయన గదిలోకి పరుగుతీశాడు సంజయ్.

అక్కడ కనిపించిన దృశ్యం అతన్ని రాతిబొమ్మను జేసింది. మంచంమీద వెల్లకిలా పడున్నాడు షచేల రావు. కళ్ళు రెండూ తెరిచి ఉన్నాయి. నాలిక బైటికి వచ్చి ఉంది. కంఠం చుట్టూ పొడవాటి చేతిరుమాలు గట్టిగా బిగదీసి ఉంది!

"ఠంగ్!" మన్న శబ్దంతో త్ర్రుళ్ళిపడ్డాడు సంజయ్.

గోడ గడియారం కొట్టిన ఒంటిగంట అది!

అంతలో మిగతావాళ్ళుకూడా వచ్చారు లోపలికి.

"గుడ్ న్యూస్ మిస్టర్ సంజయ్! లాయర్ శాంతి ప్రకాశ్ చావలేదు. కొన ఊపిరితో ఉన్నాడు. కత్తి మీది వేలిముద్రలు చెరక్కుండా లాగేసి, గాయానికి కట్టుకట్టి ఇంజక్షన్ ఇచ్చాను" అన్నాడు డాక్టర్ ఆనంద్.

"థాంక్ గాడ్! అతను కోలుకున్నాక, హంతకుడి ఆనవాళ్ళయినా చెప్పగలడేమో కనుక్కోవాలి. హరనాథ్! మీరు నా కార్లో వంగత్తూర్ వెళ్ళి, వెంటనే పోలీసుల్ని పిల్చుకురండి" అంటూ కారు తాళం చెవులు తీసి అతని కందించాడు సంజయ్.

అందరి ముఖాల్లోనూ భయం, ఆరాటం నాట్యం జేస్తున్నాయి.

సంజయ్ ఒకొక్కర్నీ పరీక్షగా చూసి, "మనం ఇక్కడికి వచ్చిన తొలిరోజుకూడా షచేలరావుని చంపడానికి ప్రయత్నం జరిగింది. హంతకుడి దురదృష్టవశాత్తు ఆయన చావలేదు. ఐతే, ఆ హత్య ప్రయత్నానికీ, ఈ హత్యకూ పరిస్థితుల దృష్ట్యా చాలా తేడా ఉంది.

అప్పుడు కుచేలరావింకా, వీలునామా రాయలేదు. ఆ ఆస్తికి ఎవ్వర్ని వారసులుగా నిర్ణయిస్తాడో కూడా తెలీదు. దీన్నిబట్టి, ఆ హత్యా ప్రయత్నం ఆ ఆస్తికోసం జరగలేదనీ, కేవలం పగా, ద్వేషం, కక్షల కారణంగానే జరిగి ఉంటుందనీ అనుకోవచ్చు.

ఈ హత్య అలా కాకుండా, ఆ ఆస్తిని త్వరగా కాజేద్దామనే ఉద్దేశంతో జరిగి ఉంటుందని నా అభిప్రాయం! ఐతే, ఇక్కడ మళ్ళీ ఓ ధర్మసందేహం తలెత్తుతుంది.

కుచేలరావు తన సంపత్తిని ఎక్కడ దాచాడో ఇంకా చెప్పలేదు. ఆ రహస్యం తనకి తప్ప మరెవ్వరికీ తెలీదన్నాడు. దాని గురించి తెలియనప్పుడు హంతకుడు ఏ ఉద్దేశంతో ఈ హత్య చేసినట్టు?

దీనికి జవాబు ఆ రహస్యం గురించి హంతకుడికి తెలిసిందేమోనని? లేదా, ఆ నిధి ఎక్కడ దాచబడిందో తనకు తాను పరిశోధించి కనిపెట్టి ఉండాలి. అతని ఆస్తికి వారసులైన ఐదుగురూ హత్యా సమయంలో ఇక్కడే ఉన్నారు గనక, మీరంతా అనుమానితులే అవుతారు.

లాయర్ శాంతిప్రకాశ్‌ను పొడిచిన కత్తితోనే, హంతకుడు కుచేలరావుని చంపటానికి వచ్చుంటాడు. చీకట్లో పొరపాటున హంతకుడి కాలు గదిముందు పడుకున్న శాంతిప్రకాశ్ మంచానికి తగిలి ఉంటుంది. ఆ కుదుపుకు అతను లేచి ఉంటాడు. దాంతో హంతకుడు ఖంగారుపడి ఆ కత్తితోనే అతన్ని పొడిచి వుంటాడు. తరవాత గదిలోకి దూరి, చేతి రుమాలుతో కుచేలరావు కుత్తిక బిగదీసి చంపి ఉంటాడు...'' సంజయ్ మాట ఇంకా పూర్తికాలేదు.

అంతలో, హరనాథ్ వెంట హడావుడిగా ఇంట్లోకి ప్రవేశించారు పోలీసులు.

ప్రాథమిక పరిశీలన పూర్తయ్యాక, చిన్నగా నవ్వాడు ఇన్‌స్పెక్టర్. "ఆనాడు తనకు పోలీసుల సహాయం అక్కర్లేదని డాంబికాలు పలికాడే ముసలాడు? ఇప్పుడేమయింది? ఆరోజే మా సహాయం కోరిఉంటే, ఈనాడీ అనర్థం జరిగేదా? ఎవరి ఖర్మకెవరేం జేస్తారండి!" అంటూ అందర్నీ ఓమారు కలయజూసి—

"కేసు ముగిసేవరకూ మీరంతా ప్రస్తుతం అనుమానితుల కిందే జమకట్టబడతారు. అందర్నీ విడివిడిగా ప్రశ్నించక తప్పదు. రాత్రి పన్నెండూ ఒంటిగంట మధ్య మీరెక్కడున్నారు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ నారాయణ వర్మని చూస్తూ.

"నా గదిలోనే ఉన్నాను!"

"అబద్ధం! వీళ్ళగది నా గది పక్కనే ఉంది. రాత్రి పన్నెండు గంటలవరకూ ఈ భార్యాభర్తలిద్దరూ ఏ విషయంమీదో చాలాసేపు వాదించుకున్నారు. తరవాత తలుపు తెరిచిన శబ్దం వినిపించింది..." అన్నాడు డాక్టర్ ఆనంద్ మధ్యలో.

ఇన్‌స్పెక్టర్ తీక్షణంగా చూశాడు నారాయణ వర్మను. "దీనికి మీ జవాబేమిటి?"

"న్...నిజమే! నా భార్య చీటికీ మాటికీ నాతో ఘర్షణ పడుతూంటుంది. వీలునామా తయారయింది గనక ఇహ ఇక్కణ్ణించి వెళ్ళిపోదామని నేనూ, ఇంకొన్నాళ్ళుందామని ఆమే వాదించుకున్నాం! నాకు విసుగెత్తి, వెన్నెల్లో కాస్త పచార్లుజేసి వద్దామని బైటికెళ్ళాను."

"తిరిగి ఎప్పుడొచ్చారు?"

"పన్నెండున్నరయింటుంది. అప్పుడు నేనింకా మేల్కొనే ఉన్నాను" అంది సత్యవతి.

ఇన్‌స్పెక్టర్ సాలోచనగా తలూపి, మిగతా వాళ్ళను కూడా ప్రశ్నలు వేసి, సమాధానాలు నోట్ చేసుకుని, "ఆల్ రైట్! నా అనుమతి లేనిదే మీలో ఎవ్వరూ ఇక్కణ్నించి కదలకూడదు" అన్నాడు హెచ్చరిస్తూ.

"వీళ్ళతోబాటు మరో వ్యక్తిని మరిచిపోతున్నారు ఇన్‌స్పెక్టర్" అన్నాడు సంజయ్.

ఇన్‌స్పెక్టర్ కనుబొమలు ముడిపడ్డాయి, "ఎవ్వరు?"

"వెంగపదం!"

"ఎక్కడున్నాడు వాడు?"

"ఒకరోజు సెలవుమీద వంగత్తూర్ వెళ్ళాడు!"

ఇన్‌స్పెక్టర్ సాలోచనగా తలూపి, "వాడి సంగతి తరువాత చూస్తాను" అంటూ శాంతిప్రకాశ్‌ను పొడిచిన కత్తినీ, కుచేలరావు శవాన్నీ సిబ్బంది ద్వారా అంబులెన్స్‌లో చేర్చి తీసికెళ్ళాడు.

అతిథుల కళ్ళలోంచి నిదర ఎప్పుడో మటుమాయమైంది. వేకువజామువరకూ అలాగే కూర్చుని తమలో తాము తర్జనభర్జన పడసాగారు. ఉదయం ఎనిమిది గంటలకు స్పృహలోకి వచ్చాడు శాంతిప్రకాశ్. అందరూ అతనిచుట్టూ మూగారు. సంజయ్ ఊహే నిజమైంది!

చీకట్లో ఎవ్వరో మంచానికి తగిలినట్టయి, అతని నిద్ర మేల్కొందిట. బోర్లాపడుకున్నవాడల్లా ఉలిక్కిపడి లేవబోయాడట. అప్పుడు దిగబడిందట పదునైన వస్తువు వీపులో. గావుకేక పెట్టి అలాగే ఒరిగిపోయాడట.

చీకటిపడే వేళకి యిల్లుజేరాడు వెంగపదం!

కుచేలరావు హత్యా వార్తను విని కొయ్యబారి పోయాడు.

"రాత్రంతా నువ్వెక్కడున్నావ్?" అడిగాడు సంజయ్ అతన్ని.

జవాబివ్వడానికి తటపటాయించాడు వెంగపదం.

"పలకవేం?" గద్దించాడు సంజయ్.

వెంగపదం తల వంచుకుని, "చెప్పడానికి నాకేం అభ్యంతరం లేదుగానీ, విని మీరు నన్నసహ్యించుకోవచ్చు. ఇక్కణ్నించి వెళ్ళగానే, సారాకొట్లో ఓ సుక్కేసుకుని సానికొంపలో తొంగున్నాను. పెళ్ళీపెటాకులూ లేనివాణ్ని. తప్పా? కావాలంటే దాన్నడిగి తెలుసుకోండి" అన్నాడు.

"డబ్బుకోసం ఒళ్ళమ్ముకు బ్రతికే ఆడదాని సాక్ష్యం నిజమేనని ఏమిటి నమ్మకం? సరే కుచేలరావెలాగూ ఇప్పుడీ లోకంలో లేడుగనుక ప్రస్తుతం శాంతిప్రకాశ్ బాగోగులు చూడటం నీ డ్యూటీ" అన్నాడు సంజయ్ మేడ మెట్లెక్కుతూ.

# 9

శాంతిప్రకాశ్ కోలుకోవడానికి రెండు రోజులు పట్టింది.

ఆ రోజతను అందర్నీ సమావేశపర్చి—"ఆనాడు కుచేలరావు నాచేత రాయించిన వీలునామా మీ అందరికీ చదివి వినిపించదలచాను" అంటూ బ్రీఫ్‌కేస్ తెరిచి వీలునామా తీశాడు.

అందులో ఏముందో దాదాపు అందరికీ తెలిసిందే! తెలియనిదల్లా ఆ డబ్బు యెక్కడున్నదని? బహుశా, వీలునామాలో దాని ప్రస్తావనుందేమో వినాలని అందరి చెవులూ నిక్కబొడుచుకున్నాయి.

శాంతిప్రకాశ్ బిగ్గరగా చదివి వినిపించాడు వీలునామా!—

రెండురోజుల క్రితం కుచేలరావు చెప్పినవే ఉన్నా యందులో. డబ్బు ప్రస్తావన ఎక్కడా లేదు!

"అంతా బాగానే ఉందిగానీ, డబ్బు ఎక్కడుందో తెలియనప్పుడు ఈ వీలునామావల్ల ఏమిటి ప్రయోజనం?" అన్నాడు సంజయ్ మొహం చిట్లిస్తూ.

శాంతిప్రకాశ్ పెదవి విరిచి_"ఆ మహాతను డెవ్వరో గానీ, చాలా తొందరపడ్డాడు. కనీసం ఆయన డబ్బు రహస్యం చెప్పేవరకైనా ఆగివుంటే, మనకీ ఉత్కంఠ వుండేదికాదు. ఆయన మరణంవల్ల మీతోపాటు నేనూ నష్టపోయాను.

కుచేలరావు తన పనులు చేసిపెట్టడానికి నాతో ఓ కంట్రాక్టు కుదుర్చుకున్నాడు. ఆయన అకాల మరణంతో నా కంట్రాక్టు మూల్యంకూడా మునిగిపోయింది. ఇప్పుడు నా ప్రతిఫలాన్ని యెవ్వరిదగ్గర తీసుకోను? అంతేగాక, ఆయన అప్పులు తీర్చే భారంకూడా నా నెత్తినవుంది" అన్నాడు విచారంగా.

"అప్పులన్నీ కలిపి ఎంతుంటాయి?"

"దాదాపు ఇరవై వేలు!"

"ఆ మాత్రం యింట్లో సామానమ్మి తీర్చవచ్చు లెండి —"

"మనకా సామానుతోనూ, అప్పులతోనూ నిమిత్తం లేదు. అవతల పనులన్నీ మూల పడేసి, ఎన్నో మైళ్ళ దూరంనించి వచ్చిపడ్డామిక్కడ. ఆ ముసలాడా డబ్బె క్కడ దాచాడో తెలీదు. ఇన్ని అవస్థలూపడి, వట్టి చేతులతో వెనక్కి వెళ్ళడానికి నేనొప్పుకోను. ముందా

డబ్బెక్కడుందో కనుక్కోవాలి మనం!'' అంది నారాయణవర్మ భార్య సత్యవతి నిక్కచ్చిగా.

అంతా ఆమెకు వంతపాడారు!

సంజయ్ సాలోచనగా తలూపి, "ఔను! ఈ భవనం అతి పురాతనమైనది. పాతకాల కట్టడాల్లో ముందు జాగ్రత్తకోసం అనేక రహస్య ప్రదేశాలూ, సొరంగ మార్గాలూ నిర్మించబడేవి. బహుశా, ఈ ఇంట్లోనూ అటువంటివేవో ఉన్నాయేమో? ప్రయత్నిద్దాం!'' అన్నాడు.

ఆ రోజు మొదలు రెండు రోజులవరకూ అందరూ నిద్రాహారాలు మాని, ఆ ఇంటిని పెళ్ళగించినట్టు అంగుళం వదలకుండా గాలించడం ప్రారంభించారు. గోడలనూ, నేలనూ దాటించి, అక్కడ రహస్య అరలేవైనా ఉన్నాయేమో కనుక్కోడానికి శతవిధాలా ప్రయత్నించ సాగారు.

చిట్టచివరికి వాళ్ళ ప్రయత్నం ఫలించింది. స్టోర్ రూం నేలలో ఓ రహస్య గృహం ఉన్నట్టు కనుగొన్నారు. అది కనిపించకుండా పైన వెడల్పాటి బండ పరిచి ఉంది. గునపంతో ఆ బండ ఎత్తిచూస్తే, మెట్లు కనిపించాయి.

అందరూ తలో టార్చి అందుకుని, మెట్లగుండా లోపలికి దిగారు. ఒకే ఒక గదికట్టి ఉందక్కడ. అందులో పనికిరాని సామానంతా నింపిఉంది. ఒక్కొక్క సామాను వెలికి తీస్తూ జాగ్రత్తగా పరిశీలించారు.

వాళ్ళకు కావలసినదేమీ లేదక్కడ!

"నేలలో పాతేసి ఉందేమో?'' సందేహం వెలిబుచ్చింది సత్యవతి చెమట్లు కక్కుతూ.

"ఎందుకైనా మంచిది. తవ్వి చూస్తే సరి!'' అన్నాడామె భర్త.

సాధ్యమైనంత త్వరగా యీ యింట్లోని సామాను వేలం వేసి వాళ్ళ పీడ విరగడ చేసుకోవాలని నిశ్చయించాను. ఈ రోజే ఊళ్ళో దండోరా వేయిస్తాను, రేపిక్కడ వేలంపాట సాగుతుందని. న్యూస్ పేపర్లోనూ ప్రకటన వేయిస్తాను. వేలం సమయంలో పోలీసుల్ని కూడా పిలిపించడం మంచిది'' అన్నాడు.

అందరూ బుర్రలూపారు మౌనంగా.

రెండవరోజు ఉదయమే ఆ వేలంలో పాల్గొనడానికి పెద్ద సంఖ్యలో రాసాగారు జనం. వంగతూర్ నించి పోలీస్ ఇన్స్పెక్టర్ కూడా వచ్చాడు. నలుగురు కానిస్టేబుళ్ళతో, పది గంటల ప్రాంతంలో ప్రారంభమైంది పాట!

వేలం పాటతను ఓ ఇత్తడి పూసజ్జె ఎత్తి, ''ముందు దీనితో ప్రారంభిస్తాను. పాట మొదలుపెట్టండి!'' అన్నాడు.

''నాలుగు రూపాయలు.''

''ఐదు.''

''ఆరు.''

పది రూపాయలవరకూ వచ్చి ఆగిపోయింది పాట.

వేలం వాడు ఒకటీ, రెండూ, మూడూ అనేంతలో, పొట్టిగా, నరచగా ఉన్న ఓ వ్యక్తి పాట పన్నెండు రూపాయలకు పెంచాడు. పూలసజ్జె అతని పరమైంది.

రెండు గంటల్లోపల అటువంటివే పదిహేను చిన్న చిన్న వస్తువులు వేలం వెయ్యబడ్డాయి. అందులో పూల సజ్జెలూ, ఇత్తడి బొమ్మలూ, గంటలూ, కుర్చీలూ కూడా ఉన్నాయి. అన్నీ ఆ పొట్టివ్యక్తే స్వంతం చేసుకున్నాడు.

అందరూ అష్టకష్టాలూపడి, అక్కడి సామానంతా పైన స్టోర్ రూంలోకిజేర్చి, నేల తవ్వడం ప్రారంభించారు, వంతులవారీగా. నేలతోబాటు వాళ్ళ ఒళ్ళు గుల్లయిందిగానీ దుర్భిణీపెట్టి వెదికినా నిధి మాత్రం కాన రాలేదు.

నిరాశా, నిస్పృహలతో అందరి గుండెలూ కుంచించుక పోయాయి!

"డబ్బు ఇక్కడే ఎక్కడో దాచిఉంది. ఇందులో సందేహంలేదు. దురదృష్టవసాత్తూ అది మన కంటికి కనిపించడంలేదు. ఇల్లెల్లె క్షుణ్ణంగా గాలించాం! ఇంకా తోట మిగిలి ఉందని మర్చిపోవద్దు. కుచేలరావు తోటలోనే ఏదో ఒక నిర్ణీత ప్రదేశం ఎన్నుకుని డబ్బు దాచి ఉండవచ్చు కదా?" అన్నాడు హరనాథ్.

"ఓరి దేవుడోయ్! ఇహ నావల్లకాదు. ఆ డబ్బు సంగతి దేవుడెరుగు. రెండ్రోజుల్నుంచీ తిండీ, నిద్రాలేక దుక్కలాటిదాన్ని కాస్తా మామిడి పిక్కలా తయారయ్యాను. ఆ ఇన్ స్పెక్టర్ ఎప్పుడు పొమ్మంటాడోగానీ, ఇహ ఒక్కక్షణంకూడా ఇక్కడుండను ఈశ్వరోయ్!" అంది సత్యవతి ఆయాసపడుతూ.

# 10

మర్నాడు ఉదయం లాయర్ శాంతిప్రకాశ్ అందర్నీ హాల్లో సమావేశపర్చి, "డబ్బుకోసం మనం చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. అవతల అప్పులవాళ్ళు నా ప్రాణం తీస్తున్నారు. ఇంకొన్నాళ్ళిలాగే దాటవేస్తే ఓరోజు నా కాళ్లూ, కీళ్ళూ ఊడలాక్కుపోయేట్టున్నారు.

అతని టెక్నిక్ ఏమిటంటే వేలంవాడు ఒకటీ రెండూ, మూడూ అనేంతలో పాటపెంచి, వస్తువు కైవసం చేసు కుంటాడు.

వేలంవాడు పదహారవ వస్తువు పాటకు పెట్టబోయేం తలో ఓ చెవర్లెట్ కారువచ్చి ఆగిందక్కడ.

అందులోంచి ఓ నలభైఏళ్ళ వ్యక్తి దిగి, "ఆపండి ఈ వేలాన్ని!" అన్నాడు దాదాపు అరుస్తూ.

అందరూ దిగ్భ్రాంతితో అతనివైపు చూశారు.

"ఎందుకు ఆపాలి? ఎవరు మీరు?" అడిగాడు పోలీస్ ఇన్‌స్పెక్టర్.

"నేను బిల్డింగ్స్ కంట్రాక్టర్ని! నా పేరు శివసుందరం! కుచేలరావుగారు రెండేళ్ళ క్రితం ఈ బిల్డింగ్ మరమ్మ త్తుల పని నా కప్పగించారు. పని పూర్తయ్యాక, నాపైకం పూర్తిగా చెల్లించలేదు. ఇంకా ఐదువేలు బాకీవున్నారు" అన్నాడతను.

"ఆయన మీకు బాకీ ఉన్నట్టు ఏమిటి ఋజువు?"

"ఉన్నాయి!" అంటూ కోటు జేబులోంచి కొన్ని కాగితాలు తీసి, "చూడండి. ఆయన నాతో కుదుర్చు కున్న కాంట్రాక్టుఫారం! బిల్లులు!" అన్నాడతను.

"ఈ బిల్డింగ్‌లో మరమ్మత్తులేవీ జరిగినట్టు కని పించవే?" అడిగాడు సంజయ్ ఆశ్చర్యంగా.

"అవి మైనర్ మరమ్మత్తులు కావు. మేడమీద అద నంగా కొన్ని గాడర్లు వేయించారు! కుచేలరావుకెందుకో రెండవ అంతస్తు బరువును కప్పూ, గోడలూ భరించలే వేమోనని భయం కలిగింది. అందుకే ఆ యేర్పాట్లు చేయిం చారు. నా కాంట్రాక్టు మొత్తం పన్నెండువేలది. అందులో

ఏడువేలిచ్చి మిగతా ఐదువేలు తరవాతిస్తానన్నారు.''

''ఆయన మీ డబ్బు పూర్తిగా చెల్లించలేదని ఏమిటి ఆధారాలు?''

''ఒకవేళ డబ్బు పూర్తిగా చెల్లించిఉంటే, నేనిచ్చిన రసీదులు ఆయనదగ్గరుండాలిగా?''

''ఔను. రసీదులన్నీ నాదగ్గరే ఉన్నాయి. చూస్తానుండండి,'' అంటూ బ్రీఫ్ కేస్ తెరిచాడు లాయర్ శాంతిప్రకాశ్.

కాసేపు అందులోని కాగితాలు పరిశీలించాక, శివసుందరం రాసిచ్చిన ఏడువేల రసీదు దొరికిందతనికి. దాంతో ఉచేలరావు శివసుందరానికి ఐదువేలు బాకీ ఉన్నట్టు ధృవపడింది.

శాంతిప్రకాశ్ మొహంలో విచారరేఖలు అలుముకున్నాయి. ''ముందే ఇరవైవేల అప్పులతో తంటాలు పడుతోంటే, మధ్యలో ఇదో లంపలాటం దాపురించింది నా ప్రాణానికి. ఈ సామాను అంత విలువజెయ్యదు అమ్మి తీర్చడానికి.''

''ఐతే. ఏకంగా ఇల్లే వేలం వెయ్యడం మంచిది.'' సలహా ఇచ్చాడు సంజయ్.

''అదెలా? ఇల్లు వెంకపదం పేర ఉంది కదా?''

''ఇంత పెద్ద ఇల్లు వాడేం చేసుకుంటాడు? ఇల్లమ్మేక, అప్పులుపోను మిగిలిన డబ్బు వాడి చేతిలో పెడితే సరి!''

మధ్యలో నిలిపిన వేలం ప్రారంభమైంది మళ్ళీ. అర గంటలోనే నాలుగు వస్తువులు వేలమయ్యాయి. ఆ

నాలుగు వస్తువులు కూడా ఆ పాటివ్యక్తే విడిపించు కున్నాడు.

సంజయ్ బుర్రలో ఒకే ఒక్క విషయం కదులుతోంది లీలగా. కుచేలరావు కంట్రాక్టర్ ద్వారా రెండో అంత స్తులో అదనంగా గాడర్లు వేయించాడు. గోడల్లో లెంటర్స్ వేయించాడు. ఎందుకు? రెండో అంతస్తు బరువును కప్పూ, గోడలూ భరించలేవని ఆయనకెందు కను మానం కలిగింది?

తటిల్లతలాంటి మెరుపేదో అతని బుర్రలో మెరుస్తూ, మెరుస్తూ ఆరిపోతోంది. అంతలో మరో రెండు వస్తువులు వేలమయ్యాయి. ఆ రెండు వస్తువులు కూడా ఆ పాటి వ్యక్తే విడిపించుకోడంతో మెరిసింది మెరుపు సంజయ్ బుర్రలో తళుక్కున!

"ఆగండి! వేలం ఆపెయ్యండి!" అరిచాడు.

"ఎందుకు? మళ్ళీ ఏమైంది?" అడిగాడు ఇన్స్పెక్టర్.

"ఈ వేలంలో బైటివాళ్ళేగాక, కుచేలరావు వారసులు కూడా పాల్గొనవచ్చా?"

"తప్పకుండా. ఎందుకు పాల్గొనకూడదు?" అన్నాడు శాంతిప్రకాశ్.

"ఐతే, నేను వాళ్ళతో కాసేపు సంప్రదించ దల చాను. ఇప్పుడు మధ్యాహ్నం పన్నెండున్నర అవుతోంది. ఇంతటిలో లంచ్ బ్రేక్ జేసి, భోజనాలయ్యాక మళ్ళీ ప్రారంభిద్దాం వేలాన్ని!"

శాంతిప్రకాశ్ తలూపి, "ఆల్ రైట్! మీ ఇష్టం!" అంటూ వేలాన్ని కట్టెయ్యమని పురమాయించాడు.

ఇంటివాళ్ళంతా భోంచెయ్యడానికి డైనింగ్ హాల్లోకి

నడిచారు. భోజనాలదగ్గర సంజయ్ అతిథులతో సంప్రదించి, ఓ నిర్ణయానికి వచ్చాడు. భోజనానంతరం మూడు గంటలకు మళ్ళీ ప్రారంభమైంది వేలం!

సంజయ్ కంఠం సర్దుకుని, "ఫ్రెండ్స్! కుచేలరావు వారసులంతా నన్ను తమ ప్రతినిధిగా ఎన్నుకుని వేలంలో పాల్గొనడానికి నియమించారు. వాళ్ళ తరఫున నేను పాటలో పాల్గొంటున్నాను. ఇక్కడ నాదో చిన్న లిటిగేషన్!

కుచేలరావుమీద మొత్తం పాతిక వేలఅప్పులున్నాయి. అవి తీర్చడానికే ప్రస్తుతం ఈ వేలం జరుగుతోంది గనక, విడిగా ఒక్కొక్క వస్తువూ వేలంవేస్తూ కాలం వృధా చేసుకునే బదులు, అన్నీ కలిపి ఒకేసారి వేలం వెయ్యడం మంచిదనుకుంటాను. నేనీ సామాను మొత్తం ఖరీదు పాతిక వేలతో ప్రారంభిస్తున్నాను."

"నో నో! అలా చెయ్యడం ఆక్షన్ రూల్సుకు విరుద్ధం!" పాయింటాఫ్ ఆర్డర్ లేవదీశాడా పొట్టి వ్యక్తి.

"మీ పేరు తెలుసుకోవచ్చా బాబూ?" అడిగాడు సంజయ్ వెటకారంగా.

"వేలాయుధం!"

"వేలాయుధంగారూ! వేలం పాతిక వేలతో ప్రారంభమైంది. పెంచదలచుకుంటే పెంచండి. అంతేగానీ, రూల్సూ, లిటిగేషన్లతో మా ప్రాణం తోడకండి" అన్నాడు సంజయ్ మొహం చిట్లిస్తూ.

"ఓ. కే! ఇరవైఆరు వేలు!"

"ఇరవైఏడు."

"ఇరవై ఎనిమిది!"

"ముప్పై."

"ముప్పైఐదు!"

"నలభై."

"యాభై!"

"లక్ష!!"

వేలాయుధం నోటికి బ్రేకుపడింది. మొదటిసారి అతని మొహంలో ఆందోళన కనిపించింది. జేబులోంచి కర్చీఫ్ తీసి, నుదుటికి పట్టిన చమట తుడుచుకుని, ఓసారి అటూ ఇటూ చూశాడు. అంతే!

మరుక్షణం అతని కళ్ళు తళతళ మెరిశాయి. ఆందోళన మాయమైంది. చిరునవ్వు నవ్వుతూ చెయ్యెత్తి- "లక్షా ఐదు వేలు!" అన్నాడు గట్టిగా.

చుట్టూ నిల్చున్న వాళ్ళంతా ఊపిరి బిగబట్టి చూస్తున్నారా తతంగాన్ని.

"లక్షాపది వేలు!"

"ఇరవై!"

"ముప్పై!"

"నలభై!"

"లక్షన్నర!!"

వేలాయుధం మొహం మళ్ళీ మారిపోయింది. కర్చీఫ్‌తో నుదురద్దుకుని అటూ ఇటూ చూశాడు. తిరిగి అతని కళ్ళు తళుక్కుమన్నాయి. "లక్షాఅరవై వేలు!" అన్నాడు గట్టిగా.

"ఇన్‌స్పెక్టర్! వీణ్ని అరెస్టు చెయ్యండి!" అన్నాడు సంజయ్ అంతకన్నా గట్టిగా.

"ఎందుకు? ఏమిటీ దౌర్జన్యం?" అన్నాడు వేలా
యుధం బిత్తరపోతూ. ఇన్‌స్పెక్టర్ ముందుకువచ్చి,
"అతను జేసిన నేరం ఏమిటి?" అడిగాడు ఆశ్చర్యంగా.

"కుచేలరావును చంపిన హంతకుణ్ని పట్టుకోవాలను
కుంటే నేను చెప్పినట్లు జెయ్యండి. వాణ్ని కస్టడీలోకి
తీసుకుని రండి ఇంట్లోకి!" అంటూ వెనుదిరిగాడు
సంజయ్.

ఇన్‌స్పెక్టర్ వెంట ఉన్న నలుగురు కానిస్టేబుళ్ళూ
వేలాయుధాన్ని చుట్టుముట్టారు. సంజయ్ వెనక అతన్ని
ఇంట్లోకి తీసికెళ్ళారు. వేలాయుధం ఇంకా అరుస్తు
న్నాడు. వాళ్ళ వెనకే అతిథులంతా బిలబిల వచ్చారు
లోనికి.

సంజయ్ వాళ్ళందర్నీ ఓ గదిలోకి తీసికెళ్ళి, వేలాయు
ధాన్ని ఓ కుర్చీలో కూర్చోబెట్టి. "చెప్పు! నువ్వు నీ
కోసం వేలం పాడుతున్నావా? లేక, నాలా మరొకరి
తరఫున పాల్గొంటున్నావా?" అడిగాడు గంభీరంగా.

"మీకా అనుమానం ఎందుకొచ్చింది?"

"ఎప్పుడైతే నా పాట లక్షకు పెంచానో, అప్పుడే
నీలో ఆందోళన కనిపించింది. ఖంగారుగా అటూ ఇటూ
చూశావ్! మరుక్షణం నీ ఖంగారు పటాపంచలై, పాట
పెంచేశావ్. రెండుసార్లు గమనించానలా!

నీవు మరొకరికోసం పాట పాడుతున్నావు గనకే,
నేను లక్షకు పెంచేసరికి సందిగ్ధంలో పడిపోయావ్
ఇంకా పెంచాలా, వద్దా అని.అందుకే గుంపులో నిల్చున్న
నీ బాస్ వైపు చూశావ్. అతను పాటపెంచమన్నట్టు
సైగ జేసి ఉంటాడు. అందుకే నిర్భయంగా పెంచుతూ
వచ్చావ్!

కేమంటే, ఇంట్లోని సామాను ఒక్కసారి కూడా చూడని నువ్వు, వాటి ఖరీదు ఎంతుంటుందో కూడా తెలియని నువ్వు ఏకంగా లక్షా అరవై వేలకి పాట పెంచుతావా? అవి ఎంత విలువజేస్తాయో నీకు తెలీకపోయినా, నన్ను నియమించిన వ్యక్తికి మాత్రం బాగా తెలుసు'' అంటూ అతిథులవైపూ, ఇన్‌స్పెక్టర్ వైపూ చూసి,

''ఆ అరవై లక్షల సంపత్తిని కుచేలరావు ఎక్కడ దాచాడో నేను ఊహించగలిగాను'' అన్నాడు సంజయ్ నవ్వుతూ.

''ఎక్కడ దాచాడు?'' అడిగింది సత్యవతి ఆత్రంగా.

''ఎప్పుడైతే కంట్రాక్టర్ శివసుందరం వచ్చి, కుచేలరావు తనద్వారా, భవనంపై అంతస్తులో కొత్తగాడర్లూ, లెంటర్లూ వేయించాడని చెప్పాడో, అప్పుడే దాని గురించి తీవ్రంగా ఆలోచించాను.

ఎన్నో ఏళ్ళనించి రెండవ అంతస్తు బరువు భరిస్తున్న కప్పూ, గోడలూ ఇప్పుడు భరించలేవేమోనన్న భయం కొత్తగా కుచేలరావులో ఎందుకు మొలకెత్తింది? అంటే, ఈ మధ్య అదనంగా రెండో అంతస్తుమీద కొంత బరువు చేరిందన్నమాట! ఏమిటా బరువు?

ఏ రోజైతే నేనూ, షీలా ఇక్కడికి వచ్చామో, మా కోసం ఏర్పాటుచేసిన గదుల్లోని మంచాలూ, గోడల చిత్రపటాలూ నా దృష్టి నాకర్షించాయి. మంచాలన్నీ కదపడానికి వీల్లేకుండా నేలలో పాతేసివున్నాయి. అలాగే చిత్రపటాలు కూడా గోడల్లో బిగించివున్నాయి.

ఇప్పుడు కూడా మీకర్థం కాలేదా? కుచేలరావు తన సంపదను ఏ విధంగా నిక్షిప్తం చేశాడో? ఒకప్పుడు వాళ్లది ఇత్తడివ్యాపారం గనక, ఇంట్లోని ప్రతివస్తువూ ఇత్తడితో

తయారుచేయించారు. కుచేలరావు తన సంపదనంతా బంగారంగా మార్చి, ఆ బంగారంతో మంచంకోళ్ళూ, పటాలఫ్రేములూ, ఇతరవస్తువులూ చేయించి అన్నీ పైఅంతస్తులోని గదుల్లో అమర్చాడు.

బంగారానికీ, ఇత్తడికీ రంగులో అట్టే తేడా వుండదు గనక, మిగతా ఇత్తడిసామానులో అవీ కలిసిపోయి ఎవ్వరికీ రవ్వంత అనుమానం కూడా కలగనివ్వకుండా దాగిపోయాయి. కుచేలరావు కోరుకున్నది కూడా అదే! ఏ వస్తువైనా గుప్పిట్లో దాగుంటేనే దానిమీద అందరికీ కుతూహలం కలుగుతుంది. కళ్ళెదురుగా ఎంతటి విలువైన వస్తువున్నా దానిగురించి ఎవ్వరూ పట్టించుకోరు.

అరవైలక్షల బంగారం పాతకాలపు లెక్కల్లో కొన్ని టన్నులు చేస్తుంది. అంత బంగారం వస్తువుల రూపంలో పైఅంతస్తులో అమర్చబడింది గనకే, కుచేలరావుకు దాని కప్పు, గోడలూ అంతబరువు మోయలేవేమో అన్న అనుమానం కలిగింది!

ఆ రహస్యాన్ని పసిగట్టిన హంతకుడు, వీలునామా తయారు కాగానే ఇంట్లోని వస్తువులన్నీ త్వరాగా వేలం వెయ్యబడాలన్న సాకు కోసం కుచేలరావుని చంపేశాడు. తన మరణానంతరం ఇంట్లోని సామానమ్మి తన అప్పులు తీర్చమని ఆయనే స్వయంగా చెప్పాడు గనక, ఆయన మరణించేవరకూ సామాను వేలంవేసే ప్రసక్తి వుండదు. గనక, కుచేలరావును చంపడం తప్పనిసరిగా భావించాడు.

వేలంలో తన ప్రతినిధిగా వేలాయుధాన్ని ఏర్పాటు చేసుకుని, అతని ద్వారా సామానంతా స్వంతం చేసుకుని, అరవైలక్షలకు తానే అధిపతి కావాలని పన్నాగం పన్నాడు!''

"మైగాడ్! నాకేమీ తెలియదు. వెయ్యిరూపాయల భత్యంమీద సేనతని తరఫున వేలంలో పాల్గొన్నాను. అంతే!" అన్నాడు వేలాయుధం వణికిపోతూ.

"ఇప్పుడు చెప్పు! ఎవరు నియమించారు నిన్ను?"

వేలాయుధం బెదురు చూపులతో అక్కడ నిల్చున్న వాళ్ళందర్నీ కలయజూశాడు.

"అందరిముందూ చెప్పడానికి భయపడుతున్నావా? ఆల్ రైట్. మీరంతా దయచేసి కాసేపు బైటికి నడవండి" అన్నాడు సంజయ్.

అతిధులందరూ అడుగులో అడుగు వేసుకుంటూ అవతలికెళ్ళారు. సంజయ్ ఇన్స్పెక్టర్ని దగ్గరికి పిల్చి, అతని చెవిలో ఏదో ఊదాడు. మరుక్షణం నలుగురు కానిస్టేబుళ్ళతో బైటికి నడిచాడు ఇన్స్పెక్టర్.

సంజయ్ నింపాదిగా జేబులోంచి సిగరెట్ కేస్ తీసి, ఓ సిగరెట్ వేలాయుధానికిచ్చి, తనొకటి వెలిగించుకున్నాడు. తరవాత, నెమ్మదిగా లేచి, గది కిటికీవైపు నడిచాడు. అప్పటికే బయట చీకట్లు ముసురుకున్నాయి. కిటికీ రెక్కలు తెరిచిపెట్టి, గదిలో లైటు వెలిగించి, తిరిగి వేలాయుధం ముందు చతికిలబడ్డాడు.

"ఇప్పుడు చెప్పు! వేలంపాటకు నిన్నెవరు నియమించారు?"

వేలాయుధం చెప్పడానికి నోరు తెరిచాడు. అంతే!

"ఢాం!"మన్న శబ్దంతో దిక్కులు పిక్కటిల్లాయి.

మరుక్షణం కిటికీ అవతల చీకట్లో చిన్న కేక వినిపించింది.

"వెరీగుడ్ ఇన్స్పెక్టర్! ఇక హంతకుణ్ని లోపలికి తీసుకురండి" అన్నాడు సంజయ్ సంతృప్తిగా.

ఆ శబ్దానికి హాల్లోవున్న వాళ్ళంతా గదిలోకి పరిగెత్తు కొచ్చారు.

రెండునిమిషాల తరవాత బూట్సులు టకటక చప్పుడు చేసుకుంటూ, కుడిచేతి గాయంనించి రక్తం కారుతున్న ఓ వ్యక్తిని లోపలికి తీసుకొచ్చారు పోలీసులు.

ఆవ్యక్తిని చూడగానే సంజయ్‌తోపాటు అక్కడున్న వాళ్ళంతా దిగ్భ్రాంతితో శిలాప్రతిమలైపోయారు. అతను ఎవ్వరోకాదు.

శాంతిప్రకాశ్! లాయర్ శాంతిప్రకాష్!!

"వండర్‌ఫుల్ మిస్టర్ శాంతిప్రకాశ్! వేలంపాట కోసం తనను నియమించిన వ్యక్తిపేరు చెప్పడానికి వేలా యుధం ప్రయత్నిస్తే హంతకుడు తప్పకుండా అతన్ని చంపడానికి ప్రయత్నిస్తాడని ఊహించే మీ అందర్నీ బయటికి పంపి, కిటికీరెక్కలు తెరిచిపెట్టాను.

ఐతే, ఆ హంతకుడివి నువ్వే అవుతావని మాత్రం నేనూహించలేదు!

ఇప్పుడర్థమైంది. ఆ రోజు రాత్రి నీ అంతట నువ్వే తల వెనకనించి వీపులో కత్తి దింపుకుని, కర్చీఫ్‌తో కుచేలరావుని చంపి, నీమీద ఎవ్వరికీ అనుమానం రాకుండే జాగ్రత్తపడ్డావన్న మాట!" అన్నాడు సంజయ్ సాలో చనగా తలూపుతూ.

లాయర్ తల వాలిపోయింది, యూరియా దొరకని పైరులా!

—:ఐపోయింది:—

# శత్రువులు ముగ్గురు?

## సుజనశ్రీ

"ఒరేయ్ అన్నాయ్! ఎలక్ట్రిక్ స్థంభానికి ఆనుకున్న వ్యక్తిని చూడు! ఇందాకట్నుంచి అక్కడే నిలబడి వున్నాడు. మన షాపువంకే చూస్తున్నాడు" అంది సునీత రోడ్డుమీదికి చూస్తూ.

"రోడ్డుమీద అనేకమంది తిరుగుతుంటారు అనేక పనుల మీద!" సమాధానం చెప్పాడు సునీత అన్న సుధీర్.

"అది కాదురా! అతడి చూపులు మామూలుగా లేవు. ఏ పులో మరో క్రూరమృగమో చూసినట్టుగా వున్నాయ్. ఎందుకో వాడి చూపులు నన్ను భయపెడుతున్నయ్."

"నువ్వు ఒట్టి పిరికిదానివి! అంతే! వాడు ఎవరికోసమన్నా ఎదురుచూస్తున్నాడేమో! పదినిమిషాలపాటు వాడివైపు చూడకు. ఆ తర్వాత వాడి మానాన వాడే పోతాడు. నీ భయమూ తీరిపోతుంది" సుధీర్ చెల్లెల్ని ఓదార్చాడు.

ఆ అన్నా చెల్లెలు కూర్చున్న షాపు పేరు "అపురూప స్టోర్స్". అందులో దైనందినానికి పనికివచ్చే సరుకులేవీ వుండవు. పేరుకు తగ్గట్టుగా అపురూపమైన వస్తువులే వుంటయ్.

చైనాలో తయారయిన పింగాణీ, జపాన్ తయారీ వాజ్‌లూ, ఆఫ్రికానుంచి వచ్చిన ఏనుగుదంతాలూ, పులి చర్మాలూ, పన్నా (మధ్యప్రదేశ్) నుంచి నగిషీ పెట్టిన వజ్రాలు, గంగానదిలోని మొసళ్ళ చర్మాలూ, తాబేటి చిప్పలూ, పాము చర్మాలూ యిలాంటివే వుంటయ్.

సుధీర్ తండ్రి సుకుమార్ జియాలజీలో ప్రొఫెసర్‌గా పనిచేసి రిటైర్ అయాడు. అతడు అగ్నిపర్వతాల గురించి భూమిపై రాలిన ఉల్కా శిధిలాల గురించి చాలా రీసెర్చి చేసివున్నాడు. యునైటెడ్ నేషన్స్ సైంటిఫిక్ అసోసియేషన్ సుకుమార్‌ని ఆనరరీ డైరెక్టర్‌గా నియమించింది ఆయన రిటైరైనాక కూడా!

ప్రపంచంలో ఎక్కడ అగ్నిపర్వతం బద్దలైనా, ఎక్కడ ఉల్క రాలినా, ఆ ప్రదేశానికి సుకుమార్ పంపబడేవాడు, సైంటిఫిక్ ఆర్గనైజేషన్ తరఫున. ఆ రకంగా సుకుమార్ ప్రపంచంలో అన్ని దేశాలూ తిరిగాడు. తాను వెళ్ళిన ప్రతిదేశాన్నుంచీ ఏదో ఒక అపురూపమైన వస్తువును తెచ్చి స్టోర్‌లో చేర్చేవాడు సుకుమార్.

గ్రీస్ దేశం నుంచి మూడువందల సంవత్సరాల క్రితం తయారుచేయబడిన పింగాణీ జాడీనికూడ తెచ్చాడు. దాని ఎత్తు ఆరడుగులు, వ్యాసం మూడడుగులు ఉంటుంది. సుమారైన మనిషి దాన్లో నిల్చుని దాక్కోవచ్చు.

అపురూపా స్టోర్స్‌లో వున్నవన్నీ అపురూపమైనవీ, అధిక వెల గలవీ అవటంవలన అక్కడ ప్రతిరోజూ అమ్మకం వుండదు. ఎప్పుడో ఏ లక్షాధికారో, లేక ఓడ దిగిన అమెరికన్ ధనికుడో ఆ స్టోర్సుకు వచ్చి, వెయ్యి నుంచి అయిదువేల వరకూ ధరపలికే ఏదో ఒక అపురూపమైన వస్తువుని కొనుక్కుని వెళ్ళేవాడు.

అలాగే అప్పుడప్పుడు ఓడ కళాసీలు, సరంగులూ వచ్చి తమవద్దవున్న విలువైన వస్తువుల్ని అపురూపా స్టోర్స్‌లో అమ్మి, డబ్బు తీసుకుపోతుండేవారు.

సుకుమార్‌కి ఇద్దరే సంతానం. సుధీర్, సునీత. సుధీర్ యం. యస్.సి చదువుతున్నాడు, కెమిస్ట్రీ సబ్జక్టుతో. తీరిక వేళల్లో స్టోర్స్‌లో కూర్చుంటాడు. అతడికి సహపాఠి, దూరపు బంధువూ అయిన రాజా కూడా వారింట్లోనే వుంటున్నాడు.

అపురూపాస్టోర్స్ పైభాగంలోనే వారి నివాసం. పైఅంతస్తులో ముందుగదిని ఆఫీసుగా చేసుకుని సుధీర్, రాజాలు డిటెక్టివ్ ఏజన్సీని నెలకొల్పారు.

ఇద్దరూ కెమిస్ట్రీలో వుద్దండులు గనుక పోలీసు డిపార్టుమెంటుకు తరచూ సాయపడుతుండేవారు. నేర పరిశోధనలో కెమికల్ ఎనాలిసిస్ చేయడంలోనూ, కార్బన్ టెస్ట్, ఫోర్సనిక్ పరీక్షలు జరపటంలో పోలీసు డిపార్టుమెంటుకు నేరస్థుల్ని ఆచూకీ తీయటంలో ఉపయోగపడేవారు. తద్వారా ప్రభుత్వం నుంచి బహుమతులు ముట్టేవి.

సునీత కాన్వెంట్‌లో కేంబ్రిడ్జి సర్టిఫికేట్ కోర్సుకు చదువుతోంది. అందమయినదీ చలాకీగల యువతి.

పదినిముషాలు గడిచాయి. రోడ్డుకవతలి మనిషి ఎలక్ట్రిక్ స్థంభం దగ్గరనుంచి కదలలేదు. సిగరెట్ మీద సిగరెట్ కాల్చేస్తున్నాడు.

అతడు ఆరడుగుల పొడవున్నాడు. అందుకు తగ్గ లావు, కోలముఖం, గ్రద్దముక్కు, చూపులతోనే పొడిచేస్తున్నంత వాడిచూపులూ, మనిషి చూసేందుకు కొంచెం భయంకరంగానే వున్నాడు.

కానీ అతడి డ్రెస్ గురించి, అతడ్ని దుర్మార్గుడిగా లెక్కించనక్కర్లేదు. నీలంరంగు, ప్యాంటు, ఎర్రని షైర్టు, చాక్లెట్ కలర్ కోటూ, నల్లగా నిగనిగలాడే బూట్లూ చేతికి ఎలక్ట్రానిక్ వాచ్, నెత్తిన ఈవెనింగ్ హ్యాట్ ధరించి వున్నాడు.

అతడు ఏదో లావాటి ప్యాకెట్ని, రెండుచేతుల్లో పట్టుకుని గుండెల కదుముకుని వున్నాడు. ఎవరో దాన్ని లాక్కుపోతారేమో అన్నంత గట్టిగా పట్టుకున్నాడు ఆ ప్యాకెట్ని.

"ఒరే అన్నాయ్! ఆ మనిషి పదినిమిషాల్లో వెళ్ళిపోతాడన్నావే! అతడు ఇంకా కదల్లేదు చూడరా! అతడ్ని చూస్తోంటే నాకేదో అనుమానంగా ఉంది!" సునీత మళ్ళీ అంది బెరుగ్గా చూస్తూ.

"వాడి తిప్పలేవో వాడు పడతాళ్ళే!"

"నీవెన్నన్నా చెప్పరా! వాడు ఏదో కానిపనికే నిలబడి వున్నాడని నా అనుమానం. మనదుకాణంలోంచి ఏదన్నా దొంగిలించుకుపోవటానికి అతడు పన్నాగం వేయటంలేదు గదా!"

"నీతో వాదించేందుకు నాకు టయిమ్లేదు. నేను లేబరటరీకి వెళ్ళిరావాలి. ఎవరన్నా కస్టమర్స్ వస్తే, మేడ

మీద నాన్నగారున్నారు. వారిని పిలు!" అంటూ సుధీర్ అక్కణ్నుంచి లేచి వెళ్ళిపోయాడు. వాకిట్లో స్కూటర్ని స్టార్ట్ చేసి రోడ్డుమీదికెళ్ళాడు.

సుధీర్ వెళ్ళిపోవటం చూశాడు ఎలక్ట్రిక్ స్తంభానికి ఆనుకుని వున్న వ్యక్తి. నోట్లోని సిగరెట్ని క్రిందపడేసి బూటుకాలితో దాన్ని రుద్దాడు.

నెమ్మదిగా రోడ్ క్రాస్ చేసి, అపురూపా స్టోర్స్‌లోకి అడుగుపెట్టాడు.

## 2

"గుడ్ మార్నింగ్ బేబీ! మీ నాన్నగారు లేరా!" అని అడిగాడు ఆగంతకుడు.

"ఉన్నారండీ! వారితో ఏం పనో చెబితే వారిని పిలవనంపుతాను" సునీత భయంభయంగా అంది.

"అది పర్సనల్. ఆయనతోనే మాట్లాడాలి!"

"అలాగయితే కూర్చోండి! ఒక్క నిమిషంలో వస్తారు" అంటూ తన ముందున్న టేబిల్‌కి అమర్చిన స్విచ్ నొక్కింది.

మేడమీద అలారం మ్రోగింది. కానీ సునీత తండ్రి ఆ సమయానికే లావెటరీకి వెళ్ళివున్నాడు. అందువలన అతడు వెంటనే రాలేదు.

కొద్దిక్షణాలు గడిచాయి. ప్యాకెట్ని తన ఒళ్ళోనే పదిలంగా పట్టుకుని కుర్చీలో కూర్చున్నాడు ఆగంతకుడు.

"బేబీ! మీ స్టోర్స్‌లో ఒక్క నిమిషం అంటే ఎంత సేపో తెలుపుతావా?" అన్నాడు ఆగంతకుడు తన వాచీ చూసుకుంటూ.

"ప్రపంచంలో ప్రతిచోటా నిముషానికెంత సేపో

ఇక్కడా అంతేనండీ!" చాల తెలివిగా సమాధానం చెప్పాననుకున్నది సునీత.

అతడి చేతిలోని ప్యాకెట్ ని చూస్తుంటే సునీతకు అనుమానం కలుగుతోంది. అందులో కొంపదీసి ఏదైనా బాంబు లేదుకదా! పైగా మనిషేమో నిముషాల్ని లెక్క పెడుతున్నాడు. ఏ క్షణంలోనైనా అది పేలుతుందేమో!

సినిమాల్లో టైంబాంబు టిక్ టిక్ మనటం చూసింది సునీత చాలాసార్లు. అలాగే అతడు ప్యాకెట్ లోంచి టిక్ టిక్ అనే శబ్దం ఏదైనా వస్తున్నదేమో అని చెవులు రిక్కించి ఆలకించింది.

ఆగంతకుడు స్టోర్స్ లో నలుమూలలా కలయజూస్తున్నాడు. ఉన్నట్టుండి అతడు కుర్చీలోంచి ఎగిరిపడ్డాడు. భయాన్ని నటిస్తూ, రోడ్డుమీదకు చూశాడు ఒక్క సెకెండు. ఒక్క దూకులో గ్రీస్ దేశపు జాడీ వెనక నక్కాడు.

"బేబీ! ఆ గుర్మార్గులు కాల్పులు జరుపుతున్నారు. నీవు చప్పున నేలబారుగా పడుకో!" అని అరిచాడు చాటు నుంచే!

అసలే అనుమానాలు పెనుభూతాలుగా ఆలోచిస్తున్న సునీత అతి వేగంగా టేబుల్ క్రిందకు దూరింది. రోడ్డు మీదనుంచివచ్చే తుపాకి గుళ్ళు తమ స్టోర్సులో ఎన్ని సామాన్లను ధ్వంసం చేస్తాయో అని ఆమె భయపడ సాగింది.

రెండునిముషాలు గడిచాయ్.

ఎక్కడో టక్ మన్న శబ్దం, ఆ తర్వాత ఎవరో పరుగెడుతున్నట్టుగా బూట్ల చప్పుడూ వినిపించాయి సునీతకు.

ప్రమాదం దగ్గరైనట్టు భయంతో కళ్ళు గట్టిగా మూసు కుంది.

ఆ తర్వాత ఇంకా ఏమీ జరగకపోవటంతో సునీత కళ్ళు తెరిచింది.

"ఏం సార్! ప్రమాదం గడిచినట్టేనా?" అనడిగింది, తనున్న చోటునుంచి లేవకుండానే.

అవతలినుంచి ఏ సమాధానమూ రాలేదు. గుండె నిబ్బరం చేసుకుని పైకి లేచింది సునీత. గ్రీస్ దేశపు జాడీ చాటున ఆగంతకుడు లేడు.

టేబుల్ కున్న స్విచ్ ని మరీ మరీ నొక్కింది సునీత. మేడమీద అలారం పదే పదే మ్రోగింది. సుకుమార్ హడావిడిగా దిగి వచ్చాడు స్టోర్స్ లోకి.

అదే సమయంలో స్కూటర్ మీద సుధీర్, రాజు ఇద్దరూ వచ్చారు.

# 3

భయంతో వణికిపోతున్న సునీతను చూసి "ఏం జరి గింది? ఏమయింది?" అనడిగారు.

సునీత కుర్చీలో కూలబడింది. రెండు చేతుల్లోను తల పట్టుకుని కూర్చుంది. సుధీర్ ఆమెకో గ్లాసు నీళ్ళందిం చాడు.

గటగటా గ్లాసెడు నీళ్ళు త్రాగాక సునీత మళ్ళీ తేరు కుంది. గుక్క త్రిప్పుకోకుండా గడగడా చెప్పసాగింది జరిగిన సంఘటన గురించి.

"ఆగాగు! మరీ అంత స్పీడుగా చెబితే ఎలా? ఒకొక్క విషయం సాకలనంగా చెప్పు! అతడు మన స్టోర్స్ లో ఏదైనా కొనటానికి వచ్చానన్నాడా? లేక

దేన్నైనా అమ్మాలని వచ్చానన్నాడా?'' డిటెక్టివ్ ద్వయంలోని రాజా అడిగాడు.

''అదేం చెప్పలేదు! నాన్నను చూడాలన్నాడు. అంతే!''

''ఆ తర్వాత ప్రమాదం గురించి నిన్ను హెచ్చరించాడా? నీవు గూడా దాక్కున్న తర్వాత అతడు చల్లగా మన స్టోర్స్‌నుంచి బయటకు జారుకున్నాడన్న మాట!''

''అవును! వాడి వాలకం చూసి అప్పుడే అనుకున్నాను, వీడెవడో ఘరానా గజదొంగ అయి ఉండాలని! కానీ నామాటని అన్నయ్య లక్ష్యపెడితేనా?'' సునీత అన్నవంక కొరకొరా చూసింది.

''నిజమే అనుకుందాం! నీ కళ్ళుగప్పి, మన స్టోర్స్‌లోంచి వాడు ఏదైనా దొంగిలించటానికి వచ్చిన దొంగే అనుకుందాం! ఏ వస్తువు పోయిందో! డాడీ! మన స్టోర్స్‌లో వస్తువులన్నీ మీకు కంఠతాయేగా! ఏది పోయిందో చెప్పండి!'' సుధీర్ అన్నాడు.

సుకుమార్ పాపు అంతా ఒకసారి కలయ జూశాడు.

''ఆశ్చర్యంగా ఉందే! మన స్టోర్స్‌లో ఏ ఒక్క వస్తువూ పోలేదు. అన్నీ యథాతథంగా ఉన్నయ్'' సుకుమార్ ఆశ్చర్యంగా చూశాడు.

''అయితే నా అనుమానమే నిజం!'' సునీత భయంగా అంది.

''ఏమిటి అది?'' ముగ్గురూ ఏక కంఠంతో అడిగారు.

''వాడి చేతిలోని ప్యాకెట్‌లో ఏదో బాంబు ఉంటుంది. నా కళ్ళుగప్పి, వాడు దాన్ని మన స్టోర్స్‌లో ఎక్కడో దాచిపెట్టి పారిపోయాడు.''

ముగ్గురి నవ్వులో స్టోర్స్ మారు మ్రోగిపోయింది.

"చాల్లే సునీతా! మరీ వెర్రిగా మాట్లాడకు. మన స్టోర్స్‌ని ప్రేల్చేయాలని ఎవరికి ఉంటుంది. మనకేం ప్రత్యర్థులు లేరు ఈ వ్యాపారంలో. నాన్నగారికిగూడ ఎవరూ అగర్భ శత్రువులు లేరు!" సుధీర్ బదులు చెప్పాడు.

"నా మాటలు ఎవరూ వినరు. ఎందుకైనా మంచిది. ఒకసారి స్టోర్స్ అంతా కలయజూడండి!"

నలుగురూ స్టోర్సు అంతా వెదికారు. గ్రీస్ దేశపు జాడీలో అడుగున పెద్ద గుడ్డపదేని ఉంది. దాంట్లో అప్పుడప్పుడు ఆ జాడీమీది దుమ్ము దులుపుతుంటారు. అందువలన ఎవరికీ దాని క్రింద ఏముందో అనుమానం రాలేదు. ఆ గుడ్డను తొలగించి చూడలేదు.

"బాంబ్ దొరికిందా షెర్లాక్ హోమ్స్‌గారూ?" అంటూ అన్నను వెక్కిరించింది సునీత.

సుధీర్ ఆమె మాటల్ని పట్టించుకునే స్థితిలో లేడు. నేలమీదకు వంగి పరీక్షగా చూస్తున్నాడు. అక్కడ నేల మీద బంగారు రంగులో మెరిసిపోతున్న అపురూపమైన పక్షి ఈక పడివుంది.

ఆ ఈకను చేతిలోకి తీసుకున్నాడు సుధీర్. అందరూ దానివంకే ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"మన పరిశోధనకు ఈ ఈక ముఖ్యమైన ఆధారం!" సుధీర్ గర్వంగా అన్నాడు.

"కానీ అతడి చేతిలో ఈక ఏమీ లేదే?" సునీత అడ్డు చెప్పింది.

"ఈ ఈక ఏదో రహస్య సంస్థకు సంకేతమై వుంటుంది. ఆగంతకుడు తన తొందరలో దీన్ని ఇక్కడ వదిలిపోయి వుండాలి. పొరబాటున అతడికి తెలియ

కుండానే జారిపోయి వుంటుంది. అయితే ఏ సంపక్షి సంకేతం సంబంధించిందో మనం కనిపెట్టవలసిన విషయం!" ఈకను పైకెత్తి పట్టుకొని అందరకూ చూపిస్తూ అన్నాడు సుధీర్.

"ఈ ఈక మనదేశానికి చెందిన పక్షిది కాదని నేను ఘంటాపథంగా చెప్పగలను" సుకుమార్ వక్కాణించాడు.

"ఎందుకు అనవసర వాదనలు. కార్బన్ టెస్టుచేసి చూస్తే దీని విషయం బయటపడదూ?" రాజు ప్రతిపాదించాడు.

"అదీ అసలు సంగతి. పద రాజూ! కాలేజీ లేబరేటరీకి వెళ్ళివద్దాం" అంటూ రాజును ఎక్కించుకుని స్కూటర్ని స్టార్టు చేశాడు సుధీర్.

"నీవు భయంతో నలిగిపోయావు పాపా! పైకివెళ్ళి విశ్రాంతి తీసుకో! స్టోర్స్‌లో నేను కూర్చుంటాలే!" అన్నాడు సుకుమార్.

సునీత మేడమీదకు వెళ్ళిపోయింది. సుకుమార్ కుర్చీలో కూర్చుని ఏదో ఇంగ్లిషు సైన్సు గ్రంథాన్ని చదవటంలో మునిగిపోయాడు.

రాత్రివేళకు సుధీర్, రాజు ఇల్లు చేరారు.

"డాడీ! అది ఏ పక్షిదో అంతుపట్టలేదు. లైబ్రరీకి వెళ్ళి పక్షులకు సంబంధించిన గ్రంథాలుగూడ తిరిగేశాం. లాభం కనబడలేదు. నాగరిక ప్రపంచంచూడని నోచుకొని పక్షిదన్నా అయివుండాలి ఆ ఈక, లేదా చాలా ఏళ్ళ క్రితమే అంతరించిపోయి అయినా వుండాలి ఈ ఈక కలిగిన పక్షి" అన్నాడు సుధీర్ భోజనాలముందు.

"పోనీ లెద్దూ! అంతుపట్టని ఆ ఈక గురించి ఇంత శ్రమపడడం దేనికిరా?" సుకుమార్ త్రోసి పుచ్చాడు.

## 4

రాత్రి పదకొండు గంటలు దాటింది. అమావాస్య రాత్రి కావటంవలన చీకటిగా వుంది. ఆ రోడ్డులో ట్యూబ్ లైట్లు కొన్ని వెలుగుతున్నయ్. కొన్ని వెలగటం లేదు. మరికొన్ని వెలిగి ఆరిపోవటం, ఆరిపోయి వెలగడం చేస్తున్నయ్.

ఏదో చిన్నగా అలికిడి అయింది. సుధీర్ కు చప్పున మెలకువ వచ్చింది. ప్రక్క బెడ్ మీదున్న రాజుని తట్టాడు. కానీ రాజు అప్పటికే కళ్ళు తెరిచివున్నాడు.

"క్రింద ఏదో శబ్దం అయినట్టులేదూ?" అనడిగాడు రాజు.

"అవునురా! నాకూ ఆ చిన్న అలికిడికే మెలకువ వచ్చింది" సుధీర్ బెడ్ మీద నుంచి లేస్తూ అన్నాడు.

గోడగడియారం టిక్ టిక్ మంటున్నది.

ఎక్కడో కిర్రుమని తలుపు తెరుచుకున్న చప్పుడు వినిపించింది మళ్ళీ.

ఇద్దరూ వులికిపాటుతో కిటికీలు తలుపులవంక చూశారు. అన్నీ వేసినవి వేసినట్లే వున్నాయ్.

"క్రింద స్టోర్సులో ఎవరైనా ప్రవేశిస్తే, బర్గ్లర్ అలారం మ్రోగాలి గదా?" సుధీర్ తన అనుమానాన్ని వ్యక్తంచేశాడు.

"ఏమో! దాన్ని మ్రోగకుండా చేశాడేమో ఆ దొంగ! ఈ రోజుల్లో మామూలు దొంగలు కూడా ఆరితేరి పోతున్నారు. రహస్య సంస్థల మెంబర్లయితే యిక చెప్ప నక్కర్లేదు."

ఇద్దరూ బెడ్స్‌మీద నుంచి లేచారు.

"అంకుల్‌ని గూడా లేపుదామా?" రాజా అడిగాడు.

"వద్దు! ఆయనతో బాటుగా సునీత గూడ మేల్కొం టుంది. పగలంతా అసలే భయపడిపోయింది. ఇప్పుడీ సంగతి వింటే అది యింకా బెంబేలు పడుతుంది."

ఇద్దరూ అడుగులో అడుగు వేసుకుంటూ, మెట్లు దిగారు. బయట మంచు పడులోంది. ఏమీ కనబడటం లేదు.

స్టోర్సులోకి అడుగుపెట్టారిద్దరూ. తమ ఊహల్ని అను మానాల్ని నిజంచేస్తూ, స్టోర్స్ తలుపు వారగా వేసివుంది. దాని తాళం పగులగొట్టబడింది. బర్గ్లర్ అలారం గూడ చెడగొట్టబడివుంది.

ఏమాత్రం శబ్దం కాకుండా తాళాన్ని ఛేధించటం అంత సులభమా? అయితే దాన్ని విరగ్గొట్టేందుకు యేదో ద్రావకాన్ని ఉపయోగించి వుండాలి. అంటే ఆగంతకుడు ఆధునిక పరికరాల్ని సైతం ధ్వంసంచేసే నేర్పరి అయి వుండాలి.

"తాళం చూశావా? బర్గ్లర్ అలారమ్ సైతం ధ్వంసం అయింది" రాజా చెవిలో చెప్పాడు సుధీర్.

లైటు వెలిగించకుండానే, ఇద్దరూ చీకట్లో ముందుకు పోతున్నారు. ఆ స్టోర్స్‌లో ప్రతిఅంగుళమూ వాళ్ళకు తెలుసు గనుక చీకట్లోకి గూడా దేనికీ గుద్దుకోకుండా నడుస్తున్నారు.

సుధీర్ ముందు నడుస్తున్నాడు పిల్లిలా. అతడ్ని అనుస రిస్తున్నాడు రాజా. ఆ నడవడంలో ఒకచోట రాజా కాలు జారి పడ్డాడు. అతడు పడడంలో ఏదో ఫ్లవర్ వేజ్‌ని క్రిందకు పడదోశాడు.

పెద్దశబ్దంతో ఫ్లవర్ వేజ్ క్రిందపడి ముక్కలై పోయింది. ఆ శబ్దానికి స్టోర్స్‌లో మరో చివర అలికిడైంది. ఏదో క్లిక్‌మన్న శబ్దం వచ్చింది.

"రాజా! నేలబారుగా పడుకో!" అన్నాడు చిన్నగా సుధీర్, తనూ నేలమీద వాలిపోతూ.

సుధీర్ ఊహ నిజమైంది. అతడి హెచ్చరిక సకాలంలో వచ్చింది. స్టోర్స్ మరో మూలనుంచి తుపాకీ ప్రేలింది. శబ్దంతోపాటు మంటగూడ వచ్చింది. వరుసగా రెండు బుల్లెట్లు వాళ్ళమీద నుంచి తలుపులోకి దూసుకు పోయాయి.

ఆ వచ్చింది మామూలు దొంగకాదు. హంతకుడు గూడా! అతడికి కావలసిన వస్తువును సాధించుకుపోవ టానికి ఎంతమందినైనా చంపటానికి వెనుదీయని గుండెలు దీసిన బంటు.

అంత క్రౌర్యానికి తెగించి, తమ స్టోర్స్‌లోంచి తీసుకు వెళ్ళవలసిన వస్తువు ఏమైవుంటుందా అని సుధీర్ తల బ్రద్దలు కొట్టుకుంటున్నాడు.

"రాజా! నీవు తలుపుదగ్గర కాపలా వుండు. నేను వాడ్ని తరుముకొస్తాను" సుధీర్ నేలమీద ప్రాకుతూ అన్నాడు.

రబ్బరుబూట్లు చకచక నడిచినయ్. ఆగంతకుడు తలుపు వైపుగాపోలేదు. మరో ప్రక్కనున్న కిటికీ తలుపు ధఢాల్న తెరిచాడు. ఆ కిటికీకి ఊచలులేవు. కిటికీలోంచి గభాల్న బయటకు దూకాడు ఆగంతకుడు.

ఆ కాస్త వెలుగులో ఆగంతకుడి ముఖం గుర్తుపట్టలేక పోయాడు సుధీర్. కానీ అతడి డ్రెస్ చూస్తుంటే, ఆ ఆకారం ముమ్మాటికీ ఉదయం ఎలక్ట్రిక్ స్థంభానికి

అనుకున్న వ్యక్తికది. తన చెల్లెలు అనుమానించిన దుర్మార్గుడిదే.

అతడి కుడిచేతిలో లాంగ్ బ్యారల్ రివాల్వర్ వుంది. మరో చంకలో తాను ఉదయం ఆగంతకుడి చేతిలో చూసిన ప్యాకెట్ వుంది.

క్షణాల్లో ఆగంతకుడు చీకట్లో కలిసిపోయాడు.

## 5

అపురూపా స్టోర్స్‌లో మర్నాడుదయం మళ్ళీ వెతుకులాట ప్రారంభించారు సుధీర్, రాజు. తలుపులోంచి దూసుకుపోయి రోడ్డుమీద పడిన బుల్లెట్స్ తప్ప, మరే ఆధారమూ దొరకలేదు.

“ఇంతకీ ఆ వ్యక్తి పగలు మన స్టోర్స్‌లోకి ఎందుకు వచ్చినట్టు, ఎందుకు వెళ్ళినట్టు? మళ్ళీ రాత్రికి యెందుకు ప్రవేశించాడు? యివన్నీ అంతుదొరకని పజిల్స్‌లాగా వున్నయ్.”

“మన స్టోర్స్‌లో ఏ వస్తువుని దొంగిలించాలో పగటి పూట ఎన్నిక చేసుకోవటానికి వచ్చివుంటాడు. దాని కోసమే రాత్రి వచ్చాడేమో! మధ్యలో మనం రావటంతో పారిపోయివుండాలి” రాజు తన ఊహల్ని బయట పెట్టాడు.

“ఆగంతకుడు షాపులోకి వచ్చిన మాట నిజమే! కానీ మన వస్తువులు దొంగిలించేందుకు మాత్రం కాదు! నిన్న ఉదయం అతడ్ని చూసినప్పుడు అతని చేతిలో యేదో ప్యాకెట్ వుంది. దాన్ని అతడు ఎక్కడనుంచో దొంగిలించి తెచ్చి వుండాలి! అతడి వెనుక ఎవరో వెంటాడుతూండడాన్ని గమనించి, ఆగంతకుడు తన ప్యాకెట్‌ని మన స్టోర్స్‌లో దాచాడు. తనను వెంటాడే వాళ్ళ పీడ

వహిలించుకున్నాడు. రాత్రి వేళ మళ్ళీ స్టోర్స్‌లో జొరబడి తను దాచిన వస్తువుని తీసుకెళ్ళేడు. అందుకే మన స్టోర్స్‌లోని ఏ ఒక్క వస్తువూ పోలేదు'' సుధీర్ పెద్ద పోజు పెట్టాడు.

"నీ ఊహ బాగానేవుంది. అతడికి సంబంధించిన ప్యాకెట్‌లో చాలా అపురూపమైన వస్తువే వుండి వుండాలి. దానికోసం అతడు హత్యలు చేసేందుకు గూడ వెనుకాడలేదు'' సుకుమార్ తన కొడుకును బలపరిచాడు.

"మరి మనకు దొరికిన బంగారు రంగు ఈకను ఆధారం చేసుకుని, ఆ రహస్య సంస్థను బయటకు లాగవచ్చు!'' సునీత ఈకను గుర్తుచేస్తూ అంది.

వారి సంభాషణకు అంతరాయం కలిగిస్తూ స్టోర్స్‌లోకి మరో నూతనవ్యక్తి ప్రవేశించాడు.

అతను అజానుబాహువు. తెల్లని ప్యాంటు, ఎర్రని షర్టు, ఆకువచ్చని టై, తెలుపురంగు కోటూ, ఈవెనింగ్ హ్యాట్ పెట్టుకుని వున్నాడు. మనిషి నల్లగా నీగ్రోజాతి వాడిలా వున్నాడు. అతడి ముఖంలో ఏవిధమైన భావా వేశాలూ లేవు. గంభీరంగా వున్నాడు.

కోటు పైభాగంలో, బంగారు రంగు ఈక గుచ్చబడి వుంది.

ఈ నూతనవ్యక్తిని చూసి అందరూ నిశ్చేష్టులై నిల బడ్డారు. ఈ వ్యక్తి మిత్రుడా లేక శత్రువా?

"క్షమించండి! మీ చర్చకు అడ్డు తగిలినట్టున్నాను. నా పేరు మామో! అండమాన్ ద్వీపాల్లో మారుమూల దైన కఠోరా ద్వీపం మాది. అక్కడ ఎల్లప్పుడు వేడిని వెదజల్లే అగ్నిపర్వతం ఉండడంవల్ల నాగరిక ప్రపంచం మా జోలికి రాలేదు. మా ఆటవిక సంప్రదాయిల్ని నాశనం

కాకుండా యిప్పటి వరకూ కాపాడుకు వస్తున్నాం!'' అన్నాడు మామో.

''అలా కుర్చీలో కూర్చోండి!'' అన్నాడు సుకుమార్. అగ్నిపర్వతం సంగతి వినగానే అతడిలో ఉత్సాహం వచ్చింది.

''ఇలాంటి బంగారు రంగు ఈకను నిన్నగాని లేక యివాళగానీ మీరు చూసివుండాలి'' అనడిగాడు మామో.

''అవును! నిన్న వుదయం ఒక నూతనవ్యక్తి చేతిలో పెద్ద ప్యాకెట్ తో మా స్టోర్స్ లోకి వచ్చాడు. తన ప్యాకెట్ ని మాకు తెలియకుండానే, మా స్టోర్ లోనే దాచాడు. మళ్ళీ రాత్రికి తలుపుబద్దలుకొట్టి ప్రవేశించాడు. అడ్డగించబోయిన మాపై కాల్పులు జరిపాడు. తనవస్తువును తాను ఎత్తుకుపోయాడు'' సుధీర్ జరిగిన విషయం చెప్పాడు.

''నేనతన్ని అనుసరిస్తూనే వున్నాను. కానీ క్షణాల్లో అతడు కనుమరుగైపోయాడు.''

''ఆ ప్యాకెట్ లో ఏముందో మీకు తెలుసా?'' రాజా అడిగాడు.

''తెలును! కలోరా ద్వీపంలో ఆటవికులకు నేను నాయకుడ్ని. మాకు అతిపురాతనమైనదీ, అపురూపమైనదీ అయిన వైఢూర్య కిరీటాన్ని ఆ దురాత్ముడు కాజేసుకుని వచ్చాడు. దానికి బంగారు రంగుగల ఈకలు కొన్ని తగిలించి వున్నయ్ గూడ. బహుశా దాన్ని మీకు అమ్మి డబ్బుచేసుకుని పోదామని మీ వద్దకు వచ్చాడేమో!''

''మా వద్దకు అమ్మేందుకు ఏ వస్తువుని ఎవరు తెచ్చినా సరే, అది అతడిదేనని ఋజువు పరచేవరకు మేం దాన్ని కొనం!''

"చాల సంతోషం. మీ అబ్బాయిలు డిటెక్షన్ పనులుగూడ చేస్తుంటారని విన్నాను. మీరెలాగయినా సరే ఆ కిరీటాన్ని మళ్ళీ మాకు అప్పగిస్తే, అందుకు తగిన బహుమానాన్ని ఇచ్చుకోగలను."

సుధీర్ రాజాలు చంక లెగరేశారు.

"ఆ వైఢూర్య కిరీటం వెల అమెరికన్ మార్కెట్‌లో మిలియన్ డాలర్లు. అంతేకాదు. క్షణాలు దొర్లేకొద్దీ ఆ కిరీటం చేతులు మారి మానుంచి అంతకంతకూ దూరమయే ప్రమాదం వుంది. పైగా మా ప్రజల్లో మరో ప్రగాఢ నమ్మిక మొకటుంది."

"ఏమిటది?"

"ఆ కిరీటంలో ఏవో అద్భుత శక్తులున్నాయనీ, ఆ శక్తులే మా దీవిని, మా ప్రజల్ని ఎల్లప్పుడూ కాపాడుతున్నాయనీ వాళ్ళ నమ్మకం. మాకందరికీ సలహాదారు మాంత్రిక శక్తుల్ని వశం చేసుకున్న స్త్రీ "కహునా" చెప్పిన మాటలివి.

"అందుకే ఆ కిరీటం అదృశ్యమయిన కొద్దిక్షణాల నుంచి మా ప్రజలలో నిరాశ ఆవరించింది. ఈ పరిణామం వల్ల ప్రజల్లో చాలామంది చనిపోతారటమో, లేక అగ్ని పర్వతం బ్రద్దలై దీవి నేలమట్ట మయేందుకు యిది వొక్క దుశ్శకునమో అనీ భావిస్తున్నారు." మామో ఆవేశంగా చెప్పుకు పోతున్నాడు.

"బాగానేవుంది. నాయకుడుగా మీ ఆదుర్దాను మేం అర్థం చేసుకోగలం. ఇంతకీ ఆ కిరీటాన్ని ఎవరు కాజేసి వుంటారు? మీ అనుమానం ఎవరిమీదవుంది?" సుకుమా రడిగాడు.

"నెల క్రితం మా దీవికి ఒకవ్యక్తి వచ్చాడు. అతడి వెంట ఇంకా ఇద్దరు అనుచరులున్నారు. ఏవో భూగర్భ పరిశోధనల గురించి వచ్చామన్నారు. ఎవరికీ అనుమతి యివ్వని మాంత్రికురాలు "కహునా" వాళ్ళని అందుకు అనుమతించింది.

"వాళ్ళు అగ్నిపర్వతం దగ్గర రహస్యగుహలో వున్న కిరీటాన్ని చూశారు, అక్కడవుండే భటుల్ని వంచించి. మరో వారం తర్వాత కిరీటం మాయమయింది. గుహకు కాపలా కాస్తున్న ఇద్దరు ఆటవికులూ చంపబడ్డారు. ఆ రకంగా రెండువందల యాభైసంవత్సరాలనుంచీ మా దీవి దాటిపోని వైఢూర్య కిరీటం మాయమయింది."

"మీరా దొంగల్ని వెంటాడుతూ వచ్చారా?"

"అవును."

"ఇంతకీ ఆ వ్యక్తి ఎవరో చెప్పగలరా?"

"మిస్టర్ విలియం బ్రూక్స్! అతడి నివాసం మద్రాసు లోనే. వాడి అనుచరుడు రాబర్ట్."

"మాకు తెలుసు అతడు! అతడు బ్రూక్స్ కాదు, క్రూక్! అతడు ప్రయివేటుగా జూ, జంతుప్రదర్శన శాలను నడుపుతున్నాడు. కానీ తెరవెనుక మొసళ్ళ చర్మాల్ని, పాము చర్మాల్ని విదేశాలకు పంపుతుంటాడు పెద్ద లాభాలకు."

# 6

ఆ తర్వాత సుధీర్, రాజులు తమ పరిశోధనలో విలియమ్ బ్రూక్స్, అతడి అనుచరులు ఆరోజు ఫ్లైట్ కే అండమాన్స్‌కి వెళ్ళినట్టు తెలుసుకున్నారు.

"ఇక నేం! ఆ దొంగలందరూ తిరిగి కకోరా దీవిలోకే వెళ్తారు. కలుగులోని ఎలుకల్ని పట్టినట్టుగా వాళ్ళా దీవి

నుంచి బయటపడకముందే మనం వాళ్ళను పట్టుకోవాలి. ఆ కిరీటాన్ని దక్కించుకోవాలి'' సుధీర్ యెగిరి గంతేశాడు.

''అయితే ఆ దుండగులు మా దీవిలోని సంపదలను కొల్లగొట్టుకొచ్చుకోవడానికి మళ్ళీ వెళ్ళారన్న మాట,'' మామో తన కోటుజేబులోంచి చిన్న గుడ్డసంచీనితీశాడు. అందులో బంగారు కాసులున్నాయి.

''మీ కరెన్సీ మాకు లభ్యంకాదు. అందుకే బంగారాన్ని ఇస్తున్నాను. ఇవన్నీ కలిపి పదివేల రూపాయలు అవతయ్. మీ ఖర్చులకు ఇవి. కిరీటం మాకు అందించేక మరో మొత్తాన్ని ఇవ్వగలను!''

''థాంక్స్ మిస్టర్ మామో! మనకు ఆట్టే టయిము లేదనుకుంటాను.''

వెంటనే సుధీర్ ఎయిర్ లైన్స్ ఆఫీసుకి వెళ్ళి అయిదు టిక్కెట్లు రిజర్వు చేసుకువచ్చాడు, తర్వాతి ఫ్లైట్ కి.

పోర్టుబ్లయర్ లో మోటారుబోట్ ఒకటి అద్దెకు తీసుకొని ఐదుగురు 'కకోరా దీవి'కి చేరుకున్నారు.

రాత్రి గాఢాంధకారం. కీచురాళ్ళ రొదతో మరీ భయంకరంగా వుంది.

అగ్నిపర్వతం వేడివలన అక్కడి అడవుల్లో పాములుగానీ, క్రూరమృగాలుగాని లేవని నాయకుడు చెప్పాడు. అగ్నిపర్వతం చాలా సంవత్సరాల క్రితమే ప్రేలిపోయిందట. ఇప్పుడది ప్రమాదభరితం కాదన్నాడు.

అడవి ప్రక్కగా ప్రయాణించారు తెల్లారేదాకా. సంవత్సరాలక్రితం అగ్ని పర్వతంనుంచి స్రవించిన లావా పీఠభూమిపై వాళ్ళు నడుస్తున్నారు.

తెల తెలవారుతుండగానే పక్షుల కిలకిలారావాలతో ప్రకృతి మేలుకొంది.

సుధీర్, రాజు ఇద్దరూ సన్నగొంతుతో కబుర్లు చెప్పుకుంటూ వెనకగా నడుస్తున్నారు. మాటల్లో వారిద్దరు దారి ఎప్పుడు తప్పారో చూసుకోలేదు.

ఇద్దరూ దారి తప్పామని తెలుసుకున్నాక, దాపునే వున్న ఒక కొండగుట్ట ఎక్కి చుట్టూ పరికించసాగారు. కొండ క్రిందుగా ఏదో రాయి దొర్లింది. జరాజరా క్రిందకి దొర్లుకుంటూ పోయింది.

ఇద్దరూ క్రిందకు వంగి చూశారు.

ఎవరో వ్యక్తి కొండ ఎక్కుతున్నాడు. అతడి కాలు ఏదో వదలుగావున్న రాయిమీద పడింది. రాయి దొర్లి పోయింది. ఆ వ్యక్తి పడబోయి తమాయించుకున్నాడు.

అతడి చేతిలో రైఫిల్ వుంది. చంకకు వ్రేలాడుతున్న సంచిలో సగం ప్యాకెట్ బయటకు కనబడుతున్నది.

"వెదకబోయిన తీగ కాలికి తగిలిందంటే ఇదేమరి. వాడే రాబర్ట్." సుధీర్ ఆశ్చర్యంగా చూశాడు.

"అలా ఆ దోవనపోతే మనం త్వరగా వాడ్ని అడ్డగించగలం!" అన్నాడు రాజు ఆనందంగా.

"వెంటనే పద. కానీ వేసే ప్రతి అడుగూ జాగ్రత్తగా చూసివెయ్యి. మనకాలు తగిలి ఏదయినా రాయి దొర్లిందో వాడూ మనల్ని ఇట్టే కనిపెట్టేస్తాడు. పైగా వాడిచేతిలో రైఫిల్ వుంది చూశావా!" సుధీర్ హెచ్చరించాడు.

కానీ కొండ ప్రాంతాల్లో ఎంత జాగ్రత్తగా నడచినా కాలు జారక మానదు. చిన్నదో చితకదో రాయి క్రిందకు దొర్లక తప్పదు. రాజు కాలుతగిలి ఒకరాయి క్రిందకు దొర్లింది.

క్రిందినుంచి కొండ యెక్కుతున్న రాబర్ట్ వులిక్కి పడ్డాడు. వెంటనే ఆ శబ్దంవచ్చిన వేపుగా గురిచూసి రైఫిల్ ని కాల్చాడు.

ఆ దెబ్బ సుధీర్, రాజులకు తగలలేదు. కానీ మరో రాయికి తగిలింది. పెళుసురాయి అవటంవలన పెంకులు గాలిలోకి లేచి పడినయ్.

సుధీర్, రాజులు మరో ప్రక్కనుంచి నక్కుతూ ముందుకు వెళ్ళారు. ఒక్కక్షణం గడిచేక రాయిచాటు నుంచి క్రిందకు చూశారు.

అక్కడ రాబర్ట్ లేడు.

“వాడు ఏదో ప్రమాదాన్ని పసిగట్టి, తనదోవమరల్చు కొని వుంటాడు! ఎలాగిప్పుడు?” రాజా నొచ్చుకున్నాడు.

ఇద్దరూ చాటుమాటుగా నక్కి నేలమీద ఎగబ్రాకు తున్నారు. రాబర్ట్ ఎక్కడయినా కనబడతాడేమో అని వెయ్యికళ్ళతో వెతుకుతున్నారు.

అన్నివేపులా వెతికి వేసారి ఒక గుహాదగ్గరకు చేరు కున్నారు.

“వాడి చేతిలో రైఫిల్ వుంది. మనకోసం వాడు ఎక్కడో మాటు వేసుకొని కూర్చున్నాడని నా అనుమానం” అన్నాడు సుధీర్.

“ఈగుహ ఎక్కడకు పోతుందో లోపలకు వెళ్దామా” రాజా గుహాలోకి చూశాడు.

“ఏమీ చెప్పలేం! కొన్ని గుహాలు మరో మార్గం లేకుండా మధ్యలోనే అంతమవుతాయి. మరికొన్ని మలు పులు తిరిగి కొండ మరోవైపుకు తీసుకువెడతాయి.”

# 8

ఇద్దరూ గుహలో నడవసాగారు. కొంతదూరం పోయే సరికి నడవ మరీ సన్నమయింది. ఒక్కరు మటుకే దూరే త్రోవ వుంది.

ఆ త్రోవనే మరో నాలుగడుగులు ముందుకు వెళ్ళేసరికి వెలుతురు కనిపించింది. చప్పుడు చేయకుండా జాగ్రత్తగా ముందుకు పోతున్నారు.

ఆ దోవ మరో గుహ ప్రదేశానికి దారితీసింది. గుహా ద్వారంలో రాబర్ట్ నిలబడి కొండక్రిందకు చూస్తున్నాడు రైఫిల్ చేతులో పుచ్చుకొని.

సుధీర్, రాజా ఇద్దరూ కళ్ళతోనే సైగ చేసుకున్నారు. చేతులమీదా, మోకాళ్ళమీదా ప్రాకుతూ వెళ్ళారు.

పాము చెవులు రాబర్టువి. ఈ కొత్త అలికిడిని పసిగట్టనే పసిగట్టాడు. గభాల్న వెనుదిరిగి చూశాడు.

సుధీర్ నేలమీద రాళ్లుతీసి అతడిపై రాళ్ళవర్షం కురిపించాడు. రాజా గుప్పిళ్ళతో మట్టినితీసి రాబర్ట్ మొఖాన విసిరాడు.

రాబర్ట్ రైఫిల్ ని గురిపెట్టి కాల్చాడు. అంతలో సుధీర్ విసిరిన రాళ్లు తగిలినాయి. గురి తప్పిపోయింది. రైఫిల్ పొజిషన్ మారింది. పై కప్పులోకి రెండుగుళ్ళు దూసుకుపోయినాయి. రాళ్ళవర్షం కురిసినట్టుగా పై కప్పులోని లూజ్ రాక్ నేల రాలింది.

ఇదే తగిన అదనుగా, సుధీర్ బులెట్ లా దూసుకుపోయి తన తలతో రాబర్ట్ కడుపులో గుద్దాడు. రాబర్ట్ నేలమీద వెల్లకిలా పడిపోయాడు. రాజా అతడి మీదకెక్కి గుద్దుల వర్షం కురిపిస్తున్నాడు.

నేలమీద పడిపోయిన రైఫిల్ ని అందుకున్నాడు సుధీర్.

"రాస్కెల్! మామీదే కాల్పులు జరుపుతావురా! నిన్నేం చేస్తామో చూడు" అన్నాడు కసిగా.

సుధీర్ ఒకప్రక్కగా పడిపోయిన పార్సెల్ ని అందుకున్నాడు. ఆ అట్టపెట్టె మూతతీసి చూశాడు. కాంతులీనుతూ వైఢూర్య కిరీటం మెరిసిపోతోంది లోపల. తిరిగి దాన్ని మూసేశాడు. ఈ రాబర్టుపీడ విరగడ చేసేస్తే, ఇక తాము తాపీగా మిగతాపని చూసుకోవచ్చు.

రాబర్టుని కట్టిపడేసేందుకు ఏదయినా తాడు దొరుకుతుందేమో అని అన్నివేపులా చూశాడు సుధీర్. కానీ విధి వారికి వ్యతిరేకంగా వుంది.

ఇంతక్రితం రాబర్టు పై కప్పులోకి ప్రేల్చినచోట మళ్ళీ సంచలనం మొదలయింది. పైనుంచి రాళ్లూ, మట్టీ పడసాగాయి. కొంపదీసి భూకంపం రాలేదుకదా అనుకున్నారు.

పైకప్పులో పెద్దరంధ్రం ఏర్పడింది. అందులోంచి మట్టిపడిన తర్వాత ఒకయువతి జారి క్రిందపడింది. ఆమె బెల్ బాటమ్ ప్యాంటూ, స్లాకూ వేసుకునివుంది.

"ఎవరూ? సునీతా! నీవా?" సుధీర్ ఆశ్చర్యపోయాడు.

"ఏమయినా దెబ్బలు తగిలాయా?" అంటూ రాజా ఆమెకు చేరువగావెళ్ళి, చేయూతనిచ్చి లేవదీశాడు.

అంతే! రాబర్టు పిడికిలి బిగించి సుధీర్ వెన్నులో గుద్దాడు. సుధీర్ పడిపోయాడు నేలమీద. అతడి చేతిలోని రైఫిల్ దూరంగా పడింది. రాబర్టు దాన్ని అందుకున్నాడు.

సుధీర్ చెల్లెలు, సునీత డొక్కలో రైఫిల్‌ని ఆనించాడు.

"మీ చిట్టి చెల్లెలు ప్రాణాలతో వుండాలంటే, ఆ పార్సిల్ ఇటివ్వండి!" రాబర్టుకళ్ళు కర్కశంగా చూస్తున్నాయి. అతడి ముఖంలో క్రూరత్వం ఉట్టిపడుతోంది.

సునీతకు క్షణాల్లో పరిస్థితి అర్థమయింది. "అన్నయ్యా! రాజూ! పార్సిల్‌ని ఇవ్వవద్దు. అతడు కేవలం బెదిరిస్తున్నాడు. ఆడపిల్ల నెవరన్నా కాల్చి చంపుతారా? ఆ పార్సిల్‌లో వైఢూర్య కిరీటమే గనక వుంటే, నా ప్రాణాలు పోయినా ఫర్వాలేదు. దాన్ని మటుకు వదలు కోకండి" సునీత ఏడుస్తూ అంది.

"ఒరే! పందివెధవా! నీవూ, నీ కిరీటమూ ఎట్లాగన్నా తగలబడండి. నా చిట్టి చెల్లెలికి అపకారం జరిగిందో నిన్ను ప్రాణాలతో వదలం!" సుధీర్ వెర్రిగా అరిచాడు.

రాబర్టు పార్సిల్‌ని అందుకున్నాడు. భుజానికున్న సంచిలో వేసుకున్నాడు దాన్ని. రైఫిల్‌తో అందర్నీ బెదిరిస్తూ "నేను పూర్తిగా ఇక్కడ్నుంచి వెళ్ళిపోయే దాకా ఎవరన్నా గుహ బయటకు వచ్చారో, వాళ్ళతలలు ఎగిరిపోతాయి" అని హెచ్చరించాడు.

వెనకగా అడుగులు వేస్తూ, రాబర్టు అక్కణ్నుంచి కనుమరుగయి పోయాడు.

సునీత భోరుమంది. "ఇదంతా నా మూలంగానే జరిగింది. చేతికి వచ్చిన కిరీటాన్ని తిరిగీ మనచేతులతోనే దాన్ని ఆ దుర్మార్గుడికి అప్పగించాం. ఈ అనర్థానికంతా నేనే మూలం!" అంటూ ముఖాన్ని చేతుల్లో దాచుకొని ఏడుస్తోంది.

"ఊరుకో సునీతా! ఏడవకు. మనుష్యుల ప్రాణాల కన్నా ఆ కిరీటం విలువయినదేమీ కాదు. నిన్ను ముందు

రక్షించుకో గలిగితే ఆ కిరీటాన్ని మళ్ళీ సొరకట్టువచ్చుకో గలం!'' సుధీర్ చెల్లెల్ని ఓదార్చాడు.

''అవును సునీతా! మీ అన్నయ్యా చెప్పిందే నిజం. జరిగిపోయినదానికి విచారించి లాభంలేదు. సమయంమించి పోకముందే తిరిగి ఆ దుర్మార్గుడ్ని పట్టుకోవాలి, పదండి,'' రాజు కర్తవ్యాన్ని గుర్తు చేశాడు.

ముగ్గురు మళ్ళీ నడక సాగించారు.

''నీవు జారిపడినప్పుడు భలేగా భయపడ్డాంలే భూకంపం వచ్చిందేమో అని. బహుశా ఒకటి జరిగివుండాలి. పైకప్పు చాలా దళసరిగా వుండివుంటుంది. రాబర్టు కాల్పులవలన రాయిపగిలి పెళ్ళలు పెళ్ళలుగా రాలింది. అదే సమయంలో పైన ఆ భాగంలో నడుస్తోన్న సునీత పైనుంచి జారి క్రిందపడింది.'' సుధీర్ ఊహాగానాన్ని వ్యక్తంచేశాడు.

''అడవిలో నేనూ దారితప్పి కొండ ఎక్కుతున్నాను. రైఫిల్ షాట్ వినిపించి, ఒక గుహలో దూరాను. ఆ మార్గంనుంచే వస్తూండగా మళ్ళీ రైఫిల్ షాట్ వినిపించింది. వెంటనే కాళ్ళకింద నేల విచ్చిపోసాగింది...'' చెప్పింది సునీత. ఆమె భయం ఇంకా పూర్తిగా తొలగి పోలేదు.

## 9

ఎత్తయిన ప్రదేశంలో నిర్మింపబడిన విశాలమైన గుడిసె ముందు దీవి నాయకుడు మామో, అతడిప్రక్కన సుకుమార్ కూర్చునివున్నారు.

సుధీర్, రాజులను చూస్తూనే వారు ఆనందించారు. ప్రశ్నల వర్షం కురిపించారు. అలాగే సుధీర్, రాజులకూడ

సుకుమార్‌నీ, మామోని ప్రశ్నలతో నింపేశారు. తరువాత రాబర్టుతో తమ అనుభవం చెప్పారు.

"వాడు అశపాతకుడు. మా దీవిలో ఇంకా యేమేం అపురూప మయిన వస్తువులున్నాయో తస్కరిద్దామని వచ్చాడు," మామో పళ్ళు కొరికాడు.

"మనం త్వరపడితే తప్ప, రాబర్టు చేతిలోంచి కిరీటం తీణాల్లో ఈ దీవినుంచి వదిలిపోవటం ఖాయం."

"ఇక మీరు విశ్రాంతి తీసుకోండి, మా దీవిలో చేరిన దుర్మార్గుల్ని దీవిదాటి పోనిస్తామా! ఇప్పటికే మీరు ప్రాణాలకు తెగించి సాహసం చేశారు. ఆ కిరీటం ఎక్కడుందో ఎవరి దగ్గరుందో చెప్పారు. ఇక పరిస్థితిని నేనే ఎదుర్కొంటాను" మామో ఆవేశంగా అన్నాడు.

"ఇంతవరకూ వచ్చాక మిమ్మల్ని ఒంటరిగా వదిలేస్తామా? పైగా ఆ రాబర్ట్ చేతిలో రైఫిల్ కూడా వుంది."

"సుధీర్! మామో చెప్పేది నిజం! ఇక మీరు విశ్రాంతి తీసుకోండి!" సుకుమార్ లాలనగా అన్నాడు.

"అదేమిటి డాడీ మీరు అలానే అంటారు. అక్కడ శత్రువులు ముగ్గురు! ఇంతమందినీ నాయకుడొక్కడే ఎదుర్కోగలడా?" సుధీర్ అనుమానంగా చూశాడు.

"ఒక్కడే వెడతాడని ఎవరన్నారు? అతడివెంట నేనుంటాను. రాబర్ట్ రైఫిల్‌కి నా రివాల్వర్‌తో సమాధానమిస్తాను."

మామో, సుకుమార్ అక్కణ్నుంచి వెళ్ళిపోయారు.

నేలమీద గడ్డిని పీకుతూ కూర్చున్నారు సుధీర్, రాజులు! అంతలో అక్కడికి నాయకుడి కొడుకు ఓలూ వచ్చాడు.

"మా నాన్న ఎక్కడ?" అడిగాడు.

"మీ నాన్న, మా నాన్న కిరీటంకోసం వెళ్ళారు" సుధీర్ బదులు చెప్పాడు.

ఓలూ ఆ మాటలు విని పాట్ట చెక్కలయ్యేలా నవ్వాడు. "ఏమిటీ? వయసు మళ్ళిన వాళ్ళు యుద్ధానికి పోతే యువకులు మీరిక్కడ గోళ్ళుగిల్లుకుంటూ కూర్చున్నారా! పదండి మనమూ వెళ్ళి వారికి సహాయ పడదాం!"

సుధీర్, రాజూ, ఓలూ బయలుదేరారు. సునీత తాను ఒక్కర్తే వుండలేననీ, తనుగూడ వస్తాననీ పట్టుపట్టింది. ఆమెను ఒంటరిగా విడవటం ఇష్టంలేక ఆమెగూడ వెంట రాగా ముందుకు సాగారు.

# 10

"మనం అందరం ఒక మూకగా వెళ్ళేబదులు మూడు వేపులగా వెడదాం. రాబర్ట్ ఎక్కడైనా కనబడితే మిగతా వారికి సైగచేయాలి. అప్పుడు అందరం కలిసి వాడి భరతం పట్టాలి" అన్నాడు సుధీర్.

కానీ వాళ్ళ ప్లానుని అమలుపరచకముందే, రాబర్ట్ ఆ దాపులనే ఉన్నట్టుగా రైఫిల్ షాట్ వినవచ్చింది.

అందరూ ఉలికిపడ్డారు. ఆ షాట్ సుకుమార్‌నిగానీ మామోనిగానీ ఉద్దేశింపబడిందేమో!

అంతలోనే రైఫిల్ షాట్‌కి ప్రతిగా రివాల్వర్ ప్రేలింది. సుధీర్‌కి సంతోషం వేసింది.

మరి నాలుగడుగులు వేసి కొండ ఎక్కేసరికి, వారికి పరిస్థితి అర్థమైంది. దూరంగా ఒకవేపు కొండరాయి వెనుక విలియమ్ బ్రూక్స్, రాబర్ట్, మరో అనుచరుడు నక్కి వున్నారు.

ఎదురుగా ఫర్లాంగు దూరంలో మరో పెద్ద రాయి

చాటున సుకుమార్, మామో దాక్కొనివున్నారు. ఇద్దరూ ఒకరిపై ఒకరు కాల్పులు జరుపుకుంటున్నారు. ఇరుపక్షాల వద్దా ఆయుధాలుండడంతో దాక్కొన్నచోటు నుంచి ఎవరూ పైకి లేవలేని స్థితిలోవున్నారు.

నలుగురూ కళ్ళతో సైగ చేసుకున్నారు. గుప్పిళ్ళ నిండా రాళ్ళు ఏరుకున్నారు. తాము కూర్చున్న చోటు నుంచీ, అంటే మూడో దిశ నుంచి బ్రూక్స్ వర్గం పైకి రాళ్ళవర్షం కురిపించారు.

ఆ రాళ్ళు తగిలితే ఎవరూ చావరు. కానీ అవి తగిలిన వాళ్ళు గాయపడడం మాత్రం నిస్సందేహం!

కొండపై నుంచి రాళ్ళు దొర్లి పడుతూండడంతో బ్రూక్స్‌వర్గం గాభరాపడ్డారు. ఏదో కొత్త ప్రమాదం ముంచుకొస్తూన్నదని ప్రాణభయంతో అక్కడనుంచి పైకిలేచారు.

అదను గమనించిన సుకుమార్ రివాల్వర్ పేల్చాడు. అతడి గురి తప్పలేదు. రాబర్ట్ చేతిలోని రైఫిల్ ఎగిరి పోయింది. అతడి చేతికి గాయమై రక్తం స్రవించ సాగింది.

ఎప్పుడైతే రైఫిల్ ఎగిరిపోయిందో మామో అతడి అనుయాయులు ఆ ముగ్గుర్నీ చుట్టుముట్టారు. సుకుమార్ తన రివాల్వర్ గురిపెట్టి నిల్చున్నాడు. రాజా క్రిందపడిన రైఫిల్‌ని తీసుకుని మరో ప్రక్క నిలబడ్డాడు.

కహోరా దీవి నాయకుడు రాబర్ట్ భుజానికి వ్రేలాడు తున్న సంచీలోంచి ప్యాకెట్‌ని లాక్కున్నాడు. అట్ట పెట్టె తెరిచి వైఢూర్య కిరీటాన్ని పైకి ఎత్తి పట్టు కున్నాడు. ఓలూ ఆనందంతో ఆటవిక భాషలో పాట పాడుతూ నాట్యం చేశాడు.

"అయ్యో! మిలియన్ డాలర్లు పోయాయే!" రాబర్టు విలపించాడు పెద్దగా.

మామో కిరీటాన్ని అట్టపెట్టెలో పెట్టాడు. తిరిగి సంచిలో ఉంచేశాడు. శత్రువులు ముగ్గురినీ నాయకుడి అనుచరులు బంధించారు.

# 11

ఆటవికుల చేతులలో కాగడాల కాంతిలో వైఢూర్య కిరీటం మెరిసిపోతోంది.

ఆటవికులు ఆనందంతో పెద్దగా అరుస్తూ చిందులు త్రొక్కుతూ ముందుకు సాగుతున్నారు.

గుడిసెముందు "కహునా" కకోరాదీవి మాంత్రిక రాలు జుట్టు విరబోసుకొని దెయ్యంలా నిలబడివుంది.

మరుక్షణంలో మామో కంఠం అంతటా మారుమ్రోగి పోయింది.

"నా ప్రియతమ ప్రజలారా! ఈ కహునా తనమంత్ర శక్తుల్ని ఎప్పుడో కోల్పోయింది. వయస్సు పైబడి, శక్తి తరిగిపోతున్న ఆమెకు అధికార వాంఛ ప్రబలింది. ఆమె అనుమతితోనే తస్కరులు మన దీవిలో అడుగుపెట్టారు. ఇద్దరు ఆటవికుల్ని బలిగొన్నారు. వైఢూర్య కిరీటాన్ని ఎత్తుకపోయారు. దీని కంతటికీ, ఈ అనర్థానికంతటికీ కారణం ఈ కహునాయే!

"కనుక ఈ సంఘటనలతో ఈనాటినుంచి మంత్రగత్తెగా ఆమె కివ్వబడే గౌరవహోదాలను రద్దు చేస్తున్నాను. రేపట్నుంచి ఆమె కేవలం మీలో ఒకరు. ఇందుకు మీరేమంటారు?"

ఆటవికులంతా ఏక కంఠంతో నాయకుడ్ని బలపర చారు. వైఢూర్యకిరీటం తిరిగి దొరికిన సందర్భంగా మరు నాడు వేడుక జరగాలని నిర్ణయించబడింది.

## 12

కళోరాదీవి అంతా కోలాహలంగా ఉంది వేడుకలతో, పాటలూ, నృత్యాలూ మహావైభవంగా వుంది.

ఎత్తైన వేదికపై కూర్చుని తిలకిస్తున్నారు మామో, ఓలూ, సుకుమార్, సుధీర్, సునీత, రాజు.

"మామో! నీవు కోపం తెచ్చుకోనంటే, ఒక చిన్న సలహా చెబుతాను" అన్నాడు సుకుమార్.

"మీకంటే నాకు ఆప్తులు యెవరు? అవశ్యం చెప్పండి!"

"ఈ వైఢూర్య కిరీటాన్ని దొంగిలించటానికి వ్యర్థ ప్రయత్నాలు జరిగాయన్న వార్త యివాళ కాకపోయినా రేపయినా బయటి ప్రపంచానికి తెలుస్తుంది. అప్పుడు యింకా అనేకమంది దుర్మార్గులు దీన్ని కాజేయటానికి రంగంలోకి దూకుతారు?"

"ఆఁ! ఈ సారి మంచి బందోబస్తు యేర్పాటు చేయనూ?"

"అంతకష్టం ఎందుకు? ఈ నాగరిక శకంలో గూడ మీ దీవి ప్రజలు అనాగరికులుగానే మిగిలిపోయారు. ఈ కిరీటం మీ వద్ద వున్నందువల్ల ఒరిగేది యేమీ లేదు. పైగా దాన్ని కాపాడవలసిన బాధ్యత కత్తిమీద సాము వంటిది."

"అందుకని ఏం చేయమంటారు నన్ను?"

"ఈ వైఢూర్య కిరీటాన్ని ప్రపంచవ్యాప్తిగా ప్రకటించి వేలం వెయ్యి. కనీసం మిలియన్ డాలర్ల ధర పలుకుతుంది. ఆ డబ్బుతో మీ దీవిలో మంచి మంచి బంగళాలు కట్టించు. మీ ప్రజలకు విజ్ఞానాన్ని పంచి పెట్టేందుకు విద్యాలయాల్ని ఏర్పాటు చేయి. జనరేటర్లతో విద్యుచ్ఛక్తిని తయారు చేసుకోవచ్చు. ప్రపంచ పటంలో మీ దీవిని సస్యశ్యామలం చేయి. మణిదీపంలా వెలిగేలా చేయి!"

మామో తల నిమురుతున్నాడు. పదేపదే తన ముందున్న కిరీటాన్నీ, సుకుమార్‌నీ మార్చి మార్చి చూడసాగాడు.

"మీరు చెప్పిన ఆలోచనా బాగానేవుంది! కానీ కాబోయే నాయకుడు నా కుమారుడు ఓలూ అభిప్రాయం గూడ తెలుసుకుంటే మంచిదేమో!" అంటూ కుమారుడి వంక చూశాడు మామో.

"వారు చెప్పిందే సమంజసంగా వుంది. ప్రజల సంక్షేమానికి ఉపయోగపడని ధనం నిరుపయోగం!" అంతవరకూ మౌనంగా వింటున్న ఓలూ అన్నాడు.

"ఇంకేం! ఆ వేలం ఏర్పాట్లేవో మీరే చూడండి!" మామో సంతోషంగా అన్నాడు.

"అంతేకాదు. మీరు అనుమతిస్తే ఓలూను మా వెంట తీసుకువెడతాం. మద్రాసులో చదువు పూర్తి చేస్తాడు."

ఓలూ ఎగిరి గంతేశాడు. కృతజ్ఞతా పూర్వకంగా, కూర్చున్న చోటునుంచి లేచివచ్చి, సుకుమార్‌కి అభివందనం చేశాడు.

"అదీగూడ బాగానే వుంది. పైగా వాడ్ని నాయకుడ్నిగా చేసేందుకు ఇంకా చాలా వ్యవధి వుంది. ఈలోగా బాగా చదువుకుంటాడు. నిజంగా మీలాంటి మంచివారి స్నేహం లభించటం మా అదృష్టం! కాదు, కాదు, మా దీవి ప్రజల అదృష్టం!"

నృత్యం చేస్తున్న ఆటవికుల గుంపు వేదిక మీదకు వచ్చారు. ఒక్కొక్కరికీ చేయూతనిచ్చి క్రిందకు దించారు. క్రిందకు దిగిన ప్రతిఒక్కరూ ఆటవికులతో పాటు ఆనందంతో నృత్యం చేయటంలో తమను తామే మైమరచిపోయారు.

—:ఐపోయింది:—

సీరియల్

# అడుగు ముందుకు వేస్తే భస్మం!



వసుంధర

(నాలుగవ భాగము)

రామేశం తన మిత్రులతో విషయం చర్చించాడు.

"ఇంతవరకూ మామూలు యాత్రా ప్రదేశాలు చూశాం. ఇలాంటి ప్రాంతం కూడా ఒకటి చూడాలని ఉంది. మామూలుగా కార్లలో వెళ్ళి రావడంలో ఏముంది? ఇబ్బందులతో కూడిన ప్రయాణమొకటి చేయాలనివుంది..." అన్నాడు టాగూర్. మిగతా ఇద్దరూ కూడా అతన్ని బలపరిచారు.

"అయితే నేనూ సిద్ధమే!" అన్నాడు రామేశం.

ఆ రాత్రికి వాళ్ళు ప్రెసిడెంటు యింట్లో విశ్రాంతి తీసుకున్నారు.

ఒక రాత్రివేళ వాళ్ళ గదిలో నలుగురికీ విచిత్రమైన అనుభూతులు కలిగాయి. ఎవరో మీదపడి తమ గొంతు నొక్కుతున్నట్లూ ఆ అటవీపుల ప్రాంతానికి వెళ్ళవద్దని గుసగుసలాడినట్లు చెవిలో చెప్పినట్లూ నలుగురికీ అనిపించింది. వాళ్ళలో ఎవ్వరు కూడా ఆ వ్యక్తుల్ని ప్రతిఘటించలేకపోయారు. ఇంకో విశేషమేమిటంటే ఆ వ్యక్తులు తెలుగువాళ్ళను తెలుగులోనూ, హిందీవాళ్ళను హిందీలోనూ హెచ్చరించాయి.

మర్నాడుదయం లేవగానే నలుగురూ ఈ విషయాన్ని ఒకరితో ఒకరు చెప్పుకుని ఆశ్చర్యపడ్డారు. ప్రెసిడెంటుకు చెబితే ఆయన రవంత కూడా ఆశ్చర్యపోలేదు.

"అక్కడ ఓ దేవత వుందంటారు. నాగరికులు తన ప్రాంతాల అడుగుపెట్టడం ఆ దేవతకి ఇష్టముండదని అంటారు. రాత్రి మీరు పొందిన అనుభవం ఆ దేవత కారణంగానే కలిగి వుంటుంది."

"ఇదంతా నాన్సెన్స్" అన్నాడు టాకూర్. అతడికి భయానికి బదులు ఆసక్తి పెరిగింది. ఏమైనా సరే ప్రయాణం కొనసాగించాలని అతననుకున్నాడు.

రామేశానికి ప్రెసిడెంటు గురించి ఒక సందేహం వచ్చింది. అతడు పరమమూర్ఖుడేనా అయుండాలి. లేదా చాలా తెలివైన వాడయివుండాలి. రెండోది నిజమైతే ఆ కొండదారిలో ఏదో రహస్యముండివుండాలి. అదేమిటో తెలుసుకోవాలి!

"మీకు ఇప్పుడు నాన్సెన్స్‌లాగే వుంటుంది. ప్రాణాల మీదికి వచ్చినప్పుడు తెలుస్తుంది" అన్నాడు ప్రెసిడెంటు. తానన్న మాట జరిగితీరుతుందన్న నమ్మకం ప్రెసిడెంటు మాటల్లో స్పష్టంగా ధ్వనించింది.

రామేశం రి ప్రశ్నాలంపాటు ఆలోచించి "మాకు ప్రాణ భయంలేదు. ఎందుకంటే మేము బాధ్యతగల ప్రభుత్వోద్యోగులం. మేమిక్కడ ఏదో పనిమీద వచ్చినట్లు ప్రభుత్వానికి తెలుసు. మాకే ఆపద జరిగినా భారీ ఎత్తున రక్షించడానికి ఏర్పాట్లు జరుగుతాయి. అప్పుడు ఏ దొంగ దేవతలూ వాళ్ళను ఆపలేరు. ఒకసారి తెలుసుకోవాలను కున్నాక మమ్మల్నెవ్వరూ వారించలేరు" అన్నాడు.

ప్రెసిడెంటు ముఖంలో కలవరపాటు కనబడింది— "నాకు మిమ్మల్ని చూస్తే అనుమానంగానే వుంది. ఈ విషయం ముందే చెప్పాల్సింది. ఇప్పుడైనా మించిపోయింది లేదు. మీ ప్రయాణానికి నేను ఏర్పాట్లు చేయిస్తాను. ఆపైన భగవంతుడే వున్నాడు. ఎటొచ్చీ ఈలోగా నేనీ ఊళ్ళోని యితర పెద్దల్ని సంప్రదించాలి. మేము మొత్తం పదిమందిమి."

రామేశం ఆశ్చర్యంగా "మీ ఊరికీ ఆ కొండదారికీ సంబంధమేమిటి? ఎవరైనా ఆ కొండదారిలో వెళ్ళాలనుకుంటే ఊళ్ళోని పదిమంది పెద్దలు కలిసి సంప్రదించాల్సిన ఆవశ్యకత ఎందుకొచ్చింది?" అనడిగాడు.

"నాగరికుల రాకను ఆటవికులు హర్షించరు. మా సహకారం ఉంటేతప్ప ఆ కొండదారిలో వెళ్ళి ఆటవికుల ప్రాంతంచేరడం ఎవ్వరికీ సాధ్యపడదు. అందువల్ల నాగరికులు వాళ్ళను జేరితే అందుకు మాదే బాధ్యతగా భావించి మా ఊరిమీద మెరుపుదాడి చేస్తారు ఆటవికులు. ఆ దాడి మేము భరించలేము. అందుకే ఊళ్ళోని పెద్దలు కొందరు కలిసి కొన్ని ఏర్పాట్లు చేశాము..." అన్నాడు ప్రెసిడెంటు.

ఆయన ముఖం చూస్తేనే రామేశానికి అనుమానాలు పెరుగుతున్నాయి. ఏదో సరదాగా ఓ ఆటవిక ప్రాంతాన్ని చూద్దామనుకుంటూంటే వ్యవహారమింత కాంప్లికేటెడ్ గా తయారవుతుందని ఆయన అనుకోలేదు.

ప్రెసిడెంటు ఊరిపెద్దలందరకూ కబురంపించాడు. కరణం, మునసబు, గ్రామపురోహితుడు, పెద్దషావుకార్లిద్దరు, డాక్టర్లిద్దరూ, ఇద్దరు భూస్వాములు ప్రెసిడెంటు గారిల్లు చేరారు. ప్రెసిడెంటు చెప్పిందంతా విన్నాక ఒకొక్కరే రామేశం బృందానికి హితవు చెప్పడానికి ప్రయత్నించారు. వాళ్ళు వినరని తెలిసేక ఊరి పెద్దలందరూ రహస్యంగా చాలాసేపు చర్చించారు. చర్చలన్నీ అయ్యేక "రెండు రోజులు గడువు కావాలి మాకు" అన్నాడు ప్రెసిడెంటు.

రామేశం అనుమానాలు బలపడ్డాయి. ఈ రెండు రోజుల్లోనూ ప్రెసిడెంటు బృందం తమను అనుమతిస్తారన్న నమ్మకంలేదు. ఇక తామే స్వతంత్రించాలి. ఆ విషయం తనవాళ్ళతో సంప్రదించాడు.

"ప్రమాదాలంటే నాకు భయంలేదు. ఈ రోజే ఆ మాటకొస్తే ఈ క్షణంలోనే బయల్దేరాలని నాకుంది. అనవసరంగా రెండురోజులు వేస్ట్ చేయకూడదనుకుంటున్నాను" అన్నాడు టాకూర్. శౌరీ, జోగారావు కూడా ఆ మాటలకు వత్తాసు పలికారు.

అందరూ చిన్నయ్య హోటల్లో భోంచేశారు. కారు అవసరం లేకపోయినా టాక్సీవాలా తన టాక్సీని చిన్నయ్య సంరక్షణకు వదిలి వీళ్ళతో బయల్దేరి రావడానికి తయారయ్యాడు.

"మొత్తం అయిదుగురం! నిరాయుధులమై ప్రమాదకరమైనదిగా చెప్పబడుతున్న ప్రాంతానికి వెడుతున్నాం. అదీ ప్రమాదకరమైన పరిస్థితుల్లో" అన్నాడు రామేశం.

"మనమంతా ప్రమాదాన్ని ఎదుర్కోవాలి తప్పితే ఇక మీదట ప్రమాదం గురించి ఆలోచించకూడదు, మాట్లాడకూడదు" అన్నాడు టాక్సీవాలా. అందరికంటే అతడి ఉత్సాహం అధికంగా కనబడుతోంది.

"మనకెవ్వరూ దారిచూపక్కరలేదు. సాయంచేయనక్కరలేదు. ఒకరి అనుమతితో మనకు నిమిత్తంలేదు. బయల్దేరి పోదాం." అన్నాడు జోహారీ.

చిన్నయ్య హోటల్లోంచి రెండురోజులకు సరిపడ పదార్థాలు కొనుక్కున్నారు. అన్నీ రెండు సంచులలోకి తరలించారు. ఊరుచూడ్డానికి బయల్దేరినట్లుగా అయిదుగురూ కదిలారు.

కాసేపు పొలాల్లో మసిలి నెమ్మదిగా తమ మార్గాని కొండవేపు మళ్ళించారు. కొండను సమీపించగా వారికి సన్ననికాలిబాట కనబడింది. ఆ కాలిబాటల అయిదుగురూ ఒకరి వెనుక ఒకరుగా నడుస్తున్నారు. క్రమంగా వారి నడక వేగం హెచ్చింది.

మొదటి రెండు కిలోమీటర్ల దూరంలో వాళ్ళకేమీ విశేషాలు ఎదురుకాలేదు. దారికికూడా అటూయిటూ రాళ్ళే కనబడుతూ వచ్చాయి. ఆ తర్వాతనుంచి మాత్రం మార్గం నెమ్మదిగా అరణ్యంలోకి దారితీసింది.

వారిదారి తిన్నగాలేదు. రకరకాలుగా మెలికలు తిరుగుతోంది. ఆ కాలిబాట గుర్తులేకపోతే__తామేదారిన వెడుతున్నదీ తెలుసుకోడం చాలా కష్టం.

(సశేషం)

